శ్రీగురుభ్యోనమః

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము

## జాబులు - జవాబులు




రచయిత

"పరిపూర్ణ దర్శనాచార్య, సదానంద"

శ్రీ యిలపకుర్తి వీరవెంకటరామ చంద్రరావు

నర్సాపురం, ప॥గో॥జిల్లా

శ్రీగురుభ్యోనమః

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము

## జాబులు - జవాబులు




రచయిత

"పరిపూర్ణ దర్శనాచార్య, సదానంద"

**శ్రీ యిలపకుర్తి వీరవెంకటరామ చంద్రరావు**

నర్సాపురం, ప॥గో॥జిల్లా

శ్రీగురుభ్యోనమః

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము

## జాబులు - జవాబులు



రచయిత

"పరిపూర్ణ దర్శనాచార్య, సదానంద"

**శ్రీ యిలపకుర్తి వీరవెంకటరామ చంద్రరావు**

నర్సాపురం, ప॥గో॥జిల్లా



వెల రూ. **20.00**

శ్రీ గురుభ్యోనమః



శ్రీ కూన బాషయ్య శేటు
శ్రీమతి లక్ష్మీబాయి
నిజామాబాద్

# శ్రీ గురుభ్యోనమః

ఈ గ్రంధమునకు ద్రవ్య సహాయము చేసిన శ్రీ కూన భాషయ్య శేటుగారి జీవిత చరిత్రలోని కొన్ని ముఖ్య విషయములు.

స్వస్తిశ్రీ శ్రీముఖనామ సం॥ శ్రావణ శుద్ధపంచమి రోజున దాదాపు 1933 సంవత్సరములో నిజామాబాద్ జిల్లా ఆర్మూర్ తాలూకా సిరికొండ మండలము తూంపల్లి గ్రామ కాపురస్తులు శ్రీ కూన వెంకయ్య, వీరవ్వ పుణ్యదంపతుల గర్భవాసమున జన్మించిరి. వీరికి ఇద్దరు చెల్లెండ్లు, ఇద్దరు అక్కలు ఒక అన్నగారు ఉన్నారు. విధివ్రాత ఎంత బలీయమైనదో కాని శ్రీ భాషయ్య శేటుగారి 4 సంవత్సరముల పసిప్రాయముననే వీరి తల్లిగారైన శ్రీమతి వీరవ్వ బ్రహ్మైంక్యము చెందినారు. అప్పటినుండి వీరినాయనమ్మ గారైన శ్రీమతి రాజమ్మగారు పోషించుచుండిరి.

వీరు స్వగ్రామమైన తూంపల్లిలో 5వ తరగతి వరకు విద్యాభ్యాసము చేసిరి. అంతలో వీరి అన్నయ్యగారు విభానము కావుటవలన వీరి విద్యాభ్యాసము మానవలసివచ్చినది.

వీరికి 12వ ఏటనే శ్రీపార్థివ నామసంవత్సరము వైశాఖమాసము 1945 సంవత్సరములో శ్రీమతి లక్ష్మీబాయి గారితో కరీంనగర్ జిల్లా జగిత్యాల తాలూక వెంకట్రావు పేట గ్రామములో వివాహము జరిగెను. అప్పుడు వీరి ధర్మపత్నిగారి వయస్సు 7 సంవత్సరములు మాత్రమే. వీరి వివాహము జరిగిన 5 సంవత్సరములకు వీరి నాయనమ్మగారు బ్రహ్మైంక్యము చెందిరి.

వీరు స్వగ్రామమైన తూంపల్లిలో కిరాణా, బట్టల వ్యాపారము మరియు వ్యవసాయము కూడ చేయిస్తూ జీవితము గడపసాగిరి. వీరికి చిన్ననాటినుండి భక్తి, భజన సంకీర్తనములు అన్న చాలా మక్కువ.

కరీంనగర్ జిల్లా సిరిసిల్లా తాలూక తూర్పు నిజామాబాద్ గ్రామములో శ్రీ అయిత కాశయ్య గారనే గురువుగారు ఉండిరి. ఆధ్యాత్మిక జీవనము చాలా మంచిది అందుకు ధర్మోపదేశము తప్పనిసరి అనగా విని శ్రీబాషయ్య శేటుగారుశ్రీ అయిత కాశయ్యగారి వద్ద ఉపదేశము పొందిరి. కొంతకాలము గడిచిన తర్వాత వీరు నిజామాబాద్ పట్టణములో కమీషన్ వ్యాపారము 1968 సంవత్సరములో శ్రావణ శుద్ధసప్తమి రోజున వీరి బావగారైన శ్రీ లాబిశెట్టి కిష్టయ్య గారితో కలసి వ్యాపారము

ప్రారంభము చేసిరి. తర్వాత వీరికి బోధ ధర్మమర్మములు తెలియకపూర్వమే వీరి గురువుగారైన అయిత కాశయ్యగారు బ్రహ్మైక్యము చెందిరి. అప్పటినుండి బోధ గురించిన ధర్మమర్మముల గురించి తెలుసుకోవాలనే తపన వీరికి ఉండెడిది. మరియు వీరి పెద్దకుమారుడు చి॥రాజయ్య - వరలక్ష్మి దంపతులకు కూడ ఉపదేశము తీసుకోవాలని తపన ఉండెడిది. ఒకరోజు వీరివద్ద పనిచేస్తున్న గుమాస్తా జి. సాయిలుగారి కూమార్తె వివాహములో శ్రీ ఆరుగొండ విశ్వనాధం గారి పరిచయము కలిగెను. తరువాత శ్రీ విశ్వనాధం గారితో మాకు ధర్మోపదేశము ఇప్పించమని-కోరిరి. అందుకు సమర్థులైన వారు శ్రీ విజ్ఞానానంద మంచిరాజు శ్రీనివాసమూర్తిగారేనని వారిని సంప్రదించాలని చెప్పిరి. వీరియొక్క తపనచూచి శ్రీ విజ్ఞానానందులవారితో సంప్రదించి వారి ఆజ్ఞను పొంది వీరిని 1992 సంవత్సరములో యర్రబాలెం తీసుకువెళ్ళిరి. 1992 చైత్రమాసములో ఏప్రిల్ 8వ తేదీన శ్రీ బాషయ్య శేటుగారు వీరి ధర్మపత్ని శ్రీమతి లక్ష్మీబాయి గారు మరియు వీరి పెద్దకుమారుడు చి॥ రాజయ్య - వరలక్ష్మి గారలు ధర్మోపదేశము పొందిరి. అప్పటినుండి వీరు గురువుగారి ఆజ్ఞప్రకారము అనుష్టానము అచరణ విచారణలను ఆచరిస్తూ జీవితముధన్యత పొందినామని పరమసంతృప్తితో అన్నారు.

వీరి ధర్మపత్ని గారైన శ్రీమతి లక్ష్మీబాయి గారు 1995వ సంవత్సరములో ఆశ్వయుజ బహుళత్రయోదశి ది. 22-10-1995 రోజున బ్రహ్మైక్యము చెందిరి.

ఇట్లు

**ఆరుగొండ విశ్వనాధం**



# ముందుమాట

పరిపూర్ణ దర్శనాచార్య, సదానంద శ్రీ యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు గారు, శ్రీ అచల ఋషి దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారి అనుగ్రహముచే వారి దివ్యాశీస్సులతో శ్రీ శివరామ దీక్షితీయ సాంప్రదాయమును తమ గ్రంథ రచనల ద్వారా బహుళ ప్రాచుర్యము చేసి పాఠక లోకమును ఉత్తేజితులుగా జాగృతమొనరించినారు. వారి శిష్య ప్రశిష్యులు వలయు ఆర్థిక సంపత్తిని సమకూర్చి వారి గురుభక్తిని వ్యక్తపరచుకొనుచునే ఉన్నారు.

అంతేకాక గురుధర్మ నిర్వహణలో శ్రీరామచంద్రరావు గారు దంపతులు జరిపిన కృషిని, గడిపిన ఆదర్శవంతమగు జీవితమును లోకములో ప్రచారం చేయుటకై గురుదేవుల ఆశయ సంసిద్ధి కొరకు "శ్రీశ్రీశ్రీ సీతారామచంద్ర పరిపూర్ణ బోధోపదేశ మందిర సంస్థ"ను గుంటూరు జిల్లా, మంగళగిరి మండలం, యర్రబాలెం గ్రామంలో ఏర్పాటుచేసి శ్రీ గురుదేవుల ఆదర్శమును లోక కళ్యాణార్థము వివరించడంలో వారికి గల సహాయ సంపత్తిని అందించుచున్నారు. ఇది సహృదయులు సంతసించి ప్రోత్సహించవలసిన అంశము.

శ్రీ రామచంద్రరావు గారి రచనలన్నియు వారి గురు దేవులు శ్రీ శివరామ దీక్షితీయ పీఠాధిపతులైన దయానంద పొన్నాల రాజయోగీంద్రులవారి దివ్యశ్రీ చరణములకు పూజాపుష్పములుగా సమర్పింపబడియున్నవి. అట్లే యీ భాగం కూడా యొక పూజాపుష్పంగా వారి చరణ సన్నిధి చేరాలని భక్తమండలి వారి తరపున శ్రీ గురుపరమాత్మను ప్రార్థించుచున్నాము.

ఇట్లు
భక్తమండలి తరపున
మంచిరాజు శ్రీనివాసమూర్తి

# పీఠిక

రాజయోగ వేదాంత మాసపత్రిక నా సంపాదకత్వముచే 1965 జూలైనుంచి 1977 జూన్ వరకు ప్రకటింపబడి ఆంధ్రదేశమునందే గాక యావత్ భారతదేశమందును జనన మరణ రాహిత్యమునకై కృషిచేయు పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత పాఠకులకు ఎంతో విలువైన విషయ నిరూపణలో ఎంతో సహాయకారిగా నుండెడిది. అందలి ఈ దిగువ అంశములన్నియు గ్రంథరూపములో ప్రకటించిన శాశ్వత రూపంలో నిల్చి జిజ్ఞాసులకు ఎంతో సహాయకారిగా నుండునని భావించి భక్తాదుల ద్రవ్య సహాయంతో ప్రత్యేక పీఠ గ్రంథములుగా ప్రకటింపబడినవి.

1. బాలల బోధ 2. పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం- రెండుభాగములు
3. పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత వ్యాసమంజరి - నాల్గుభాగములు 4. తత్వసుధ
5. భ్రాంతి రహిత శ్లోకములు - వ్యాఖ్యానము 6. గురుస్తోత్రములు - రెండు భాగములు
7. పరంపరా గురువుల సంగ్రహ జీవిత చరిత్ర 8. శివరామదీక్షితీయ సూక్తి ముక్తావళి

ఇంకను రాజయోగ మాసపత్రిక ద్వారా ప్రకటింపబడిన ఈ దిగువ అంశాలు కూడ ముద్రణ కొరకు ఎదురు చూచుచున్నవి.

1. చందాదారుల ప్రశ్నలు - జవాబులు 2. వేదాంత కథలు

ఇందు చందాదారుల ప్రశ్నలు - జవాబులు అను శీర్షికలో పలు ముఖ్యాంశములు, భక్తి, జ్ఞాన, వైరాగ్య, యోగ, తత్వ, మతసాధనలకు, వేమన పద్యములకు పలు పరిపూర్ణ బోధపరమైన నిగూఢాంశములు కందార్థ కంద పద్యములు, నిజాభిప్రాయములు చోటు చేసుకొని ఉండుటచే పరిపూర్ణబోధ యందు కృషి చేయు వారికి ఈ సాంప్రదాయమందలి నిర్దుష్ట రూపమైన బోధనా విచారణా పద్ధతులు ఎట్టివో యెరిగే వారికి, ఈ అంశములు ఎంతయో ప్రేరణ కల్గించు ఉండి ప్రత్యేక గ్రంథముగా ప్రకటించ వలసినదిగా కోరి యుండుటచే " పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము - బాబులు జవాబులు" అను పేరుని ఈ గ్రంథమును ప్రకటించుచున్నాము. సిద్ధాంత మందలి విశిష్టతను ఈ రచన ద్వారా పాఠకులు గ్రహించినచో ఈ గ్రంథ రచనా ఉద్దేశ్యము ఫలప్రదమైనట్లే. ఈ గ్రంథము కూడ భక్తాదుల ఆర్థిక సహాయముచే ముద్రింపబడెను. నిజామాబాద్ పట్టణ నివాసి చిరంజీవి కూన బాషయ్య శేర్ దంపతులు ఈ ధర్మమునందు కృషి చేస్తూ గురు ఋణం తీర్చు విధానంలో ఈ గ్రంథరాజము వారి స్వంత ద్రవ్యముతో ముద్రింపజేసి పాఠకులకు అందించి ధన్యులైరి. వీరి సంగ్రహ జీవిత చరిత్ర విడిగా ప్రకటింపబడుచున్నది. శ్రీ గురు పరమాత్మ అనుగ్రహముచే వీరికి సమస్త శుభములు కల్గి, జీవితాశయమునందు ధన్యత చెందెదరు గాక. మాచే రచింపబడిన గ్రంథములన్నియు మా గురుదేవులైన శ్రీ మదచల ఋషి దయానంద పొన్నాల రాజయోగేంద్రుల వారి దివ్య శ్రీచరణ సరోజములకు పూజా పుష్పములుగా సమర్పించబడినవి. ఈ గ్రంథము మరియొక పూజాపుష్పముగా సమర్పించుకొనుచున్నాను.

ఇట్లు బుధజన విధేయుడు

**యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు**

నర్సాపురం

# జాబులు - జవాబులు

ప్రశ్న: పరిపూర్ణ పరబ్రహ్మము గురుశిష్యోభయ రహితము, గుర్తు రహితము అయివున్నది కదా? అగుచో యీ సద్గ్రంథములు, గురువులు, వారి బోధలూ యివి అన్నీ ఎందుకు?

జవాబు: ఒక వైద్యుడు తన మందుల షాపులో నిద్రించుచుండెను. తనకు జబ్బు చేసినట్లును అనారోగ్యముతో విపరీతముగ కడుపునొప్పిచేతను బాధపడుచున్నట్లును కలగాంచెను. తన చుట్టునున్న బీరువాలలో అమోఘములగు అనేక దివ్య ఔషధములెన్నియోనుండెను. కానీ అవి స్వప్నములో వచ్చిన వ్యాధిని కుదర్చగలవా? ఆ కలయందే తన అప్పుడొకడు ఆ గ్రామమునందేయున్న యొక ఘనవైద్యుని తీసుకొని వచ్చి ఏదో మందిప్పించగా తుదకా వ్యాధి బాధ నివారణైనట్లును కలగాంచి పిదప మెలకువ చెందెను. అపుడు కలగాని కలలో వచ్చిన వ్యాధిగాని, వైద్యుడు గాని, వైద్యుడిచ్చిన మందుగాని ఏమీలేవుగదా? అట్లే కలవంటిదగు యెరుకయందే భవరోగమంకురించెను. ఆ భవరోగవైద్యుడగు సద్గురువును సద్గ్రంథములున్ను, ఆ యెరుకయందే లభించెను."స్వప్నమధ్యేయియంబోధ" అన్నారు, అందుకనే మరిన్ని "ఎరుకను కలలోపలనేనరుదెంచితి మీరలట్లు యరుదెంచితిరీ యెరుక,జన నేను మీరలు యెరుకతోజనువారము" అన్న శ్రీకృష్ణదేశికేంద్రులవారి కందార్థము విమర్శించవలెను. కనుక పారమార్థికంగా పరిపూర్ణం, గురుశిష్యరహితమూ, గుర్తురహితము అయిననూ, వ్యావహారిక సత్యత్వ రూపమగు యెరుకను పోద్రోలుటకు సద్గురువు, సద్గ్రంథములు, గురుబోధ, ఎరుకరహిత స్థితి అరూఢమగువరకు కావలసివచ్చెను.

ప్రశ్న: బ్రహ్మవిద్యను ప్రసాదించిన గురుఋణం సామాన్యులు ఏ విధంగా తీర్చుకోగలరు?

జవాబు: సామాన్యులనుటలో మీ వుద్దేశం ఏమి? గురువులైతే తామే విధంగా తమ గురుబోధ వలన తరించిరో అదేవిధంగా తమ శిష్యులను తరింపచేయగల్గినచో వారు గురుఋణము తీర్చుకోగలరు. కాని శిష్యులెట్లు గురుఋణము తీర్చుకొనగలుగుదురు? అని మీ వుద్దేశం అనుకుంటాను. ఇది నిజంగా చాలా మంచి ప్రశ్నే. దీనికి ఒక్కటే జవాబు. శిష్యులు తమ తమ గురువులను తరింపచేస్తేగాని వారి గురుఋణం తీర్చినవారు కాజాలరు. జవాబు చాలా విరుద్ధంగా వున్నట్లుంది కాని పరమ సత్యము ఎట్లనగా, తన గురువాజ్ఞచే తాను గురువు అయి శిష్యులను చేర్చినాడు. తానైతే తన గురుకృపచే భ్రాంతి రహితుడైనాడు కాని యిప్పుడు తన శిష్యులను తరింపచేయవలెననే క్రొత్త ఆవరణను (భ్రాంతిని) తెచ్చిపెట్టుకొన్నాడు. ఈఆవరణతొలగవలెనన్న, తన శిష్యులు తరించవలెను. గుఱ్ఱముచే నీటిని త్రాగించుటకు యేటికి గుఱ్ఱమును తోలుకొని వెళ్ళవచ్చునుకాని నీళ్ళు త్రాగుట మాత్రం గుఱ్ఱం పనేకదా! అట్లే గురువు భోధ మాత్రమే చేయగలడు. కాని గురూపదిష్ట మార్గమున నడువవలసినది శిష్యుడే గదా! కనుక శిష్యుడట్లు నడచి తరించిన పిదపగాని తన గురువుకి ఆవరణరహితంగాదు. కనుకనే శ్రీకృష్ణదేశికేంద్రులవారు" మీరు మేల్కొని మేల్కొలుపుడి నన్ను" అని సెలవిచ్చియున్నారు.

ఐతే, ఒక్కొక్క గురునికే వేలకొద్ది శిష్యులుండవచ్చును కాదా! అందొక్కరు తరించకుండా మిగిలివున్నప్పటికి గురువుకు తరుణోపాయము లేదా అని శంక కలుగవచ్చును. కానీ యిది లక్షణయుతులైన శిష్యుల విషయంలో మాత్రమే వర్తించును. చెప్పినట్లల్లా చేసే సచ్ఛిష్యుడొక్కడు మిగిలినా గురునికి ఆవరణ రహితం కాదనుట మాత్రం సిద్ధాంతమే.

కనుక శిష్యుడు లక్షణయుతుడై గురూపదిష్ట మార్గమున నడచి తాను తరించి తన గురువును తరింపచేయగలడు. యిదియే శిష్యుడు గురుఋణము తీర్చవలసిన విధానము.

ప్రశ్న: ఏమి చేసినా, శిష్యునికి ఇంకా చేయాలనీ, గురువును హృదయంలోనే బంధించాలనీ కోరిక పోదు గదా? ఇది మాత్రం కోరిక కాదా?

జవాబు : "జలము నెడబాయనొల్లని జలచరములు రీవిబూని సచ్ఛిష్యుడుహృజ్జలజంబును పీఠముపై నిలిపి ఇతరముమాని గురువునే కొల్చు సుమ్మీ తదూక్తులనే తలచునమ్మీ!" అన్నారు శ్రీకృష్ణదేశిక ప్రభువు తన కందార్థములో, కనుక శిష్యుని కట్టి కోరిక యుండుట చాలా సహజము అవసరము కూడా. ఇది నిజంగా కోరికే కాదు. కోరికలన్నిటినీ కూలగొట్టే కోరిక. ఎట్లనగా గురువుయొక్క నామరూపాలతోనూ, గురువుయొక్క ప్రబోధతోనూ నిండియున్న శిష్యుని హృదయమునందు అన్యచింతనలుగాని, యితర కోరికలకు గాని స్థానమేయుండదు. కనుక యిది ఎల్ల కోరికలనూ రహితపరచుకొనే విధానమే అవుతుంది కాని యిదియునూ యొక కోరిక కాజాలదు.

(4) ప్రశ్న: వ్యవహారంలో అనేక కష్టనష్టాలు సంభవింపవా? ప్రాపంచికులతో పారమార్థికులకు బంధము ఎంతకష్టతరంగా వుంటుంది?

జవాబు : ఎంతటి పారమార్థికుడైనా, సన్యసించి కూర్చున్నా ప్రారబ్ధమనుభవించక తప్పదు, రామకృష్ణ పరమహంసకు, రమణమహర్షికీ కూడా తప్పలేదు. గృహస్థే అయి రాజయోగమందున్న వారికి ప్రాపంచికులతోటి వ్యవహారంలో కష్టనష్టములు కలుగుటయు అనివార్యమే గాని పారమార్థికుడైనవాడు అస్పర్శ యోగమవలంబించి కర్మకౌశలమెరిగి వర్తించుటచే ఆయా కష్టనష్టముల తాకిడి అతని హృదయప్రశాంతతకు ఎంతమాత్రం బాధకరం కాజాలదు. ఎట్టి సంస్కారమున్ను సృష్టింపజాలదు.

5 "అన్నపు సూక్ష్మాంశము మనసెన్నగ నీరంబు ప్రాణమెరుగుము యీ రెండన్నడో కలియవో నాడే సున్న సుమీ యెరుక మాట" అని శ్రీకృష్ణదేశికేంద్ర ప్రభువువారు సెలవిచ్చారు. ఈ రెండూ కలియని పద్ధతి కాస్త వివరంగా తెలుపుతారా?

జవాబు : నిత్యము సుషుప్తావస్థయందు మనఃప్రాణముల కలయిక సహజంగా విడిపోవుచున్నది. కనుకనే ప్రాణము ఉఛ్వాస, నిశ్వాసరూపంగా సంచరిస్తున్నా ఏమియు వర్తించుటలేదు. అట్లే యోగి ప్రాణాయామాది, సాధనల చేత, ప్రాణసంచారమునరికట్టి

మనస్సుయొక్క సంకల్పాదులనరికట్ట చూచుచున్నాడు. కానీ సుషుప్తిలో సహజంగా మనఃప్రాణాలకు కలిగే యెడబాటుగాని తాత్కాలికమే. కనుకనే యెరుక మరుపురూపం చెందుచూ తిరిగి యెరుక కల్గి సమస్తమునూ గుర్తిస్తూ వున్నది. మరణమందు మనఃప్రాణముల కెడబాటు కలుగుటయే లేదు. కనుకనే తిరిగి జన్మకు వస్తూ వున్నది శాశ్వతంగా మనఃప్రాణములకు ఎడబాటు ఏనాడు కలుగునో ఆనాడు సున్న సుమీ ఎరుకమాట అన్నారు శ్రీకృష్ణదేశికేంద్రులవారు, ఈ మనఃప్రాణములలో ఒక దానిని పూర్తిగా నశింపచేస్తేనే తప్ప అవి కలియకుండా వుండవు. ఆ రెంటిలో వ్యష్టి సమిష్టిగానున్న ప్రాణము అమృత స్వరూపము. కనుక మనస్సును లేకుండా చేయాలి. అమనస్కయోగమని పేరుపెట్టారేగాని మనస్సులేకుండా పోవుటలేదు. కాని దాని ఆది బౌతిక వ్యాపారమగు సంకల్పవికల్పములు మాత్రం తాత్కాలికం అగినది. కనుక మనసురహిత పరచాలంటే మనస్సుయొక్క మూలమును గుర్తెరిగి ఆ మూల వస్తువునకు పరిపూర్ణ పరబ్రహ్మమునందు స్థానముగాని మూలముగాని లేదని గుర్తించి మనస్సు అనగా సంస్కారముల మూట గనుక సంస్కారనాశనము వాసనాక్షయము కలిగే విధంగా శేషజీవితమును సాగించినపుడే మనోనాశనము చేకూరును. ఇదంతయూ పూర్ణబోధకు సంబంధించిన సహజామనస్క రాజయోగము. గురు ముఖతః తెలుసుకొని ఆచరించి శిష్యుడు కడతేరవలసిన మార్గము.

ప్రశ్న: "బ్రహ్మసత్యం జగన్మిథ్య" అన్నారు బ్రహ్మసత్యమెట్లు? 6

జవాబు: సృష్టికి పూర్వము నామరూపరహితంగా నిరాకారంగా వుండేదే బ్రహ్మము. ఆ బ్రహ్మమునకే సృష్టికామనగల్గి తానే జీవేశ్వరజగత్తులై, నామరూపాలు వహించినపుడు అదే జగత్తనబడును. కనుక బ్రహ్మజగత్తులు రెండూ కార్యకారాణరూపంగా నున్నా, ఒకే బ్రహ్మమైయున్నది. "సర్వంఖల్విదంబ్రహ్మ" అనే శృతికిదే అర్థము. కనుక బ్రహ్మజగత్తుల మౌలిక స్వభావమున్నూ ఒకటే కావాలి, కాని అందొకటి సత్యమూ మరొకటి మిధ్యయూ కారాదు. ఐనా మిథ్యాశబ్దమునకు అసత్యం అని అర్థము కాదు దానికి పారమార్థిక సత్తాలేదని మాత్రమే అర్థము. పారమార్థిక సత్తా అంటే - సృష్టికి పూర్వము బ్రహ్మమొక్కటే యున్నది. జగత్తుయొక్క నామరూపాలు లేవు అని అర్థము. నిజంగా ఇట్లనికూడా అనరాదు. ఏలనగా పైకి నామరూపాలు తెలియబడలేదే కాని బీజరూపంగా బ్రహ్మమందణగియున్నవి కదా! కనుక ఆ అర్థములో కూడా జగత్తును "మిధ్య" అనరాదు. మరియెట్లు? బ్రహ్మసత్యం జగత్తు మిధ్య" అనుదానికి యేమి చెప్పవలెనంటే, జీవేశ్వరజగత్తు సృష్టి అనంతరమందు మాత్రమే గాన వస్తున్నది. అట్లుగాక, దృశ్యమానజగత్తునకు పూర్వము కూడా కారణబ్రహ్మమున్నది. అని చెప్పినట్లు మాత్రమే కనుక కారణరూప బ్రహ్మను సత్యమనీ కార్యరూపజగత్తును మిధ్యనీ అనరాదు. బ్రహ్మమూ జగత్తూ అత్యంత విభిన్నపదార్థములు కావు కనుక యీ కారణబ్రహ్మమే సత్యాసత్యములుగా వుంటూవున్నది. యీ సత్యాసత్యములు సాపేక్షిక శబ్దములు నిరపేక్ష కేవల సత్యమైనదొక్క పరిపూర్ణ పరబ్రహ్మమేనని అచలఋషుల సిద్ధాంతం.

7 ప్రశ్న: ప్రపంచము పరమాత్మ చుట్టునూ దిరుగుచున్నదని కొందరు, పరమాత్మయే ప్రపంచము చుట్టూ దిరుగుచున్నదని కొందరు అంటున్నారు? మరి మీరు ఏమంటారు?

జవాబు: ఎట్లా చెప్పినా తప్పులేదు తిరిగే స్వభావము అనగా చలించే లక్షణము రెండింటికి వున్నది. కేవలం అచలంగా వున్నది రెంటిలో ఏదీలేదు. కేవల తత్వముగల నిరపేక్షకత్వమును యీ రెంటియందే మానవుడన్వేషించుచున్నాడు. కానీ యీ రెంటికీ అది దూరస్తమైయ్యేవున్నది. చలాచలములు రెండూ సాపేక్షిక శబ్దములే. తానున్న భూమి కదలుటలేదనుకుంటే సూర్యుడే భూమి చుట్టూ తిరుగుచున్నాడని అనకతప్పదు. సూర్యుడు కదలుట లేదని అంటే భూమియే సూర్యుని చుట్టూ తిరుగుచున్నదని చెప్పవలసియుండును. అయస్కాంత సన్నిధిలో సూది చలించును. ప్రత్యక్ష చలనము సూదియందే గానవస్తుంది. కాని అయస్కాంతమున బాహ్యచలనము లేదుగాని ఆకర్షించి లాగే శక్తి దానియందదృశ్యరూపంగా నున్నది కదా! ఆ శక్తి లాగితేనే సూది కదిలినది. కనుక చలనముభయుత్రా చెప్పకతప్పదు. అట్లే ప్రపంచచలనమునకు పరమాత్మ సత్తా యిన్తున్నది. యీ చాలనశక్తి (చైతన్యశక్తి) పరమాత్మయందున్నట్లుగూడా తెలియకపోవుటచే యిదే, నిష్క్రియమగు కేవలాచల పరిపూర్ణ బ్రహ్మ వస్తువుగా కొందరు భ్రాంతి పడుచున్నారు. ఈ సందర్భమున శ్రీకృష్ణదేశికేంద్రులు:

కందపద్యం : చలనమన నీవు సుమ్మీ
చలనరహితమనిన భయలు, చలనమేకల, యీ
చలనము, చలనరహితమును
గలదని, కని, తొలగ, మేలుకలుగునోయప్పా!!!

అని సెలవిచ్చినారు. కనుక సృష్టి కారణమగు పరమాత్మయందునూ సృష్టి అయిన సర్వమునందునూ సృష్టి విధానమందునూ అంతా చలనమే కనుక పరమాత్మ ప్రపంచములలో ఏవి తిరుగుచున్నవీ? అంటే రెండూ చలనస్వభావము గలిగినవే అని జవాబు, ఏలననగా తిరుగుటకు కారణము, పరస్పరాకర్షణము. రెండూ ఆదిలో ఒకేమూలపదార్థము అయి విడిపడుటయే. సూర్యుని నుండి వేరుపడినందుననే భూమి గ్రహము సూర్యుని చుట్టూ పరిభ్రమించుచున్నది. కానీ సాధారణముగ తానున్న స్థానమందు, లేక తనయందుగల చలనమును గుర్తించక తనకన్యముగా నా చలనము బయటనున్నదని భావించును. తానే చలన స్వరూపుడుగా నున్న సంగతి విస్మరించుచున్నాడు. తాను రైలులో కూర్చొని తన గమనమును విస్మరించి తానచలుడై యున్నానుకొని రైలుబాట ప్రక్కన స్థావరంగానున్న వృక్షాదులు వెనుకకు పరుగిడి పోవుచున్నట్లు భ్రాంతిపడుచున్నాడు. అట్లే తాను నిత్యుడననీ తనకన్యమగు జగత్తు అనిత్యమనీ తానచలుడననీ మిగతా అంతయూ చలనమేనని భావించును. నిజమునకు తానూ తన యూహకందిన సర్వమూ చలనమేనని పైపద్య భావన.

యీ సందర్భమున శ్రీమద్భాగవతమున దశమస్కందములో నభివర్ణింపబడిన శ్రీకృష్ణగోపికాంగనల రాసక్రీడా మహోత్సవము జ్ఞప్తికి వచ్చును. కేంద్రస్థానమున రాధికాసమేతుడై శ్రీకృష్ణుడు మురళీగానము చేయుచుండ చుట్టును మండలాకారములో గోపికలు నృత్యముచేయుచుందురు. గోపికకు గోపికకూ మధ్య కృష్ణుడే ముందుచూచినా కృష్ణుడే వెనుక చూచినా కృష్ణుడే కేంద్రస్థానమునా కృష్ణుడే. కృష్ణుడే (పరమాత్మ) పురుషుడు గోపికయే ప్రకృతి. యీ ప్రకృతి పురుషులు ఓతప్రోతముగా విడదీయరానివిగా యున్నవి. ఇందు కేంద్రస్థానమునున్న ప్రకృతి పురుషుల చుట్టి ప్రకృతిపురుషులు మండలాకారముగా దిరుగుచూ నృత్యవిన్యాసముల గావించు చున్నారు. యిపుడు చెప్పుడు! ప్రకృతి పురుషుని చుట్టూ తిరుగుచున్నదా? లేక పురుషుడే ప్రకృతి చుట్టూ తిరుగుచున్నాడా? ఎట్లు చెప్పినా తప్పులేదు. యిరువురూ యిరువురి చుట్టూ తిరుగుచున్నారని చెప్పినా తప్పులేదు. 8

ప్రశ్న: భగవంతునుకి శరీరమున్నదా? వుంటే అది యెట్టిది?

జవాబు: యిందుకు మతభేధములున్నవి. **అద్వైతసిద్ధాంతానుసారం** "ఏకమేవా అద్వితీయం బ్రహ్మ". ఆ బ్రహ్మము నిర్గుణము, నిష్క్రియము నిరంజనం, సజాతీయ, విజాతీయ, స్వగత భేదమును లేవని చెప్పబడుచున్నది. శరీరమున్నదని చెపితే శరీరము, శరీరం గల్గినవాడు అనున్వగత భేదములంగీకరించినట్లు కాగలదు. జీవేశ్వర జగత్తు రజ్జుసర్పములు వంటిదే కనుక బ్రహ్మము సాకారమై సగుణమై విరాట్, హిరణ్యగర్భ అవ్యాకృతాది లక్షణములు పొందనేలేదు. జీవేశ్వరులిద్దరూ చిదాభానులే. మాయలేనేలేదు. నామరూపాలు మిథ్యయే కనుక ఆ బ్రహ్మమున కొక శరీరమందని చెప్పరాదు. "ఏకోదేవస్త్రిధాభిన్నాః" బ్రహ్మ విష్ణు మహేశ్వరాః" ఒకే దేవుడు బ్రహ్మ, విష్ణు,మహేశ్వరులుగా చెప్పబడుచున్నాడే! అంటే "ఉపాసకానాం హితార్థాయ బ్రాహ్మణోరూపకల్పనా" రూపకల్పన అంతయు ఉపాసకుల శ్రేయస్సుకొరకే అని సమాధానం చెప్పవలసినదే.

**విశిష్టాద్వైతులిట్లు**: చిత్, అచిత్, ఈశ్వర అను మూడు తత్వములు నిర్ణయింపబడినవి చిత్ అనగా జీవత్వము అచిత్ అనగా జడరూపప్రకృతి. ఈశ్వరుడు అనగా బ్రహ్మమే భక్తులననుగ్రహించుటకై శ్రీమహావిష్ణువుగా వైకుంఠమున వేంచేసియున్నాడు. జీవజగత్తులు (అనగా చిదచిత్తులు) ఆయనకు, శరీరభూతముగా నున్నవి. ఆయన నిర్గుణుడే. అయితే సమస్త కళ్యాణ గుణాకారుడై యున్నాడు. నిర్గుణమనగా హేయగుణములేమిన్నిలేవన్నమాట. కనుక యీ మతవాదుల సిద్ధాంతానుసారము భగవంతునికి శరీరమున్నది. 84 లక్షల జీవోపాధులతో గూడిన బ్రహ్మాండమునే అతడు శరీరముగా కల్గిన విరాట్పురుషుడు. " సహస్రాదేవఃసహస్రాక్షి సహస్రపాత్"..అంటూ అతనిస్థూల దేహమభివర్ణింపబడినది. అర్జుననకా విశ్వరూపసందర్శనమే భగవానుడనుగ్రహించినాడు. మిగతా ద్వైతవాదములు, (మధ్వ, భాస్కర, భాది మతములు)ఈపదభేదములతో బ్రహ్మము సాకారరూపుడుగా నుండి ఒక శరీరమును కల్గినవాడేనని అంగీకరించినారనియే చెప్పనగును.

పరిపూర్ణ భావజ్ఞుల సిద్ధాంతానుసారం:

పరిపూర్ణ పరబ్రహ్మమునకు, షడ్గుణైశ్వర్యములు (జ్ఞానము, వైరాగ్యం, ఐశ్వర్యము, యశస్సు, శ్రీ ఆనందాదులు) లేవు గనుక భగవాన్ శబ్దముగాని, స్త్రీ, పుం, నపుంశక లింగ భేదముగాని లేదు. గనుక 'భగవంతుడు' అను పుంలింగ శబ్దముగాని వర్తించదు పరిపూర్ణ పరబ్రహ్మము ఎన్నడూ రెండో ప్రకారము కాలేదు. అది "దేహాకారము కానిది" అందు ఎరుకేలేదు కనుక దేహీదేహములనే నిర్ణయమెప్పుడూలేదు. యిందుకు "యెరుకే దేహింద్రియములు...." అను శ్రీ భాగవతుల కృష్ణదాసుగారి కందార్థమును చూడవలెను. పరిపూర్ణము, సాకార నిరాకారములు, సగుణ నిర్గుణములు, యిత్యాది ద్వంద్వములలో ఏదీకానిది ఏదీ లేనిది.

అద్వైతాది మతస్తులు నిర్ణయించిన బ్రహ్మమునకు పరిపూర్ణ భావజ్ఞులు "ఎరుక" అని పేరిడినారు. ఆ ఎరుకే సృష్టిబీజములకు సత్వరజస్తమోగుణములను తనయందు నిగూఢంగా దాచుకొనియున్నపుడు నిర్గుణ నిరాకారములుగా నున్నది. సగుణమై సాకారమై తానేజగజీవేశ్వరులైనది. సృష్టికున్ముఖమైనపుడు త్రిగుణ సామ్యమగు ప్రకృతిగా తానే భాసించి, ఆ ప్రకృత్యావరణమునే తన శరీరముగా కల్గియున్నది. ఈ స్థితియందే దానిని శ్రుతిమాత "ఆకాశ్శరీరం బ్రహ్మ" అని వర్ణించినది. అట్లు వర్ణించి యూరుకొన్నచో బాగుండెడిది. కానీ ఆ శరీరమునకు నామ, రూప, వర్ణ, నటన, క్రియాది, (తనకున్న) గుణములు, లక్షణములు, అవయవములు పరికరములు అన్నియు, ఆ బ్రహ్మవస్తువునకు అంటగట్టితినేగాని పాపం తృప్తి చెందలేక పోయినాడు మానవుడు తన వ్యక్తిత్వమును మరువలేక చేసిన యూహాగానము యొుక్క ఫలమిది "God has encated man in his link" eness అంటూంది క్రైస్తవుల వేదం బైబిలు. అంటే భగవంతుడు మానవుని తన ఆకారముతోనే సృష్టించెను అని అర్థము యిట్లనుటకన్న "మానవుడు తన అకృతిచే భగవంతుని చిత్రించుకొనెను" అన్నచో మరింత సమంజసముగా నుండును. శ్రీ వివేకానందస్వామి వచించినట్లు ఎలుకలన్నియూగూడి భగవత్స్వరూపమును వర్ణించుటకై సభజేసి పిల్లినే భగవంతునిగా నిర్ణయించినట్లు, గానే తన వ్యక్తిత్వమును తన సలక్షణ, అవలక్షణములను: తన ఆకారవికారాదులను కామక్రోధాదుల సహితంగా సర్వమూ ఆ బ్రహ్మమునకంటగట్టి తనకు కావలసిన రీతిగా ఆ భగవత్తత్యమునకు రూపురేఖలు తన యూహలో తలచుకొని, శబ్దములతో పిలుచుకొని ఆ రూపమును తన చిత్రములతోనూ శిల్పములలోనూ మలచుకొన్నాడు. ఉదాహరణగా ఈ క్రింద, శృతిని గమనించవలెను. "వేదాహమేతం, పురుషం మహంతం ఆదిత్యవర్ణం, తమసః పురస్తాత్ యాఏషో అంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే, హిరణ్మశ్మశ్రుః హిరణ్య కేశః.

ఆ బ్రహ్మము అదిత్య మండలాంతర్గతుడై హిరణ్మయ శరీరము, హిరణ్మయములగు కేశములు గడ్డములు, మీసములతో ప్రకాశించు చున్నాడని వర్ణించుట, వేదమంత్రములను

రచించిన మహాపురుషుల అద్భుత వర్ణనాకౌశలము, కల్పనా, చాతుర్యము భావసంపత్తి ప్రతిభావిశేషము చాటుచున్నది. వాచ్యార్థమును మాత్రమే గ్రహించి అదియే సత్య సిద్ధాంతముగా మాత్రము గ్రహింపరాదు.ఎరుక రూపమగు నాయధిష్ఠాన పరబ్రహ్మమును ఆదిత్య మండలాంతర్గతుడగు నారాయణునిగా వర్ణించినా బ్రహ్మ విష్ణు మహేశ్వరాధి శరీరం రహిత మూర్తులుగా వర్ణించినా, లేక క్షర, అక్షర పురుషులుగా వర్ణించినా సాకార, నిరాకార, సగుణ నిర్గుణ, వ్యష్టి, సమిష్టి రూపములుగా నిర్ణయించినా బాధలేదు. ఈ అన్ని నిర్ణయములూ ఎరుకలోనివే.

సరే పరిపూర్ణ పరబ్రహ్మమునకు దేహాదులు ఎన్నడునూ లేవు. అదిష్ఠాన పరబ్రహ్మమునకే దేహాదులు చెప్పవలెను. ఆ దేహము ఎట్టిది? అంటే జీవస్థానమున పిండాండోపాధి ఈశ్వరస్థానమున బ్రహ్మాండోపాధి అధిష్ఠానమున ప్రకృతోపాధి అనునవే శరీరములుగా గాన్పించుచున్నవి. భూమిపైన జీవుల శరీరములవలె సప్త ధాతుమయముగాదు. ఈశ్వర శరీరమువలె పంచభూతమయముగాదు. దేవ, గంధర్వ, కిన్నెర, కింపురుషాది దేవతా శరీరము వంటి తేజోమయ పిండము కాదు. కేవలము అపంచీకృత పంచమహాభూత సమిష్ట్యాత్మకము త్రిగుణసామ్యమునైన మూల ప్రకృతియే ఆ పరమాత్మకు శరీరముగా నెంచవచ్చును.

ప్రశ్న: అమావాస్య పూర్ణిమల యొక్క ప్రాముఖ్యమేమి? పరిపూర్ణ భావజ్ఞులుకూడా వీనిని పాటించవలెనా? 9

జవాబు: సూర్యునిచుట్టూ భూమిన్నీ, భూమి చుట్టూ చంద్రుడున్నూ తిరుగుచున్నవనిన్నీ భూమి తన చుట్టూ తాను తిరుగుచూ సూర్యుని చుట్టూ తిరుగుచున్నదనిన్నీ, గతంలో చెప్పియున్నాము. యీ తిరుగుడులో సూర్యచంద్రులు, భూమీ ఒకే సరళరేఖలోనికి (అనగా ఒకే లైనులోనికి) నెలకు రెండుపర్యాయములు వచ్చుచుండును. సూర్యుడు స్థిరముగా నుండును. సూర్యచంద్రులకు మధ్యగా భూమి వచ్చినపుడు ఆ దినమునకు అమావాస్య అనిపేరు. ఆ దినమున సూర్యకాంతి చంద్రునిమీదపడి పరావర్తమై ప్రతిఫలించి వెన్నెలకాయకుండా భూమియే అడ్డువచ్చును, సూర్యునికి భూమికి మధ్య చంద్రుడు వచ్చినపుడు ఆ దినమునకు పూర్ణిమ అనిపేరు. నాడు సూర్యకాంతి చంద్రుని మీద సంపూర్ణముగా పడుటచే చంద్రుడు షోడశకళాపరిపూర్ణుడై పండువెన్నెల కాయుచుండును.

సూర్యచంద్రులూ, భూమి ఒకే లైనులో వున్నపుడు భూమిపైనున్న ప్రాణికోటికి సూర్యచంద్రులయొక్క ఒకానొక ప్రత్యేకప్రభావము వుండును. జ్ఞానేంద్రియములలో, ప్రధానమగు నేత్రమునకు సూర్యుడు అధిష్ఠానదేవతయైయున్నాడు. సర్వేంద్రియములకు రాజు అని చెప్పదగ్గ మనస్సునకు చంద్రుడు అదిష్టానదేవతయైయున్నాడు. ఆ దినములలో నదీనద, సముద్రజలములయందు. సూర్యచంద్రులయొక్క తేజస్సు మిక్కుటముగా ఆకర్షింపబడియుండును. కనుకనే పూర్ణిమదినమునందు సముద్రము ఉప్పొంగిపోవుట

మనము తెలుసుకొనుచున్నాము. కనుక ఆ దినములలో నదీ సముద్రములయందు స్నానముచేయుటచే జనులు ఆరోగ్యవంతులగుదురు. ఆ విధముగా దేహమనస్సుల రెంటిపైన అమావాస్య, పూర్ణిమల యందు సూర్యచంద్రుల ప్రభావము హెచ్చుగా ఉండును.

అమావాస్య పితృదేవతలకు ప్రీతికరమైన దినముగా పరిగణింపబడినది. కనుక ఆ దినమున పితృదేవతా ప్రీత్యర్థముగా పిండప్రదాన తర్పణాదులు తీర్థవిధులు జనులు జరిపింతురు.

ఒకప్పుడు అమావాస్యనాడు సూర్యగ్రహణమును (భూమికి సూర్యునికీ మధ్యనున్న చంద్రుడు అడ్డు వచ్చుటచే సూర్యబింబమంతాగాని కొంతగాని నీడలో పడుటకు సూర్యగ్రహణమని పేరు) పూర్ణిమనాడు చంద్రగ్రహణమునూ (అనగా భూమి నీడ చంద్రునిపై పడుట) వచ్చును. ఆ గ్రహణకాలములో మంత్రోపదేశము. మంత్రపునశ్చరణలు గావించుట విశేషఫల ప్రదము. ఆ కాలమునందు మనస్సునకు ఏకాగ్రత సులభముగా సిద్ధించుటయే ఇందుకు కారణము.

పూర్ణిమనాడు చల్లని పండువెన్నెల కాయుచుండగా మనస్సు ఉత్సాహపూరితమై ప్రశాంతమైయుండును. ఆ సమయమున చేయు పూజాధ్యానాదులు శక్తివంతములై యుండును.

ఆ విధముగా ఆరోగ్యకాములకు, కర్మిష్టులకు మంత్రోపాసకులకు, భక్తులకు ఈ దినములు శుభంకరములైయున్నవి. పరిపూర్ణభావమారూఢమైన వారికి ఏ సాధనలతోనూ నిమిత్తము లేనేలేదు. ఆత్మస్వరూప నిశ్చయమే కాని సాధకులు, ఏ సాధనచేనైననూ అంతఃకరణశుద్ధి మానసిక ఏకాగ్రత సాధించవలసియున్నది. కనుక అట్టి సాధకులు అమావాస్య పూర్ణిమలయందు పుణ్యదినములుగా పాటించి, వారివారి సాధనలను పూర్తిచేసుకొన్ననూ బాధలేదు. కాని ఆయా పర్వదినములయందు స్నాన, జప, ధ్యాన, ఉపాసనాధికములవల్ల జన్మరాహిత్యము కలదని భావించినచో, అది భ్రాంతియే కాగలదు. అంతేగాక అట్లు భావించుటవలన వారి భావశుశ్రూషకు భంగమున్నూ వాటిల్లగలదు.

10 ప్రశ్న: "చెట్టువలె కదలకుండును బట్టబయలు" అన్నారు చెట్టు దృష్టాంతము ఎట్లు సరిపోతుంది?

జవాబు : ఆ కందార్థములలో చెట్టు అనే మాటలేదు. చట్టు అని మాత్రమే వున్నది. చెట్టు అనుట అచ్చుపొరపాటో లేక మీ పొరపాటో తెలియదు. చెట్టు అనుటకు బదులుగా చట్టు ని చదువుకొనవలెను చట్టు అనగా గట్టిగా చిట్లముగట్టిపోయిన పెద్ద బండరాయి. దానిపై నుండి నదీప్రవాహము ఎంతవేగముగా ప్రవహించి పోయినా ఆ చట్రాయి ఎంతమాత్రము చెలించదు. అరిగిపోదు. కనుక బట్టబయలును దానితో పోల్చినారు.

ప్రశ్న: ఎరుకపోయినపిదప సేవించితిననే వారు ఎవరు?

జవాబు: ఎరుకలేకపోయిన స్థితిలో వున్నానని గాని, లేననిగాని సేవించితిననిగాని అనేవారు, ఎవ్వరూ వుండరూ. ఎరుకతోనుండి సేవించరానిది కనుక బట్టబయలును, యెరుకలేక సేవింపదగును అన్నారు. అంటే ఎరుక రహితమునందే పరిపూర్ణ పరబ్రహ్మ నిశ్చయం. కనుక ఎరుక లేకపోవుటే దానిని సేవించుట అంతేగాని ఆ సేవించు విధానముగాని, సేవించువారుగాని లేరు.

ప్రశ్న: మానవులకు దేవతలకు వ్యత్యాసమేమిటి? మానవులు దేవతలు అవుతారా?

జవాబు: దేవతలకు మానవులకున్నట్లు కరచరణాద్యవయవములతో కూడిన స్థూలదేహములు లేవు. వారివి తేజోమయరూపములు. కనుక వారి శరీరములకు బాల్య, యౌవన, కౌమార మరణములు లేవు. కనుకనే వారికి అజరులు (అనగా ముసలితనము లేనివారు) అనీ అమరులు (మరణము) లేనివారు అనీ పేర్లు వచ్చెను.

మానవోపాధియందు దుఃఖము తొంబదిపాళ్ళు, సుఖము పదిపాళ్ళు మాత్రమే అనిన్నీ దేవతలకు అట్లుగాక సుఖము తొంబదిపాళ్ళు దుఃఖము పదిపాళ్ళు అనిన్ని చెప్పబడినది.

దేవతలకు మానవులకు వున్నట్లుగా కర్మశరీరము (స్థూల శరీరము) లేదు. కనుక దేవతలు కర్మచేయుటకు గాని కర్మఫలములను సృష్టించుకొనుటకు గాని సావకాశములేదు. ఏ పుణ్యకర్మల ఫలితముగా వారికి దేవతాజన్మ వచ్చినదో ఆ పుణ్యకర్మ ఫలములను మాత్రమే వారు అనుభవించగలరు. ఆ దృష్టితోనే దేవతలకు భోగ శరీరం మాత్రం వున్నట్లు చెప్పబడుచున్నది. కనుక మానవులు భక్తిజ్ఞాన కర్మ సాధనలు చేసి సాలోక్యాది పదములను మోక్షమును పొందగలరు గాని, దేవతలు అట్లు పొందలేరు సరికదా! "క్షీణేపుణ్యేమర్త్యలోకం విశంతి" అనగా చేసుకొన్న పుణ్యఫలమును అనుభవించుట పూర్తి అగుటతోడనే దేవతలు తిరిగి భూలోకమున పుట్టవలసినవారే కనుకనే "దుర్లభం మానుషం దేహం" అని మానవోపాధికే శ్రేష్ఠస్థానమీయబడింది.

మానవులు యజ్ఞ దాన తపఃక్రియలచే పుణ్యకర్మలను చేసిన యెడల ఆయా పుణ్యఫలములననుభవించుటకై స్వర్గాదిలోకములందు తగిన భోగశరీరములను ధరించి ఆ పుణ్యమును సుఖరూపముగా అనుభవింతురు. కాని ఆ విధముగా మానవులు చేసిన పుణ్యముచేత దేవతలగుటకున్నూ, పుణ్యము క్షీణించిన పిదప మానవలోకములలో పుట్టుకనూ సావుకాశమున్నది. మరిన్నీ మానవులు ఈ లోకమునందే కేవల సత్యగుణ సంపన్నులై అంతఃకరణశుద్ధి గావించుకొని సురసంపత్తి గలిగివున్నచో వారిని దైవాంశసంభూతులుగా పేర్కొనుచున్నాము. అట్టివారినే నిజమగు భూసురులని చెప్పనగును. మానవోపాధియందు గల జీవులలో పశుప్రవృత్తి, దానవ ప్రవృత్తి, మానవప్రవృత్తి, దైవ ప్రవృత్తి అని నాలుగు

ప్రవృత్తులు కలిగిన వారున్నారు. కనుక ప్రయత్నంచేత లేక తగు సాధనచేత దుష్టప్రవృత్తి మార్చుకొని ఆత్మ సాక్షాత్కారమును పొంది అంతటితో ఆగక పరిపూర్ణబోధను గుర్తు ఎరిగి జన్మరాహిత్యమును పొందగోరు వారే మానవోపాధియందున్నటువంటి దేవతలు.

3 ప్రశ్న: లోబయలు, పరబయలు, అంతాబయలు అనగా నేమో దృష్టాంతముగా సెలవీయ్యండి?

జవాబు: బయలు అనగా ఆకాశమని సామాన్యార్థము. లోబయలు అనగా అంతఃకరణావచ్ఛిన్నాకాశము లేక చిత్తాకాశము. పరబయలు,అనగా నీకూ, నీకు తోచబడే లేక నీవూహకందే సమస్తమునకు యితరమైయున్నదేదో అది. దానినే కేవల పరిపూర్ణ పరబ్రహ్మమన్నారు. అంతా బయలు అనగా నీకన్యంగా తోచబడే బ్రహ్మాండమంతా నిండియున్న ఆకాశము.

4 ప్రశ్న: శ్రాద్ధాదిక్రియలు యెందుకు చేయవలెను? చేస్తే పుణ్యమా? పాపమా?

జవాబు: తల్లిదండ్రులే స్థూల శరీరమును తనకు ప్రసాదించి పెంచి పెద్దచేసి, విద్యాబుద్ధులు చెప్పించి ఆస్తిపాస్తులిచ్చి తన శ్రేయస్సుకెంతో తోడ్పడినారు. అట్టి తల్లిదండ్రులు జీవించినంతకాలం వార్కి సర్వవిధముల సేవచేయవలెను. వారి మరణానంతరం వారికుత్తమగతులు కల్పించుటకై తాను చేయగలినగినదేదైనను చేయవలసినదే. తాను పవిత్రాంతఃకరణతో సాధించిన మంత్రబలముకాని, వాక్శుద్ధిగాని వుంటే దానిని మరణించిన తల్లిదండ్రులకుత్తమగతులు కల్పించుటకై వినియోగించుటయే శ్రద్ధాదులయందుండే పరమార్థము. అట్టి వాక్శుద్ధిగాని మంత్రశక్తిగాని క్షీణించిన ఈ రోజులలో శ్రద్ధాదిక్రియలు శుష్కబాహ్యాచారంగా మాత్రము మిగిలిపోయినవి. ఐననూ ఆయా శ్రాద్ధాదిక్రియ ఒనరించునట్లు చేయు అన్నదాన, వస్త్రదానాదులన్నియూ పాత్రత యెరిగి చేసినచో చాలా మంచిదేగదా! దాని వలన దాతకు పుణ్యవిశేషము కలుగుట నిక్కమే. శ్రాద్ధాది కర్మకాండ చేయనిచో పాపమురాదు. "కర్మవలన జనుడు కడతేరకుండును" అనే నానుడిసత్యమే. ఐననూ చేయుట వలన నష్టమేమి లేదు. కనుక చేయవలసినదనే పెద్దల అభిప్రాయము కేవలం కర్మమాత్రం చేయుట వలన పుణ్యమూ లేదు, చేయకపోవుట వలన పాపమూ లేదు.

కాని "యద్యదాచరత శ్రేష్టఃతత్తదేవే తరేజనా!" అనగా పెద్దవారు ఎట్లు చేతురో తదితరులట్లేయొనర్తురు. కానీ లోక సంగ్రహార్థమైనను కర్మలు చేస్తూ వుండవలసినదే.

5 ప్రశ్న : ఉపదేశమనగా నేమి? అయినందున కలుగు ఫలమేమి? కానందున కలుగు నష్టమేమి?

జవాబు: ఉపదేశము =ఉప+దేశము ఉప అను ఉపసర్గకు సందర్భమున బట్టి నానార్థములున్నవి. కాని ఉప= 1. దగ్గర లేక సమీపము 2. ఎక్కువది లేక శ్రేష్ఠమగునది

అని అర్థములు, ప్రస్తుతము గైకొనుచున్నాము. దేశము = అనగా ప్రదేశము స్థలము, స్థానము, పదవి యిత్యాదులు. కనుక ఉపదేశమనగా సమీపస్థానము లేక శ్రేష్టస్థానమని వ్యుత్పత్తి ననుసరించి శబ్దార్థము సిద్ధించుచున్నది. ఉపదేశము అను మాటకు మంచిమాట, హితవచనము, బోధించుట అను సామాన్యార్థములును కలవు కాని ఉపదేశ శబ్దము ఎక్కువగా మంత్రోపదేశము అను అర్థములోనే వాడుకలో నున్నది. ఐతే సామాన్యార్థము గాక తాత్వికార్థమునే మనము శోధించి తెలుసుకొనవలసియున్నది.

ఏ అర్థంలో తీసుకొన్నా తనను నమ్ముకొని తనయందు విశ్వాసముంచి ఆశ్రయించిన శిష్యుని యొక్క శ్రేయస్సుకోరి, గురువు చెప్పుహితము, వాక్యము, మంత్రము, లేక వస్తు నిశ్చయమునకై చేయు ప్రబోధము యిత్యాదులన్నియు ఉపదేశమను శబ్దార్థములోనికి చేరుచున్నవి.

తెలియని వస్తువును గూర్చి తెలుపుటకే గురువావశ్యకమైయున్నాడు. అజ్ఞాత వస్తువుయొక్క స్థానస్వరూప స్వభావములనెరిగించినపుడే వస్తు నిర్దేశము శిష్యునికి కాగలదు. ఆ వస్తువులే స్థానమున కలదో శిష్యుని యా వస్తువుకడకు గొనిపోయి చూపుటయో, లేక శిష్యుని సన్నిధికి ఆ వస్తువును గొనివచ్చి చూపుటయో చేసినపుడే అది వుపదేశమవుతుంది. శిష్యునికి ఆ వస్తు సంబంధమైన యదార్థజ్ఞానము కలిగించుటయే ఉపదేశము. యిది ఇంద్రియములకు గ్రాహ్యమగు వస్తువిషయంలోనే సాధ్యమవుతుంది. ఆత్మను అట్లు చూపుటకు సాధ్యము కాదుగదా? అంటే, "మనసైవానుదృష్టవ్యం" అనీ "ఆత్మావారేదృష్టవ్యో" అనీ "బుద్ధిగ్రాహ్యమతీంద్రియం" అనీ శ్రుతిస్మృతి వాక్యములు చెప్పుచూవున్నవి. కనుక ఆత్మను కూడా శిష్యునికి గురువు మానసిక ప్రత్యక్షము గావించగలడనుటలో సందేహము లేదు. ఇట్టి అపరోక్ష జ్ఞానము శిష్యునికి గలిగించుటయే ఉపదేశముగాని వాక్యము, మంత్రము, తంత్రము యత్యాదులను ఎవరికీ వినబడకుండా శిష్యుని చెవిలో చెప్పట ఉపదేశము కాదు. ఏలననగా ఆ మంత్రము లేక వాక్యము సూత్రప్రాయంగా మాత్రమే వస్తువును గూర్చి చెప్పను. అట్టి మంత్ర తంత్రములలో గల మర్మమును వివరించి "ఘటమెదుటబెట్టి చూపిన యటువలె" వస్తు సాక్షాత్కారము కలిగించుటే నిజమగు ఉపదేశము. వల్లెవేయించి శాస్త్రజ్ఞానమెంత పెంపుచేసినా దానివలన వస్తునిశ్చయజ్ఞానము మాత్రము కాజాలదు.

ఎట్లనగా "ప్రజ్ఞానం, బ్రహ్మ" అను మహావాఖ్యార్థమెంత వివరించి చెప్పినా బ్రహ్మస్వరూపము అపరోక్షము కాదు. కానీ ఆ బ్రహ్మము నీవే (తత్వమసి) యని ఉపదేశించినపుడు తన స్వరూపమెరిగిన శిష్యునికి బ్రహ్మపదార్థము అపరోక్షము కాగలదు. పరమానందయ్యగారి శిష్యులు పదిమంది సురక్షితముగానే ఏరుదాటి వచ్చినప్పటికి తమలో ఒకడు ఏరుదాటుటలో కొట్టుకొని పోయినాడని భ్రాంతిచెంది, విలపించునపుడు "దశముడున్నాడు, పోలేదు" అను ఆప్తవాక్యము వారికి దుఃఖనివృత్తి చేయలేదు. కానీ

తొమ్మండుగురిని వేరుగా చూపి "నీవేరా! దశముడవు" అని చెప్పినప్పుడుగాని వారికి దుఃఖఃనివృత్తి కాలేదు. ఆ విధంగా అపరోక్షసాక్షాత్కారమును కలిగించు తత్వమసి మహావాక్యమునకే వుపదేశ వాక్యమని పేరు వచ్చినది. ఏ వస్తువును గురించి ఎంతగా విన్ననూ ఆ వస్తువును స్వయముగా చూపి వచ్చిన దానికి చాలదు గదా! కనుకనే "విన్నవారా మీరు కన్నవారా'" అని తత్వం వ్రాసారు. కనుకనే కృష్ణదేశికులవారు.

కం సదమల గురువెవరని నను।
యిదిగో బయలిదిగో లేని యా గుర్తురిగే
టిదగు శరీరము దీనిని।
వదలు మనచు నీకు చెప్ప వచ్చినవారే

అని శెలవిచ్చినారు. అట్లు రెంటిని చూపిచెప్పకున్నచో వారు గురువులూ కారు. వీరు శిష్యులూకారు. వారు చేసినది ఉపదేశమూకాదు. అది కేవలము అపదేశమేయగును. ఆ గురుశిష్యులు అపహస్యం పాలేయగుదురు. సరియగు యుపదేశము వలన శిష్యుని ఆశయసంసిద్ధి కాగల్గుటలో సందేహమేమీ లేదు. ఏలననగా వస్తునిశ్చయజ్ఞానపూర్వకముగా బోధఆరూఢమైనచో వానికి భ్రాంతి కలుగటకే కారణమూ లేదు "ఇదితాడే" ధృడంగా తెలిపియుంటే?ఇది పాము అనే భయభ్రాంతులకు తావే వుండదు. పరిపూర్ణ బోధయందు వస్తు నిశ్చయజ్ఞానము మరీమరీ అవసరము. ఎరుక యొక్క స్థాన స్వరూపస్వభావములు పూర్తిగా తెలియబడిననాడే పరిపూర్ణ పరబ్రహ్మమందు ఆ యెరుకకు మూలం లేదు కొనకు ప్రవేశించుటకు స్థానం లేదు అని బోధ ఆ రూఢమగును అపుడట్టి వాడు దేనిని కోరును? యిచ్ఛారాహిత్యమే సిద్ధించును. "ఉన్నదున్నట్లుగా పడ్డందుకు యిదే చూచుకోవలె" నన్నారు. దీక్షితులవారు యిచ్ఛారాహిత్యమే స్వచ్ఛమైన బోధయన్నారు శ్రీకృష్ణదేశికేంద్రులవారు.

వస్తునిశ్చయ జ్ఞాన పూర్వకమగు వుపదేశములేనినాడు వస్తు సాక్షాత్కారము గలుగ జాలదు. శ్రవణ మనన నిధిధ్యాసలయందుగాని, ధ్యానధారణ సమాధి మొదలగు సాధనలయందుగాని యెట్టిలోపమున్నా వస్తువు వున్నదున్నట్లుగా గోచరించదు. వస్తువును ఆవరించియున్న అజ్ఞానము తొలగదు. అందుకే "అజ్ఞానేనావృతం జ్ఞానం తేనముహ్యంతి జంతవః" అనగా జ్ఞానమును అజ్ఞానమావరించి యుండగా జీవుడెట్లు ముక్తిగాంచును? అని గీత ప్రశ్నిస్తోంది వస్తుసాక్షాత్కారము వలన మాత్రమే దానిని ఆవరించిన అజ్ఞానము పటాపంచలగును. నాడే సర్వభ్రాంతి రహితము సిద్ధించును.

మంత్రమును రహస్యముగా చెవిలో చెప్పటయేం యుపదేశము, అనే సామాన్యార్థములో కూడా ఆ మంత్రమును గురుముఖతః గ్రహించి జపించి మంత్రసిద్ధిని గావించిన వ్యక్తినే గురువుగా స్వీకరించి ఆయనవలననే మంత్రోపదేశము పొందవలయును. ఏలననగా మంత్రముతో పాటు తానార్జించిన కొంత మంత్రశక్తి కూడా శిష్యుని యందలి

వాత్సల్యముతో నాతడు అనుగ్రహించగలడు. ఆ విధంగా ఆ మంత్రము పరంపరాప్రాప్తమైనపుడే అది శక్తివంతమై మహిమాన్వితమై విలసిల్లగలదు. మంత్రసిద్ధిలేని వారివలనగాని గ్రంధములద్వారా గాని గ్రహించిన మంత్రము నిర్వీర్యము కనుక నిష్ప్రయోజనము.

ప్రశ్న: శ్రీ శివరామదీక్షిత సాంప్రదాయం ఒకటిగానే వుండగా ఈ మధ్య కొందరు గురువులు మా వద్ద పెద్ద మంత్రాలున్నాయంటూ ప్రచారం సాగిస్తున్నారు. ఇది ఎంతవరకు నిజము?

జవాబు : గురుపరంపర సక్రమంగా వచ్చిన వారిలో మంత్రాలు ఒకే రీతిగా వుంటాయి. వేరువేరుగా వున్నాయంటే సాంప్రదాయాలు భిన్నమనీ, చెట్టుపేరుతో కాయలమ్ముకునేవారు మాత్రమేనని తెలియవలెను. ఒక్కొక్కప్పుడు ఒకే సాంప్రదాయమని తెలుస్తూవున్నప్పుడు గూడా బోధ సంపూర్ణంగా గ్రహించి మంత్రార్థములను చక్కగా వస్తునిశ్చయరూపంగా తెలుసుకొన్నవారు కొందరు అట్లు తెలుసుకొనకుండానే తాను తెలుసుకొన్నదాని కంటే యిక యెక్కువ ఏమీ లేదని ఆత్మవంచన చేసుకొని గురువులై క్రొత్త, క్రొత్త అర్థములను చెప్పుకొని అదే నిజసాంప్రదాయమంటూ ప్రచారం చేసుకొనేవారు కొందరు వున్నారు. నిష్పక్షపాత బుద్ధితో తన సాంప్రదాయమే గొప్పదని అహంకారాభిమానాలు వదలి సత్యాన్వేషణ గావించి తరించుటే కర్తవ్యము.

ప్రశ్న : మానవునిలో అహం, మమతలు రహితమైన తదుపరి మానవునిలో నిలచియుండునది ఏమిటి?

జవాబు : అహం అనగా నేను, అహంపోవుటమనగా :-

1. నేను అనుదానికి మూలకారణమైన నేను పరిపూర్ణ బ్రహ్మము నందు లేనను ఆ రూఢ స్థితి కలుగుట.

2. రాగ ద్వేషములకు మూలమైన అభిమానము రహితమగుట అభిమానించుట అహంకారమను అంతరేంద్రియమునకు అది భౌతికము.

3. చేయు కర్మలయందు కర్తృత్వ, బుద్ధి పూనకుండుట ఇందు మొదటి అర్థము పరిపూర్ణ బోధకు సంబందించినది. ఎండమావులలో నీరులేదని ఆరూఢమైనపుడు ఏమిపోయినది? నీరుగా తోచుచూనే యున్నది. కానీ భ్రాంతికారకమగుటలేదు.. అట్లే జీవేశ్వర జగద్రూపమైన సమస్తము తోచుచునే ఉండును. కాని భ్రాంతికారకమగుటలేదు. ఏదియు నెచ్చటికి పోలేదు. కానీ భ్రాంతికి కారణమగుట లేదు.

నేను ఆత్మస్వరూపుడనే గాని దేహేంద్రియ విశిష్టుడైన జీవుడను గాదు అని అనుకొనుట వల్ల అహంవృత్తి నశించి నేను చక్రవర్తిని పండితుడను, బ్రాహ్మణుడను, యిత్యాది వ్యష్టి అభిమానము రహితము కాగలదు. అభిమాన రాహిత్యమే గాని మరేమీ యెక్కడికీ పోవుటలేదు.

కర్తృత్వ బుద్ధి యెట్లు పోవుననగా కర్తృత్వకారయిత తత్వములు రెండునూ మహదహంకార రూపమగు పరమాత్మకే గాని నాకు లేవు. అయిన సత్తాలేక తృణమైన కదలదు. కనుక అతడే సర్వకర్త అని అనుకొనుటచే వ్యష్టికర్తృత్వము రహితమై యుండును.

౮ ప్రశ్న: ఈశ్వర్లున్ను, త్రిమూర్తులున్న మాయ వలన జన్మించినారా? లేక జననీ జనకులున్నారా?

జవాబు: దేవతలందరికి అయోనిసంభవులని పేరు. అనగా మానవ, పశు, పక్ష్యాదుల వలె తల్లి గర్భమునుంచి పుట్టినవారు కారు. వారికి స్థూల శరీరము లేదు. వారు తేజోమయములగు సూక్ష్మశరీరములు మాత్రమే కలవారు. స్థూల శరీరమున్నపుడే, యోని సంభవులని చెప్పవచ్చును. సచ్చిదానంద స్వరూపమగు యెరుకయందు బీజరూపంగా నున్న త్రిగుణములు విజృంభించినపుడు అదియే ప్రకృతి నామముచే ప్రసిద్ధికెక్కినది. "ఏకో దేవస్త్రీధా భిన్నా: బ్రహ్మ విష్ణు మహేశ్వరా!" అని ఏదో ఒక గుణము ప్రధానముగా గల్గియున్నందున త్రిమూర్తులుగా పేర్కొనబడినారు. వికార రహితుడైనపుడు ఈశ్వరుడని సత్వగుణాధిక్యత గల్గినపుడు విష్ణువని రజోగుణాధిక్యత గల్గినపుడు బ్రహ్మయని. తమోగుణప్రధానుడైనపుడు మహేశ్వరుడని నామములచే పిలవబడుచున్నారు.

౯ ప్రశ్న :- యెరుక జడమన్నారు? చలన స్వభావము కలదనిన్ని అన్నారు సమన్వయ మెట్లు?

జవాబు :- ఒకే ఎరుక, ఎరుక రూపంగానూ, మరుపు రూపంగానూ వుంటున్నది. ఎరుక తెలివి రూపంగానున్నపుడు ఎరుక యనీ, తెలివియనీ, జ్ఞానమనీ పేర్లు పొందినది. మరుపు రూపంగా నున్నపుడు. అజ్ఞానమనీ జడమనీ పేరు పొందినది. ఒక శరీరమందు తెలివి చిత్స్వరూపంగానూ దేహము జడ రూపంగా వున్నట్లే, తెలివి యొక్క సంకల్పము చేతనే జడమగు దేహమును, ఇంద్రియములు, పనిచేయునట్లే ఏ సంకల్పము లేని నిద్రయందు దేహము వలె జడరూపంగా కాన వచ్చునట్లే అని గుర్తెరుగ వలెను. తెలివి దేహములు రెండూ యెరుకయే చేతనమైన తెలివి, తాను ముందు చలించి జడమైన దేహమును చలింపచేయుచున్నది.

౧౦ ప్రశ్న : పరిపూర్ణ పరబ్రహ్మము, ఆనంద రహితమని అంటున్నారు. కదా! అట్టి ఆనందహీనమైనదాని నెరిగి కృతార్థులైన గురువులకు దీక్షానామములుగా మరల పూర్ణానంద నిశ్చలానంద సదానంద మొదలగునవి చేర్చుట యెందుకు? తమరందరూ ఆనందసంహితులా? లేక ఆనంద రహితులా?

జవాబు : "సచ్చిదానంద హీనోయ ఏషైవాత్మా సనాతనః" అని తేజోబిందు ఉపనిషత్తు చెప్పుచున్నది. కేవలాత్మయగు పరిపూర్ణ పరబ్రహ్మ సత్, చిత్, ఆనంద, లక్షణములు లేనిది అనుట స్పష్టమే. ఐనను కొందరు సచ్చిదానంద సహితమగు ఆత్మయు సచ్చిదానంద రహితమగు పరిపూర్ణ పరబ్రహ్మము ఒకటే. స్థితిబేధము మాత్రమేనని సరిపెట్టుకొనుచున్నారు.

అది సరికాదు. ఇది అది కాదు. అది యిది కాదు యని శ్రీ శివరామదీక్షిత సిద్ధాంతము, సత్, చిత్, ఆనంద శబ్దములకు అనృత, జడ, దుఃఖ శబ్దములు ప్రతియోగిశంగానున్నవి. అవి సాపేక్షిక ద్వంద్వ స్వరూపములు. సంచర పద్ధతిలోసచ్చిదానంద రూపమగు ఆత్మయే అనృత జడదుఃఖరూపమగు జగత్తుగాను, తిరిగి ప్రతిసంచర పద్ధతియందు జగత్తు సచ్చిదానంద బ్రహ్మముగాను మార్పు చెందుచున్నవి. పరిపూర్ణ పరబ్రహ్మము యీ రెంటికతీతమైనది. కనుక ఆనందరహితమని చెప్పబడినది. అది యెన్నడూ యే మార్పు చెందదు. కనుకనే అది యిదికాదు. యిది అది కాదు అని సిద్ధాంతీకరింపబడినది. పరిపూర్ణ పరబ్రహ్మమే కాలమునందూ ఏ నామరూపాలూ చెందలేదు ఎవరున్నూ పరిపూర్ణ బ్రహ్మముగా నెన్నడునూ మారజాలరు, కనుక పరిపూర్ణ బ్రహ్మము నెరిగిన గురువులు కూడా పరిపూర్ణ బ్రహ్మము కాజాలరు "బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" అను శ్రుతి సచ్చిదానంద బ్రహ్మమునకు మాత్రమే వర్తించును. "స్వయం బ్రహ్మమయో భూత్వతత్పరంచ అవలోకయేత్" అను గురుగీతావచనం ప్రకారం గురువులు సచ్చిదానంద స్వరూపులయ్యే దాని కన్యగానున్న పరిపూర్ణ బ్రహ్మమును తెలుసుకొనుచున్నారు. వారానంద స్వరూపులేగాని ఆనందరహితులు కానేరరు. కనుక సచ్చిదానంద బ్రహ్మమును కీర్తించు సమస్తపదములచేతను, వారిని కీర్తింపవచ్చును. ఐననూ ఆనంద అను శబ్దముతో కూడిన బిరుదులన్నియూ శిష్యులు తమ తమ గురువులను ఆయా విశేషణములతో కీర్తించు కొని గురుభక్తిని పెంపొందించుకొనుటకు మాత్రమేగాని, గురువులు ఆయా బిరుదులను తమకు తాము తగిలించుకొని అహంకారమును పెంపొందించుకొనుటకు మాత్రము కాదని తెలియవలెను.

ప్రశ్న: పంచభూతములాదిగాగల సమస్త, వస్తువులు లేనిది పరిపూర్ణ పరబ్రహ్మము గదా! మరి వస్తు నిశ్చయముగా తెలుసుకొన వలసినది ఏది? అది ఏలాగు? అది తెలిస్తేనే గాని అంతటానున్నది తెలియదంటారు గదా? తమరు తెలుపుదురని అర్థిస్తున్నాను?

జవాబు : దానిని తెలుసుకొనవలెనని మీకు ఆవేదన కలిగినందుకు చాలా సంతోషము. దానిని తెలుసుకొంటేనే గాని అంతటా నున్న పరిపూర్ణ పరబ్రహ్మము తెలియబడదనే మాట పరమ సత్యము. ఆ వస్తువే ఆత్మబ్రహ్మ, యెరుక పరిపూర్ణము వస్తుమద్రహితము. అట్టి బ్రహ్మస్వరూపుడు తానైనపుడు గాని, తనకన్యమైన పరిపూర్ణ పరబ్రహ్మమేదో తెలియరాదుకదా! వస్తువనగా సర్వస్వరూపమైన అఖండ యెరుకమే సర్వమూ అదేయెట్లైనదో సృష్టికి పూర్వాపరములదెట్లున్నదో ఆ విషయమంతయు గురుకృపకు పాత్రుడై గురుముఖతః దాని స్థానస్వరూప స్వభావములను గుర్తెరిగితే "బ్రహ్మవిదేబ్రహ్మైవభవతి" అనే న్యాయంగా తాను బ్రహ్మమై, తనకన్యంగా నున్న పరిపూర్ణ పరబ్రహ్మము తెలియనగును. ఆ విధముగా యెరుక పరిపూర్ణముల రెంటిని తెలియగలరు. యిది పరమ గురు గోప్యం, గురు ముఖతః తెలియదగినదేగాని మరొక విధంగా తెలియబడదు, గురువు తన శిష్యునికి మాత్రమే చెప్పదగును కాని గ్రంథముఖంగా ప్రచురించి బజారున పెట్టదగదు.

ప్రశ్న : "ని తండ్రి జనిని మీదట ..... " అనే భాగవత కృష్ణ దేశి కేంద్రుల వారి కందపద్యమునకు వాఖ్యానము పత్రికా ముఖంగా తెలుపగోరు చున్నాము.

జవాబు : భాగవత శ్రీ కృష్ణదేశి కేంద్రులవారి కందార్థాములు కందపద్యములు గురుముఖతః వస్తు నిశ్చయము దెలసి కొన్న వుత్తమాధికారులు మాత్రమే విచారణ చేయదగును. అట్లు కానిచో శబ్దార్థ రూపమైన బాహ్యార్థము మాత్రమే స్ఫురించును. శిష్యుడు పరిపూర్ణ గురువు వలన ధర్మోపదేశము పొంది "గురుపదిష్ట మార్గేన మనశ్శుద్ధింతు కారయేత్" అనే న్యాయంగా తన అచరణ, అనుష్టానముల యందు యేమరక చిత్తశుద్ధిని గావించు కొన్నట్లు తృప్తి పొందిన పిదపగాని గురుమూర్తి శిష్యునకి వస్తు నిశ్చయముగాని పరిపూర్ణ బోధగాని తెలుపడు. ఆ పిదపగాని ఆ బోధ దృఢీకరణ నిమిత్తం పుట్టబడిన కందార్థములు వ్యాఖ్యానము తెలియచేయడు. .

ప్రశ్న : అద్వైతులు తాను బ్రహ్మమని నిరూపించి తనకంటె నన్యమేమీలేదంటున్నారు. పరిపూర్ణ పరబ్రహ్మమందెరుక యేమీలేదని పరిపూర్ణ భావజ్ఞులు తెలుపుచూ, అది యిదికాదు. యిది అది కాదు అని సిద్ధాంతం చేస్తున్నారు. జీవాత్మ ఏమగుచున్నాడు? లేనన్న మాత్రాన లేకుండా పోతాడా? పోయేవిధమెట్లు?

జవాబు : అద్వైతులు నిర్ణయించిన పరమాత్మ వుపాధిగతమైనపుడు ప్రత్యగాత్మయని, కర్మ సంస్కారముతో గూడినపుడు జీవాత్మయని పేరొందినది. ఆ పరమాత్మయే సర్వకర్త, సర్వభోక్త అయివుండగా తానే కర్తయనీ, భోక్తయనీ సుఖదుఃఖాలు తనవేనని జీవుడు అజ్ఞానముచే భ్రాంతి చెందుచున్నాడు. సర్వకర్త అయిన ఆ పరమాత్మయే ఎరుక దానికి పరిపూర్ణ పరబ్రహ్మమందు మూలముగాని స్థానముగాని లేదని గురుముఖతః బోధవిని ఆరూఢుడైనవాడు కర్తవ్యరహిత విధానముచే కర్మలాచరించుటచే సంస్కారములు ఉత్పత్తి కాజాలవు. జ్ఞానాగ్నిచే సంచిత కర్మయు అనుభవముచే ప్రారబ్ధమును నశించుపోవుచున్నవి. కర్మత్రయమావిధంగా నశించుటచే జీవునియందు ముఖ్యమగు వ్యష్టి మనస్సు లేకపోవుచున్నది. అంతటితో ఆ జీవునిపని సరి. వర్తమాన శరీరము వేయించిన విత్తనము వలె తిరిగి జీవోత్పత్తి హేతువు కాజాలదు. ఈ శరీరపాతముతో జన్మ రహిత్యమే సిద్ధించును.

ప్రశ్న : సమాధినిష్ఠలో శరీరము నిలబడియున్నది. నిద్రావస్తలో పడిపోవుచున్నది కారణమేమి?

జవాబు : అష్టాంగయోగములలో నొకటగు ఆసనసిద్ధికూడా సాధించిన వారికే సమాధి కుదురును. సమాధిలోనికి పోవలెనన్న వాడు ముందుగా తన ఆసనము చెదరక యుండవలెనని సంకల్పించి స్థిరాసనమున నుండును. మనస్సు సూక్ష్మాంశము. మాంసము స్థూలాంశము. స్థూలములైన మాంసకండరములు సూక్ష్మాంశమైన మనో సంకల్పమునకు లోబడి ఆసనమును స్థిరముగా బిగబట్టి వుంచును. అందుచే సమాధిలో నున్నవాని శరీరము పడిపోదు.

ప్రశ్న : మాయ, జగత్తు, చిచ్ఛక్తి, బ్రహ్మములను వేరుగా విభజించి యెరుగట యెట్లు? 5

జవాబు : ఒక బ్రహ్మమే యీ నాలుగు నామములను స్థానస్వరూప భేదములచే పొందినది. బ్రహ్మము అఖండజ్ఞాన స్వరూపము. అజ్ఞాన శక్తియే చిచ్ఛక్తి. బ్రహ్మము యొక్క ప్రకృత్యావరణమే మాయ. దాని పరిణామమే జగత్తు. దీనిని గురుసన్నిధిని విచారించిన గాని వస్తు నిశ్చయజ్ఞానము కలుగదు.

ప్రశ్న : ఆత్మ శరీర సంబంధమైయుండగా నిరుపాధి యని ఎట్లు చెప్పవచ్చును? 6

జవాబు : చిల్లుల కుండను నదీజలములలో ముంచినపుడు కుండలోని నీరు బయటనీరు కలిసి ఏకముగా నున్నట్లే అవాంతరంగా వచ్చిన వుపాధి వున్నా లేకున్నా ఆత్మ వ్యాపకమై యున్నది. కుండలోని నీరు నదిలోని నీరు అని నామమాత్ర భేదమే. అట్లే వుపాధి యందున్న నిరుపాధికముగా నున్న ఆత్మ ఒక్కటే.

ప్రశ్న : దేహమే తానని యున్నపుడు 2. జీవుడే తానని యున్నపుడు 3. సాక్షియే తానని యున్నపుడు 4 బ్రహ్మయు తానని యున్నపుడు యీ నాలుగు స్థితులలో ప్రపంచము ఏ ప్రకారమాతనికి గోచరించును? 7

జవాబు : 1. దేహమేతానని అనుకొన్నపుడు ప్రపంచమున్ను సత్య వస్తువుగానే కానబడును. 2. జీవుడేతానని అనుకొన్నప్పుడు బ్రహ్మములో తానొక అంశమాత్రుడనని అణుస్వరూపుడనని భావించి తన ఆనందమునకై ప్రపంచ మొక భోగ భూమిగా భావించి, సుఖదుఃఖములకు లోనగుచుండును. తాను సాక్షిననుకొన్నపుడు తనకు కర్తృత్వ భోక్తృత్వములు లేవని విషయ రూపమగు ప్రపంచమును నిర్వికారముగా జూచుచుండును. 4. తానే బ్రహ్మముననుకొన్నప్పుడు సర్వమూ బ్రహ్మమయముగానే భావించును. అతనికి ప్రపంచము వేరుగా భాసించనే భాసించదు.

ప్రశ్న : సద్రూప బ్రహ్మమగు ఆత్మ నిత్యమనుట ఏకారణము వలన? 8

జవాబు : సత్ అనగా త్రికాలముల యందు బాధింపబడక యుండునది. సృష్టితోనే కాలమున్ను ఏర్పడినది. సృష్టికి పూర్వము, సృష్టియున్నపుడు, సృష్టి అనంతరము. యివియే భూత, వర్తమాన, భవిష్యత్ కాలములు మూడు కాలములయందు ఇంద్రియ జ్ఞానముతో బాటు వృద్ధిక్షీణములు బొందక మూడు అవస్థలయందు అనువృత్తమై శరీరస్తమైన ఆత్మ వుంటున్నది. కనుక యిది కూడా నిత్యమే నన్నారు. నిరుపాధికమైనపుడు. పరమాత్మయనీ వుపాధిగతమైనపుడు ప్రత్యగాత్మయనీ నామ భేదమేగాని వస్తు భేదము లేదు గనుక రెండూ సద్రూపములే నిత్యములే అన్నారు.

ప్రశ్న : వున్నది బ్రహ్మమా? లేనిది బ్రహ్మమా? 9

జవాబు : వున్న బ్రహ్మమునందు లేని బ్రహ్మము లేనేలేదు వున్న బ్రహ్మము = పరిపూర్ణ

పరబ్రహ్మము. లేని బ్రహ్మము సచ్చిదానంద లక్షణములగల యెరుక లేని బ్రహ్మమగు యెరుకయే వున్నదిగాని దాని కతీతమగు యింకేమీ లేదనే వారే శూన్యవాదులన జెల్లును. "వున్నది లేదని యిహింపగ నేర్చులేనిది కలదన లెస్స నేర్చు ...... అని మాయాలక్షణ ముద్ఘాటింపబడినది. వున్నది పరిపూర్ణ పరబ్రహ్మము; లేనిది సచ్చిదానంద పరబ్రహ్మము పరిపూర్ణ పరబ్రహ్మమునందు లేనేలేదని తెలియవలెను.

**పద్యములకు - వ్యాఖ్యనములు :-**

1. శుక్లాం బరదరం, విష్ణుం, శశివర్ణం, చతుర్భుజం
   ప్రసన్నవదనం, ద్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ॥

2. అగజానన పద్మార్కం గజానన మహర్నిశం
   అనేక దంతం, భక్తానాం ఏకదంత, ముపాస్మహే ॥

జవాబు : శుక్లాం బరధరం = తెల్లనైన వస్త్రమును ధరించిన వాడు లేక శుద్ధాకాశమే వస్త్రముగా గలవాడు, విష్ణుం = వైకుంఠాధిపతియగు విష్ణువు; లేక విశ్వవ్యాప్నోతిః విష్ణుః అనే నిర్వచన ప్రకారం, సర్వవ్యాపకుడగు పరమాత్మ; శశివర్ణం = కుందేలు వంటి తెల్లని వర్ణముగలవాడు; చతుర్భుజం = నాలుగు భుజములు గలవాడు; ప్రసన్నవదనం = శ్యాంత్యానందముల తొణికిసలాడు ముఖము గలవాడు అయిన వానిని సర్వవిఘ్నములు వుపశమింప చేయగలందులకు ధ్యానించుచున్నాను.

వైకుంఠాధిపతి యగు విష్ణువు అనే అర్థంలో అతడు, నీల మేఘచ్ఛాయగలవాడుగదా, తెల్లని వర్ణమున్నట్లు చెప్పుట. అతడు పీతాంబరధారిగదా. తెల్లని ఖట్టకట్టడం అనునవి ఎట్లు పొసగును? తెలపు సత్వగుణమును సూచించునని బ్రహ్మమే అనే అర్థములో - శుద్ధస్ఫటిక సన్నిభం అనగా బ్రహ్మము శుద్ధమైన స్ఫటికము వంటిదన్నారు. కనుక శుద్ధమైన శరీర మనస్సులు గలదనుటకు శుద్ధాకాశము (లేక మహాకాశము) అతనికి వస్త్రముగాను తెలుపువర్ణమే అతని రూపముగాను వర్ణింపబడినది. కనుకనే ఆగురుపరమాత్మను గురుగీత "శ్వేతాంబరం, శ్వేత విలేపపుష్పం, ముక్తావిభూషం ముదితం ద్వినేత్రం, వామాంక పీఠస్థిత దివ్యశక్తిం మందస్మితం పూర్ణకృపానిధానం" అని వర్ణించియున్నది. ఐతే బ్రహ్మమునకు నాల్గుభుజము లేమి? అను సందేహం వచ్చును. నాలుగు దిక్కులే నాలుగు భుజములని తెలియనగును. ఐతే విఘ్న నివారణ విఘ్నేశ్వరుని ప్రత్యేక లక్షణమై యుండగా విష్ణువునుగాని బ్రహ్మమునుగాని విఘ్ననివారణకు ప్రార్థించుటేమి? అను శంక కలుగవచ్చును, ఒక బ్రహ్మమునే అనేక నామములతో వ్యవహరించుచున్నదని చెపుతూ గురుగీత విఘ్ననివారణకై బ్రహ్మమును యీ క్రింది విధంగా ప్రార్థించుట చూడనగును. "యంబ్రహ్మ వేదాంత విదోవదంతి ×××× తస్మైనమో విఘ్న నివారణాయ" కనుక ఆ బ్రహ్మమునకే అన్ని నామములు చెల్లును అని తెలియవలెను.

2. అగజానన పద్మార్కం అనగా అగజ - చలించని పర్వంతమునకు పుట్టిన పార్వతి యొక్క, ఆనన పద్మము = పద్మము వంటి, ముఖమునకు అర్కం = సూర్యుని వలె వికాసము (సంతోషము) కల్గింపచేయువాడవును, గజాననం = ఏనుగు ముఖముగలవాడవును, భక్తానాం = భక్తులకు అనేకదం అనగా అనేక అనేకములగు వరములను, దం = యిచ్చువాడవును , ఏకదంతం = ఒక్కటే దంతమునుగలవాడును అగు ఓ స్వామీ తం = నిన్ను, ఉపాస్మహే = నేను ప్రార్థించు చున్నానని అర్థము.

ప్రశ్న : జీవుడ శరీరము నుంచి ఎట్లు పోవుచున్నాడు?

జవాబు : సంస్కారములతో గూడిన మనస్సున్ను ప్రాణమున్ను చేరి జీవుడు. "వాయుర్గందాని వానిచ" అనగా సుగంధ దుర్గందాదులను వాయువెట్లు తీసుకొని పోవునో, అట్లునే మనస్సుతో సహితంగా ప్రాణము బైటికి పోవుటయే మరణము. మరణకాలము ఆసన్నమగు చుండగా, యింద్రియాధి ష్ఠాన దేవతలొక్కక్కరుగా హృదయస్థానమునున్న అంతః కరణయందు చేరును; ఏ యింద్రియాష్ఠాన దేవత అట్లుచేరితే ఆ యింద్రియము పనిచేయుట మానివేయును చివరకు ప్రాణేంద్రియములలో వుఛ్వాస నిశ్వాసలు చేయు ముఖ్యప్రాణము హృదయస్థానము చేరి సర్వేంద్రియములు ఏకరూపమైన అంతః కరణము (లేక మనస్సుతో)చేరి వుదాన రూపము వహించి ప్రాణము ఆకాశము యొక్క ఆకర్షణ శక్తిచే ఒక్కవూపున నవరంధ్రములలో యేదేని యొక రంధ్రము ద్వారా బైటికి పోవును. ఇదియే మరణము. సర్వ సంస్కారములు నశించిన పరిపూర్ణ భావజ్ఞునికి అంతః కరణ (లేక సంస్కారయుతమైన మనస్సు) లేకుండుటచే వ్యష్టిప్రాణయొక్కటే బైటికి పోయి బ్రహ్మండైక్యము చెందును. జన్మకారణమైన బీజము లేకపోవుటచే నాతనికిక జన్మముండదు. అతని ప్రాణమే ద్వారమన ఏకాలములో ఏ దేశమున పోయిననూ భాధలేదు. యోగులు మరణకాలమునుతెలుసుకొని నవరంధ్రములను మూసి వుంచుటచే వారి ప్రాణము బ్రహ్మరంధ్రమును భేదించుకొని పోవును. కాని సంస్కారముల మూటను తీసుకొనే ప్రాణము నిర్గమించును కనుక జన్మరాహిత్యము లేదు. మిగతా వారు వారొనర్చిన పుణ్యపాపముల ననుసరించి, దేవయానము, పితృయానము, లేక కర్మయానములలో సూర్యచంద్రాది లోకములను పొంది 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి' ' అని చెప్పబడిన విధముగా భూలోకమున పునః పునః జన్మించుచుందురు.

ప్రశ్న : పరిపూర్ణ బోధ సాంప్రదాయక గురు పరరంపలో శ్రీ కృష్ణ అర్జున వుద్ధవాదుల అనంతరం, శ్రీ శివరామదీక్షితుల వరకు గల పరంపరాగురువులెవరు?

జవాబు : బ్రహ్మానందస్వామి అనే గురువుకు పూర్వపు గురువుల నామములు కూడా తెలియవు. తెలియుట కాధారములును లేవు బ్రహ్మానందస్వామి, రామానందస్వామి, జ్ఞానేశ్వరుడు, సహజానందుడు, రామావధూత, లంబికాశివయోగి వేమనార్యులు, వెంకయ్య గురుడు తిరువెంగళాచార్యులు, శ్రీధరులు, శ్రీధరస్వామి శిష్యులే, శివరామ దీక్షితులవారు, అర్జున

వృద్ధవాదులు లగాయితు బ్రహ్మానందస్వామి వరకు గల పరంపర, కాలవాహినిలో మరుగైపోయినది.

3 ప్రశ్న : "కలశస్యముఖేవిష్ణుః... అనే శ్లోక తాత్పర్యము వివరించ గోరెదను?

జవాబు : కలశోదకముచే పూజాద్రవ్యములను, తనను, పవిత్రమొనరించు కొనుటకై కలశపూజ గావింతురు. కలశము యొక్క ముఖము (మూతి) యందు విష్ణువును. కంఠము నందు రుద్రుని, మధ్యము నుందు స్త్రీ రూపములో నుండు సర్వదేవరూపములను, లోపల సర్వ సముద్రములను, సప్తద్వీపములతో గూడిన భూలోకమును, నాల్గు వేదములను, వాని అంగములను, కలిశములో నుండుట కావాహనము చేసి నిలపి, గంగ, యమున, గోదావరి, సరస్వతీ, సింధు, కావేరి, తుంగభద్ర, కృష్ణానది మొదలగు సర్వపుణ్యతీర్థములు కలశోధకముల యందున్న వనే భావన చేసి  ఆ వుదకములు శిరస్సున ప్రోక్షించుకొనుట వలన భక్తుని సర్వపాపక్షయము కాగలదని ఆ వుదకములు చల్లుట వలన పూజా ద్రవ్యములు కూడా పవిత్రములు కాగలవని సంకల్పించి భక్తుడీ శ్లోకమును పఠించి యా క్రియ జరుపుచున్నాడు.

4 ప్రశ్న : ఒక బీజము రెండు భాగములెట్లగును? రూపములు వేరగు విధమును తెలియచేయ గలరు?

జవాబు : సాధారణముగా విత్తనములు రెండు బద్దలు చేసి ఏకముచేసిన విధముగా నుండును. వానికి నీటి చెమ్మతగిలినపుడు రెండు బ్రద్దల పట్టు సడలును. అందున్న అంకురములోనున్న జీవత్వము జలసూక్ష్మమైన ప్రాణసత్తాచే విజృంభించి మొలకెత్తి గింజ బద్దల నున్న సందు పెద్దది చేసుకొని బైటకు వచ్చును, ఆ విధముగా ఒకటైన బీజము రెండు బద్దలగుచున్నది. అట్లు మొలకెత్తిన మొక్క జలముచే పోషింపబడి, సూర్య ప్రకాశము నందలి వుష్ణోగ్రతచే బీజమునందు సూక్ష్మముగా అణగి యున్న వృక్ష రూపము క్రమముగా రూపుదాల్చును. అగ్నికి రూపమును మార్చి వేరొక రూపము నొసంగుటయే వృత్తి. అట్లే సృష్టికి పూర్వమున్న నామ రూపములను కారణ బ్రహ్మము, (తాబేలు అవయవములను తనలోపలిక లాక్కొన్నట్లు) సమస్త సృష్టితనలోనికి వుపసంహరించి బీజరూపమున తనయందు, దాచియుంచి, సృష్టి సంకల్పము మరల కల్గినపుడు సర్వమును అవిష్కరించు చుండును.

5 ప్రశ్న : మరణ కాలమును క్రొందరు చెప్పెదరట? నిజమైతే పుట్టేకాలమును చెప్పవచ్చును కదా? వీరు రాకడా పోకడా యెరిగే వున్నారా?

జవాబు : మరణకాలమును యోగులు గుర్తెరుగగలరు. అట్లే తమ ధ్యానయోగములో తిరిగి పుట్టుకాలమును తెలియ వచ్చును. యోగ శాస్త్రరీత్యా యిది సాధ్యమే. మరణకాలమును చెప్పినవారున్నూ వున్నారు. మరణకాలమును గుర్తెరిగి ఆ సమయమునకు తమ అభ్యాసబలముచే  నవరంధ్రములు బంధించి బ్రహ్మరంధ్రము ద్వారా హంసను వెడలించినచో

మోక్షమని వారి విశ్వాసము అందుచే తిరిగి పుట్టేకాలమును తెలిసికొనుటకు వారు ప్రయత్నమే చేయక మరణకాలమును గుర్తెరిగి బ్రహ్మరంధ్రము ద్వారా ప్రాణమును వీడుటకు యత్నింతురు.

ప్రశ్న : కర్మననుసరించి బుద్ధియా ? లేక బుద్ధిననుసరించి కర్మయా? 6

జవాబు : "బుద్ధిః కర్మాను సారణీ" అనే పెద్దల వాక్యము మొదట కర్మననుసరించి యే బుద్ధి కల్గును, అనగా సంకల్పము కలుగును. కర్మయనగా పూర్వ కర్మల యొక్క సంస్కారములు లేక వాసనలు, అవి అంతః కరణయందు పాతుకొని యుండి శుభాశుభ సంకల్పములకు కారణమై యుండును. బుద్ధి మంతుడగువాడు భగవద్దత్తమగు బుద్ధిచే పూర్వాపరములచింతించి దుష్ట సంకల్పముల నరికట్టి మూఢుడు అద్రుష్ట సంకల్ప మెట్లేడ్చుకొని పోయిన నట్లుపోయి పతితుడగును. తన బుద్ధిచే యుక్తాయుక్తములను గూర్చి విచారణ చేయక తన పూర్వకర్మ తనచే, ఆ అకార్యకరణ గావించునటుల చాటును. అంతేగాని దుష్ట సంకల్పమును నిరోధించుటకు తనకు స్వతంత్రమున్నదని తలపోయడు. మొదటి, పుట్టిన ఆ సంకల్పనుసార నడుచుటకు నిశ్చయించిన పిదప ఆయా కర్మలనుచేయును కనుక అది ఆ బుద్ధి ననుసరించి ఆగామి కర్మలునొనర్చును అన్నమాట. ఎవరును గుర్తెరుగక యే కర్మయు చేయనే చేయరు.

ప్రశ్న : విధిని నిషేదించుట మెలాగు? 7

జవాబు : నిషేధించుట మనగా దాటుట లేక అతిక్రమించుట అని మీ అభిప్రాయమై వుండవచ్చును. విధినిషేధములు అన్నపుడు వాని యర్థం వేరు. విధి అనగా కర్తవ్య కర్మ అనగా చేయవలసిన పని. దానినే ధర్మమందురు. నిషేధమేమనగా చేయరాని పని. యిది అధర్మము యీ అర్థములో విధిని నిషేదించుట అనగా చేయవలసిన పనిని జేయరాదని శాసించుట, కనుక అది అధర్మపరుల వ్యవహారము.

ఇక విధి అనగా కర్మఫలము అని రెండవ అర్థము. ఒక జన్మలో అనుభవించ వలసిన కర్మఫలమును నిర్ణయించు బ్రహ్మదేవునికి గూడ విధియని పేరు. ఒక జన్మలో అనుభవించుటకు నిర్ణయమైయున్న కర్మఫలరాశిని ప్రారబ్ధమని కూడ యందురు. ప్రారబ్ధమనగా తల్లి గర్భమునపడుట తోడనే యా ప్రారబ్ధము ఆరంభమగును. కనుక ఆరంభంపడిన కర్మఫలానుభవమే ప్రారబ్ధము. ఎక్కుపెట్టబడిన విల్లు నుండి విడువబడిన బాణము గమ్యస్థానము చేరువరకు మధ్యలో నెట్లాగదో, అట్లే అనుభవించుట ప్రారంభమైన ప్రారబ్ధము, శరీర పతనముతోగాని ఆగదు. శరీరమే ప్రారబ్ధ ఫలము కనుక యా ప్రారబ్ధమును లేక విధిని దాటుట వశముగాదు. ఒక వేళ మంత్రశక్తిచేతను యోగబలముచేతను దానినరికట్టిననూ అది కాలాంతరమున లేక, జన్మాంతరమందైనను దానిననుభవింపక తప్పదు. రామకృష్ణ పరమహంస, రమణ మహర్షి, వంటి వారు కూడ ప్రారబ్ధమును దాటుటకు ప్రయత్నించలేక పోవుట కిదియే కారణము.

ప్రశ్న : శ్లో॥ అచలమేవ సత్యం, నిరంజనం, నిర్వికల్పం
పరాత్పరం బాహ్యము పైతి విద్వాన్
8 అన్యజ్ఞానం భ్రాంతి వృద్ధిం ప్రయాతి
యేవం జ్ఞాత్వా జన్మరాహిత్య మశ్నుతే ॥
యీ శ్లోకమును వివరింపడు.

జవాబు : 1.అచలము, చలము, 2. సత్యాసత్యములు, 3. అంజన, నిరంజనములు 4. సవికల్ప నిర్వికల్పాలు యిత్యాదులన్నీ ద్వంద్వములు. సాపేక్షికములు పరిపూర్ణము నిర్ద్వంద్వము నిరపేక్షికము పలుకులకందనిది, కనుక యీ ద్వంద్వములలో దేనిచేతనూ సూచింపరానిది. సచ్చిదానంద బ్రహ్మము సర్వమునై వున్నందున సర్వ ద్వంద్వములూ అదే కనుక, అచలము సత్యము, నిరంజనము, నిర్వికల్పము పరము అయివున్నది యీ పరమునకు పరమైన దైనందున పరాత్పరమని బ్రహ్మమని పరిపూర్ణ పరబ్రహ్మము చెప్పబడునదై పరిపూర్ణ బోధజ్ఞులైన పండితులచేతనే సమీపించదగినదియు, పైతి విద్వాన్ అనే మాటలలో వుపైతి అనగా సమీపించ దగినది. ఏలననగా పరిపూర్ణం తెలియబడినది అనిగాని తెలియరానిదనిగాని చెప్పుటకు వీలులేనిది. కనుక వుపైతి అని మాత్రమే చెప్పబడినది. విద్వాన్ అనే మాటకు శాస్త్ర పండితుడని అర్థం కాదు. "పాండిత్యం నిర్విద్యా" అని శృతి విద్యావిద్యల రెంటికీ అతీతమైన నిర్విధ్యా స్వరూపమే పరిపూర్ణ పరబ్రహ్మము గురూపదిష్ట మార్గంచే అనగా లేనేరుకతో దానిని కనిపెట్టిన వాడే పండితుడు. "చూస్తూనే యెరుక పారిపోవునురా అన్నారు. శ్రీ కృష్ణదేశికులు, చూచిన ఎరుక లేదు గనుక చూచితిననిగాని చూడలేదనిగాని అతడున్నూ చెప్పజాలడు. ఇతరమైన జ్ఞాన మార్గము చేత భ్రాంతి విస్తారమే అగును గాని జన్మరహిత విధానము లేదని తెలియవలెను అని భావము.

9 ప్రశ్న : సంకల్ప రహితమెట్లు కాగలదు స్వామి?

జవాబు : సంకల్పించు మనస్సున్నంత వరకు సంకల్పము లుదయించక తప్పదు. సహజా మనస్క రూపమగు పరిపూర్ణబోధచే సంకల్పించుటకు మూలకారణమైన యెరుకకు పరిపూర్ణపర బ్రహ్మమునందునికియే లేదని, అరూఢత సాధించి భ్రాంతి రహితము పొందినవానికి కర్మఫలము లంటవు. కనుక అట్టి పరిపూర్ణ భావజ్ఞునికి సంకల్పముదయించినా భాధాజనకముగాదు.

40 ప్రశ్న: మన ఆంధ్రప్రదేశ్‌లో పరిపూర్ణ బోధ ప్రసిద్ధిలో యున్నట్లు యితర దేశములందు కూడా నున్నదా! భాషలు వేరైనా యావత్ ప్రపంచ మానవాళికి మోక్షమును గురించి యీ పద్ధతిలోనే జరుగుచున్నవా?

జవాబు : ఈ పరిపూర్ణ బోధకు ఆంధ్రప్రదేశ్ యందున్నంత ప్రసిద్ధి మరోచోట లేదు, యిందుకు

కారణములు 1. ఈ బోధను విపుల పరచిన వేమన, శివరామదీక్షితులవారు, ఆ తరువాత వారు అందరూ ఆంధ్రులే. 2. వారుగూడా యితర భాషలు నేర్చినవారైననూ కీర్తి ప్రతిష్ఠా ధన లాభములకొరకు ఆశించని వారై "నా పృచ్ఛః కశ్చచిద్బ్రూయాత్" అనగా అడుగనిదే (జిజ్ఞాస గలవారే అడుగుదురు కాని యితరులు అడుగనే అడగరు) చెప్పవద్దు అనే నియమమును పాటించుచుండుటచే స్వదేశములోనే అంతగా ప్రచారము చేసెడివారు కాదు. 3. నాడు ప్రయాణసాధనములు తక్కువ, ఈ బోధజ్ఞులలో గృహస్థులే ఎక్కువ వారు సంసారమునందుండి భుక్తి ముక్తి క్రియల యందు నిమగ్నులగుటచే బోధను విరివిగా దేశములు తిరిగి ప్రచారము చేయుటకు తగిన వ్యవధి ఆర్థిక సంపత్తి లేకుండెడిది. 4. ఆంధ్రప్రదేశమందైననూ యీ బోధయొక్క బహుళ ప్రచారము అజన్మబ్రహ్మచారియగు సచ్చితానంద వెంటేశ్వరావధూతగారి నాటినుండియే ప్రారంభమయ్యెను. ఐననూ కన్నడదేశమందు బశవేశ్వరులు ఈ బోధనెరిగియుండుటచే వారి శిష్యవర్గములో కొలదిగా వ్యాప్తిచెందెను. నేడుకూడా రాయచూరు ప్రాంతములో యాబోధ ప్రచారములో నున్నది. శ్రీధరులు మహారాష్ట్ర దేశములో జన్మించిన వారగుటచే ఆనాడట యీ బోధనెరిగినవారు యుండి యుండవచ్చును. ప్రస్తుత కాలములో యీ బోధను శ్రీవారికడ తెలిసిన తమిళ సోదరులు పరిపూర్ణ బోధ గ్రంధములను తమిళములోనికి తర్జుమాచేసి తమిళనాడులో ప్రచారము చేయుచున్నారు. ఓంఢ్రదేశము (ఒరిస్సాలో) యాబోధ కొద్దిగా వ్యాప్తి చెందినది. యీ బోధ నేర్చిన ఆంధ్రులు భారతదేశములో పలుచోట్ల స్థిరపడుచుండుటచే ఆయా చోట్ల ఇది కొద్దిగా ప్రచారమగుచున్నది.

యితర దేశస్థులకు మోక్షశబ్దమునకు మనమిచ్చే అర్థము ఎవరికోగాని తెలియదు. వారి దృష్టిలో మోక్షమనగా సకల సుఖసంపదలు గల స్వర్గమే. యీ శతాబ్దములోని హైందవమతము యెక్కువగా విదేశములయందు వ్యాప్తి చెందుచున్నది. కాలక్రమేణా పరిపూర్ణ బోధ సిద్ధాంతముకూడా ప్రపంచమంతటా వ్యాప్తి కాగలదని ఆశించుటకు పునాదులు ఏర్పడుచున్నవి. విదేశ భాషా విశారదులీ బోధను గ్రహించి ఆయా భాషలలోనికి యీ బోధను తర్జుమాచేసి ప్రచారము గావింపగలరు.

ప్రశ్న: అంతరార్థ భావములో వరగురు శిష్యులనగా నెవరు? వారి స్థానస్వభావములెవ్వి?

జవాబు: వరగురు శిష్యులనగా శ్రేష్ఠమగు గురుశిష్యులు సద్గురువు సచ్ఛిష్యుడు అని మాత్రమే అర్థము. దీనికంతరార్థమేమో నా కర్థమగుటలేదు. యీ సమాసము ప్రయోగింపబడిన, వాక్యము, పద్యము, లేక కీర్తన యొక్క భావనను బట్టి అంతరార్థమేమైనా యుండునేమో పరిశీలింపవలసివుండును.

ఐనను శ్రేష్ఠడగు గురువు అనుటలో గురుమూర్తి యొక్క నిర్గుణ స్వరూపమును గురుత్వమును చెప్పవచ్చును గురు శబ్దమునకు గొప్ప అని అర్థము అంతకంటే గొప్పది

అనగా పెద్దది లేదన్నమాట "అణోరణీయాన్ మహతో మహీయాన్" అణువుకన్ననూ చిన్నదై మహత్ కన్ననూ పెద్దదైయున్నది. పరమాత్మ స్వరూపము. ఆ భూమా పదార్థమే వరగురువు అని చెప్పవచ్చును. గురువు అనగా గొప్ప వస్తువు అన్నప్పుడు దానికి ప్రతియోగిగా అణు స్వరూపమైన జీవాత్మను శిష్యస్వరూపముగా చెప్పవచ్చును. ఆ దృష్టితో పరమాత్మ జీవాత్మ వరగురు శిష్యులన వచ్చునే గాని గురుశిష్యన్యాయము ఎట్లు పొసగును? గురువువలె పరమాత్మ (లేక ఈశ్వర్లు) సర్వజ్ఞుడు. శిష్యునివలె జీవుడు కించిజ్ఞుడు అంతవరకే పోలిక. వీరి స్థాన స్వభావములు గురు ముఖతః వస్తునిశ్చయముగా విచారించదగును.

ప్రశ్న: "పంచ తత్వములను పాలించి కడమించు అని పెద్దలన్నారు. పంచతత్వములెవ్వి? పాలించుటెట్లు? కడమించుటెట్లు? ఈ పంచతత్వములు అనగా పంచశరీరము అనికూడా పెద్దలు చెప్పుచున్నారు. గాన తమరవి ఎట్లావున్నవో తెలుపుదురని కోరుచున్నాము?

జవాబు : పంచతత్వములు పంచ శరీరములనుట పనికిరాదు. ఏలననగా స్థూలశరీరము గూడా నొక తత్వమనుట ఏ రీతిగానూ పొసగదు. ఆ పెద్దలతో ఆ విషయము చర్చించతగును సృష్టిక్రమంలో "పంచతన్మాత్రేభ్యో పంచమహాభూతాని" అని చెప్పబడినది. కనుక అపంచీకృత పంచమహాభూతములగు పంచ తన్మాత్రలు (శబ్ద, స్పర్శ, రూప, రస గంధ తన్మాత్రలే పంచతత్వములు ఈ పంచతన్మాత్రలే తత్వాకాశమని పంచాకాశ నిర్ణయములో చెప్పబడినవి. పాలించుట అనగా వానిపై అధికారము కల్గి, అదుపులో పెట్టుకొనుట. యీ పంచతన్మాత్ర విషయములగు శబ్ద, స్పర్శ, రూప రసగంధములను విషయపంచకము యొక్క ఆకర్షణకు లోనై మానవుడు అధోగతి పాలగుచున్నాడు. కనుక ఆ విషయపంచకమునకు దాసుడు గాక వానిని నిగ్రహించుటే దీనిని పాలించుట. కడమించుటనగా పంచతన్మాత్ర రహితమునందే పరిపూర్ణ నిశ్చయము. ధ్వని మొదలగు తన్మాత్రలు కనుకొనగా లేశమైనా గాన్పించనిది పరిపూర్ణమని శ్రీకృష్ణదేశికేంద్రులవారు సెలవిచ్చారు. కనుక కడమించుట అనగా పరిపూర్ణ పరబ్రహ్మమును గ్రహించుట.

ప్రశ్న: రాజయోగి మొదట ఏ సాధనగల్గియుండెను? ఆర్యులు వచించియుండిరి, "సాధన సంపత్తిగలవారికి పూర్ణబోధ" అని?

జవాబు : పరిపూర్ణబోధ తెలియుటకు మొదట్లో ఏ సాధనలు చేసెను? అని మీ అభిప్రాయమైయుండునని యూహించుచున్నాను. సాధన సంపత్తిగలవారికే పూర్ణబోధ అనేమాట, సరి అయినదే. కాని సాధన సంపత్తి అనగానేమి? సాధన చతుష్టయసంపత్తి అని అర్థము గ్రహించి చాలమంది పొరబడుచున్నారు. ఏలయనగా సాధన సంపత్తి అన్నారుగాని సాధన చతుష్టయము అనలేదు గదా? కనుక సాధనలు చేసి సంపాదించిన మిక్కిలి గొప్పదగు ఆత్మస్వరూప సాక్షాత్కార సిద్ధియే సంపత్తి. అట్టి సంపత్తి ముందుగా గురుకృపకు పాత్రుడై పొంది ఆ పిదపనే "ఆత్మాతీతం కేవలాయాత్మ" అని చెప్పబడిన పరిపూర్ణబోధ తెలియవలెను. గురువులున్ను అట్టి సంపత్తి శిష్యునికి చేకూర్చిగాని పరిపూర్ణబోధ చెప్పరాదు

42A

ప్రశ్న: "అశరీరం సర్వదా అస్తి" అను శ్లోకమునకు అర్థము వ్రాయకోరెదను? 44

జవాబు : శరీరమనగా గుర్తెరిగె శరీరము అశరీరమనగా అట్టి గుర్తెరిగే శరీరమేమీ లేదని కనుక జ్ఞానాజ్ఞాన రహితమైన కేవలం పరిపూర్ణ బ్రహ్మమొక్కటియే అశరీరం. అది సర్వదాకాలత్రయములందు వుండివున్నది. దానియందు శరీరమన్నది యెన్నడూలేదు. కనుకనే జ్ఞానాజ్ఞానములుగా మారుతూ రాకపోకలు కల్గియున్న గుర్తెరిగే శరీరము అసత్యవస్తువుగా చెప్పబడుచున్నది. సత్యమగు, నాపరిపూర్ణ పరబ్రహ్మమునూ అసత్యమగు గుర్తెరిగే శరీరమును వస్తు,నిశ్చయముగా తెలిసికొన్నపుడే జననమరణభ్రాంతి రహిత రూపమగు విడుదల సిద్ధించును. ఇక యితర మార్గములచేత నిట్టి భ్రాంతి రహిత స్థితి సాధ్యము కాదు సరిగదా భ్రాంతి విస్తారమేయగుచుండును.

ప్రశ్న: మనసున బుద్ధియు దోచును, మనసునహంకారమేను, మనసున చిత్తం, బెనయగు నాలుగు విధముల గని, మని, తన తనువు తెలియగానరు వేమా" గని అనగా ప్రత్యక్షంగా కనిపిస్తాయా? మని అంటే మానుటెట్లు? తన తనువు అనగా నేది? 45

జవాబు : మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అను వానికి అంతకరణ చతుష్టయమని పేరు. ఏలయన అంతఃకరణ ఒక్కటే యీ నాల్గింటి పనులు చేయుచూ ఏపని చేయునపుడు ఆ యింద్రియపు పేరుతో పిలువబడుచూనున్నది. గని అనగా విచారంచి లేదా విమర్శించి తెలుసుకొని అని అర్థమేగాని చర్మచక్షువులకు గోచరిస్తాయి అని అర్థంకాదు. మని అంటే బ్రతికి (జీవించి) అనే అర్థమే కాని మని అంటే మాని అని అర్థం కాదు. అర్థం అవుటకోసం అక్షరాలకు లేని దీర్ఘాలు పెట్టి సాగెయ్యకూడదు. కాళ్ళు పొట్టిగా వున్నాయి కనుక పంట్లాముకు సరిపడే లాగున కాళ్ళు సాగగొట్టుమన్నట్లుంది. ఒక్కటైన అంత:కరణమునే జ్ఞానమని మనస్సని గూడనందురు అట్టి మనస్సు యొక్క వ్యష్టి సమిష్టి రూపములు గురుముఖతః తెలిసికొని జీవించినచో అని అర్థము. తనువు అనగా గుర్తెరిగే శరీరము గానరు అనగా సత్యమని యిక భావించరు.

ప్రశ్న: కం॥ రధమునకు నైదుచీలలు, రధికుడదలించినపుడు అరుగును రధమున్ః రధతనువులైదు చీలలు, విదితంబుగ నడపువాని వెదకుము వేమా!! రధతనువులు ఏమిటి! నడుపువాడెవడు! 46

జవాబు: ఈ పద్యమునకున్న కఠోపనిషత్‌లోని "ఆత్మానగ్ంరధినం విద్ధి, శరీరం రధమేవతు బుద్ధింత సారధిం విద్ధిం మనఃప,గ్రహమేవచ" కున్ను పోలికలు గలవు. ఆత్మయే రధికుడు శరీరమే రధము, బుద్ధియే సారధి మనస్సు పగ్గములు అని దాని భావము వేమన పద్యములో భావన ఏమనగా శరీరమనే రధమునకు జ్ఞానేంద్రియములు అనగా శ్రోత్ర త్వక్కు చక్షుల్జిహ్వాఘ్రాణములు చీలలు, రధికుడు అనగా మనఃప్రాణములతో గూడిన జీవుడు. ఈ శరీరము యింద్రియములు జీవుడు, యీ మూటిని గూడ నడిపించునది ఏదియె ఆ

వస్తువును వెదకి తెలుసుకొనమని వేమన పద్యభావము. ఆ వస్తువేదనగా ఆత్మయే వెదకి తెలుసుకొమ్మనగా విచారించి తెలుసుకొమ్ము యిది ఆత్మకాదు.యిది ఆత్మకాదు (నేతి, నేతి) అని ఆత్మకాని వానిని నిషేధిస్తూ పోగా శేషించినదేదో అది ఆత్మ అనీ తత్వమసి మహావాక్యములో పదార్థములను అన్వయ వ్యతిరేకయుక్తులచే విచారించుట వలన ఆత్మోపలబ్ధి చేకూరుననీ వేదాంతులు చెప్పుచున్నారు.

ఆ తత్, త్వం, అసి అను మూడు పదములచే సూచింపబడిన వస్తువులను గురుమూర్తి శిష్యునికి వస్తునిశ్చయపూర్వకముగ చూపించునని గురుగీత యుద్ఘాటించుచున్నది. "అఖండమండలాకారం వ్యాప్తం యేన చరాచరం" మొదలగు గురుగీత శ్లోకములు చూడవలెను

147 .ప్రశ్న : ఒక శిష్యుడు పరిపూర్ణ గురుమూర్తి చేరి, నక్కవినయములుగా నటించి వారి ద్వారా ధర్మోపదేశము పొంది, వారు చెప్పు పద్ధతులు పాటించక కనీసము, గురుదర్శనమునకైన రాకవున్నారు. మరో గురుని చేరుటకు చూస్తున్నారు. దీనికి జవాబు వ్రాయవలెను?

జవాబు : నిజంగా గురువు పరిపూర్ణ బోధయందు ఆరూఢతగాంచి తనకు బోధించగల సమర్థుడైతే అట్టి సద్గురుని వదలి రెండో గురుని (అనగా అన్య సాంప్రదాయకుడైన గురుని) చేరుట మహాద్రోహము. అట్టి నరునకు నరకము తప్పదన్నారు శ్రీకృష్ణదేశికేంద్రులవారు గురు స్వరూపమంతయూ ఏకమే. కనుక పరిపూర్ణ బోధ దెలిపే గురువైతే ఆయనను రెండో గురుడనరాదు. అన్యుడైన మతసాంప్రదాయక గురువే రెండో గురుడని కృష్ణదేశికేంద్రుల భావము. ఒక పరిపూర్ణ బోధజ్ఞుడైన గురువు వలన తనకు భ్రాంతిరహితము గానిచో సమర్థుడైన మరొక పూర్ణ గురువును ఆశ్రయించుటలో దోషము లేదు. "మధులుబ్ధోయథాభ్రుంగః" పుష్పాం పుష్పాంతరం వ్రజేత జ్ఞానలుబ్ధః స్థథాశిష్యో గుర్వోర్గ్వంతరం వ్రజేత్" అనగా ఆకలిగొన్న తుమ్మెద ఆకలి పూర్తిగా తీరేవరకు మకరందము గ్రోలుటకై ఒక పువ్వునుండి మరొక పువ్వుకడకు చేరుచున్నట్లే జిజ్ఞాసి సంశయ నివృత్తియు భ్రాంతి రహితము గానంతవరకు ఒక పూర్ణగురువుకడ నుండి మరొక పూర్ణగురువును ఆశ్రయించి జ్ఞాన పిపాస శాంతింపచేసుకొనుటయే ధర్మము. ఇందేలాటి సంశయము లేదు. కాని మీరు చెప్పినట్లు నక్క వినయములు నటించుట గురువు చెప్పిన ధర్మపద్ధతులు పాటించక పోవుట, కడుంగడు దూష్యములు ఆగురువు వలన తన కేమీ ప్రయోజనము లేదని తెలిసిన పిమ్మట దర్శనమూ చేసుకొనకపోయినను దోషము లేదు.

148 ప్రశ్న: పూర్ణ గురువును చేరి ధర్మోపదేశము పొందక రామ, కృష్ణ, శివ, శక్తి విగ్రములను నిల్పుకొని, నామరూప, బేధమేగాని పరమాత్ముడొక్కడేనని, అనేక మతములవారు వ్రాసిన పాటలు పద్యములు గానం చేస్తూ ఆనందించే భక్తుల భవిష్యత్తేమిటి?

జవాబు : అప్పటికప్పుడు తాత్కాలికముగా కల్గు ఆనందము, తృప్తియేగాని అంతకంటే ఏమీ ప్రయోజనము లేదు. ఏలననగా అనన్యభక్తి, ఏకాంత భక్తి సోపానముల వారెన్నడూ పొందజాలరు. ఉపాసనకు ఫలము ఏకాగ్రచిత్తము. అదియును కలుగజాలదు "ఏకోదేవః శివోవా కేశవంవా" అనగా శివుడో కేశవుడో ఒక్కనినే సేవించిననే ప్రయోజనం" నీవే తప్పనితఃపరంబెరుగ"ననే ప్రవృత్తి చాలా అవసరము. లేనిచో నదీ మధ్యమున రెండు పడవల మీద కాలువేసి నిలుచున్న విధానమౌను. వుమ్మడిగొడ్డును వారు చూస్తారని వీరు, వీరు చూస్తారని వారు వూరుకుంటే ఏమి జరుగునో అట్లే అనేక దైవములనుపాసించువాని గతియునట్టిదేయగును. అట్లుగాక ఒకే నామరూపములు ధ్యానించి ఉపాసనచేయువానికి ఆ యిష్టదేవతానుగ్రహ విశేషమున ఆయిష్టదైవము యొక్క లోకము అత్యంత సమీపస్థితి, సారూప్యస్థితి, లేక సాయుజ్యము (యిష్ట దైవములో ఐక్యమగుట) కలుగును. పరిపూర్ణ బోధకు జనన మరణభ్రాంతి రహితమే ఫలము అట్టి వుత్తమ ఫలము యితర మార్గములచే పొందనలవికాదు.

ప్రశ్న: అఖిలాంధ్ర సాధుపరిషత్సభలు మొదలగు వేదాంత సభలకు అచల సాంప్రదాయకులు, పీఠాధిపతులు వెళ్ళుచున్నారా లేక వెళ్ళరా? 49

జవాబు : అచల సాంప్రదాయకులు ప్రథమంలో యితర సాంప్రదాయకుల ప్రబోధలు వినినచో వారికి స్వధర్మమునందు ఆరూఢత కలుగజాలదు. చిన్న మొక్కలకు కంచవేసి పశువుల బారినుండి కాపాడనిచో, అవి నశించిపోవును. ఆ మొక్కలే మానుకట్టిన పిదప ఆ చెట్టు మొదట ఆ పశువులను కట్టివేసిననూ ఆ చెట్టునేమియూ చేయజాలవు అట్టే తమ సాంప్రదాయక ప్రబోధమునూ నిర్దుష్టముగా తెలుసుకొన్న మీదట వారికి సర్వసందేహ నివృత్తి కాగలదు. ఆపైన వారన్య సాంప్రదాయకుల ప్రబోధలు విన్ననూ బాధలేదు. అట్లు వినుట వలన మతబేధములను గుర్తించి స్వసిద్ధాంతమునెడల విశ్వాసము పెంపొందునే గాని సడలనేరదు. అట్టివారెన్ని సభలలో ఎవరి వుపన్యాసములు విన్నా బాధలేదు. అచల పీఠాధిపతులు సర్వము తెలిసినవారు "వారెరుగని మరుగండదన్నా" అన్నారు కృష్ణదేశికేంద్రులవారు వారే సభలకు వెళ్ళవలసిన పనిలేదు.

ప్రశ్న : మూల ప్రకృతి చైతన్యాలు బ్రహ్మపదార్థమా? లేక ప్రత్యేక పదార్థమా? 50

జవాబు : "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అను శ్రుతికి భిన్న భిన్న మతాలవారు భిన్న భిన్నముగ భాష్యాలు వ్రాసేరు సృష్టికి పూర్వమున్నది ఒకటి బ్రహ్మ వస్తువు. రెండోది లేదు. ఆ ఒక్కటే "ఏకం అనేకం భవతి" అని చెప్పబడిన ప్రకారం అనేక నామ రూపాలైనది. ఏకంగానున్నా అనేకంగా వున్నా, మొత్తమంతా లేనెరుక స్వరూపమేనని కేవల పరిపూర్ణమొక్కటే సత్యమనీ పరిపూర్ణ భావజ్ఞుల సిద్ధాంతము. నామరూపాత్మకమగు సర్వము మిథ్య బ్రహ్మము వివర్తమైనది. దాని సన్నిధానమున మాయాపరిణమించినది. మాయలేనిది "చైతన్యమూర్తియన్న క్షేత్రజ్ఞుడని

యన్న మాయకే పరియాయ నామములు'' అని భద్రాద్రి రామశతక పద్యభావమును అద్వైతులు ప్రతిపాదించిరి. బ్రహ్మముకంటె మిగతావన్నీ బిన్నములే అన్నారు అద్వైతులు యీ షణ్మాత్ర భేదములతో మిగతా మత వాదములు ప్రవర్తిల్లినవి.

ప్రశ్న: కమల మకరందసారము
కమలము దరియందు కంచుగాన నిభంగిన్
51 సమబుద్ధి తన్నెరుంగని
కుమతుల కేరీతి కల్గు గురుపదసేవా - సద్గురు పాదసేవా?దీనిని వివరింప గోర్తాను?

జవాబు : తామర పద్మమునందలి తేనె యొక్క రుచిలో కల్గు ఆనందము ఆ తామర పూవు చెంతనే యుండు కప్పకెట్లు తెలియదో తమ స్వరూపానందము మెరుగని మలిన మనస్కులకు గురుపద సేవానందము దొరకదు. అని తాత్పర్యము తన స్వరూపము, గురు స్వరూపము, పరమాత్మ స్వరూపము యీ మూడు ఒక్కటే. స్వరూపము నెరిగినపుడు గాని గురువునందు నిజముగా గురుసాక్షాత్ పరబ్రహ్మ అనే దృడనిశ్చయజ్ఞానము కుదరదు. అట్టి జ్ఞానవంతుడుగాని నిజముగా గురుడు నరుడుగాదు. పరబ్రహ్మస్వరూమే యనే దృష్టిగల్గి సేవించజాలడు.

52 ప్రశ్న: మానవజన్మకు పూర్వాపరజన్మలేవి?

జవాబు : జన్మకు కారణం కర్మ పూర్వ కర్మలననుసరించి వుత్తరోత్తర జన్మలు వచ్చుచుండును. అనేక జన్మలలో ప్రోగుబడిన సంచిత్ కర్మరాశినుండి కాలగతి ననుసరించి ఫలోన్ముఖములైన కర్మఫలములను గైకొని వానిని అనుభవించుటకు యోగ్యమైన శరీరమును జీవుడు నిర్మించుకొనుచుండును. ఇట్లనేక జన్మలనెత్తిన పిదప మానవజన్మకలుగును. మానవుడై పుట్టినంత మాత్రమున తిరిగి నీచయోనులకు పోడని అనుకొనరాదు. మానవుడై పుట్టిన పిదప, మానవతా ధర్మమును పాటించుచూ తన స్వరూపమును తెలిసికొనుటకు గాఢముగా ప్రయత్నించుచూ ఆ ప్రయత్నములో కృతార్థుడుగాక పూర్వమే మరణించునేని అతనినే భ్రష్టయోగి అందురు. అతడు మాత్రమే మరల తప్పక మానవుడుగా జన్మించి పూర్వపు మానవజన్మయందలి ప్రయత్నమందే కృషిచేసి మానవజన్మ సార్థకమొనరించుకొనగలడు.

53 ప్రశ్న: బృహద్వాశిష్ట సిద్ధాంతము సాధన సంపత్తి లేని గురు కూటము అని అన జెల్లునా?

జవాబు : అనరాదు, సాధనలు చేసి చేసి ఆత్మస్వరూప నిశ్చయ జ్ఞానమును పొందుటయే సాధన సంపత్తి అట్టి సంపత్తి గలవారికే బోదాదికారమును పీఠాధిపతులను గ్రహింతురు. యెరుక నెరిగిన వారికే పరిపూర్ణ బోధను గురుమూర్తి చెప్పును. తన్నాశ్రయించిన శిష్యులు సాధరణముగా ఆదిలో ఆత్మజ్ఞానము లేనివారే అయి వుండుట సహజమే. వారి అధికార తారతమ్యము ననుసరించి వారికి సాధనా మార్గము యెరింగించి యెరుక నిర్ణయము వస్తు యపూర్వకముగా కలిగిన మీదటనే సద్గురుడాతనికి బృహద్వాశిష్ఠ సిద్ధాంతము తెలుపును. క ..కనది సాధన సంపత్తిలేని గురుకూటమని యెంతమాత్రము చెప్పరాదు.

ప్రశ్న: అన్నం పరబ్రహ్మస్వరూపమని, వుదకం నారాయణ స్వరూపమని యెందుకందురు? 4

జవాబు : నోటితో తినబడేది అంతా అన్నమే ఇది స్థూల శరీరమును మాత్రమే రక్షించి పోషించి పెంపొందించును. అట్లే సూక్ష్మకారణ మహాకారణ శరీరములను పెంపొందించి వానికి సత్తాననుగ్రహించునవన్నియు అన్నమే అని చెప్పబడినది. ఈ దృష్టితో పంచభూతములు యింద్రియములచే గ్రహింపబడు శబ్దాదులు, యింద్రియధిష్టాన దేవతలు చివరకు అధిష్ఠాన చేతన బ్రహ్మము యివి అన్నియు ప్రాణులకు రక్షణ నొసంగుచున్నవి. కనుక, బ్రహ్మాండమందు సమస్తమును దానికి అదిష్ఠానమగు బ్రహ్మమున్ను అన్నస్వరూపమే కనుక అన్నం పరబ్రహ్మస్వరూపమన్నారు. ఉదకము జలభూత సంబంధము దాని సూక్ష్మాంశము ప్రాణము. ప్రాణము సర్వప్రాణులను రక్షించి పోషించును. త్రిమూర్తులలో పోషణకర్త శ్రీమహావిష్ణువు లేక నారాయణుడు. నారములనగా నీళ్ళు, క్షీరసాగరమందు శేషశయ్యపై నారాయణుడు పవళించి యుండునని పురాణములు చెప్పుచున్నవి. మరియు జలము కంటెను సూక్ష్మాతి సూక్ష్మమగు జలముల యందే వున్న జలభూతమున కదిష్ఠానము విష్ణువు కనుక వుదకం నారాయణ స్వరూపం అన్నారు.

ప్రశ్న: ఆ॥వె॥ కడుపు నిండగానే కక్కివేసిన కూడు 5

మరల తినువాడు మౌనయోగి

చయ్యన వలపోగ చిత్తంబు ధృఢమౌనె

విశ్వదాభిరామ వినురవేమ.

జవాబు : కడుపునిండ కూడు అనగా గురుబోధ. గురుబోధ విని సంతృప్తి చెంది తిన్నకూడు కక్కివేయుట. నోటితో మరల చెప్పగల్గినంత మాత్రమున బోధ ఆరూఢముకాదు. విని, తిరిగి చెప్పగల్గిన,యా గురు వాక్యములు మరల మరల మననము చేసి సంశయ నివృత్తి గావించుకొనటే కక్కినకూడు. మరలనెత్తి తినుట ఆ విధముగా శ్రవణమనన నిధిద్యాసులు చేసినవానికే బోధయారూఢమై సర్వ సంశయరాహిత్యము కలుగును. ఇకనాతడు అడిగి తెలుసుకొనవలసిన పనిలేదు. కనుక అతడు మౌనము వహించగల్గిన యోగి కాగలడు. అట్లుగాక బోధ విన్న వెంటనే బైటికి పోవు వానికి ధృఢమైన చిత్తము శాంతి పొందజాలడు అని తాత్పర్యము.

ప్రశ్న: వేమన గురువు అంబికా శివయోగియా లేక అభిరాముడా? 6

జవాబు : అభిరాముడనువాడు విశ్వబ్రాహ్మణ కులమున బుట్టిన భక్తుడు. వూరుబయటనున్న కొండగుహలో తపస్సుచేసుకొనే అంబికా శివయోగికి సేవ చేస్తుండేవాడు. అంబికా శివయోగి సిద్ధి పొందు కాలము సమీపించగా అభిరాముని కుపదేశమును అనుగ్రహించివలెనని సంకల్పించి మరునాడు వుదయం రావలసినదిగా నాజ్ఞాపించెను. ఆసమీపములోనున్న వేమన

యీ అంబికా శివమోగి మాటలువిని ఆయుపదేశము తానే గైకొనదలచి అభిరాముని నిర్ణయసమయమునకు అంబికా శివయోగి కడకు పోకుండా చేయుటకు నిశ్చయుంచుకొనెను. అభిరాముడు ఇంటికి బంగారపు పనివాడు, వదినగార్కి చెప్పి అభిరాముని పిలిపించి తమ యెదుటనే నుండి ఒక బంగారునగను పూర్తిచేసి యిచ్చిగాని ఎక్కడకు కదలకుండా నుండునట్లు కట్టుదిట్టము చేయించెను. మరునాడు నిర్ణీతకాలమునకు అభిరాముని స్థానే తానుపోయి అంబికా శివయోగికడ వేమన యుపదేశముగైకొనెను. వుపదేశానంతరం అంబికాశివయోగి సిద్ధిపొందెను. అభిరామునికి చెందవలసిన వుపదేశామృతం అతనికి దక్కకుండ చేసిన పాపప్రాయశ్చిత్తమునకూ తానల్లిన పద్యములన్నిటియందు అభిరాముని కీర్తించు మకుటము చేర్చి రచించుట జరిగెను. యిదీ కథ. కనుక అంబికా శివమోగియే వేమన గురువు. అభిరాముడు కాడు. కాని అభిరాముని యందు గురు భావము కలిగియుండెను.

ప్రశ్న: ముప్పది రెండక్షరములు, ముప్పిరి గొన్నటి మూలమును దెలసినచో తప్పక కడతేరనగును. జప్పెదకద మహిమ నీకు చెప్పెద వేమా॥ యందుకు కొందరు సాఖ్యమని అంటూ వున్నారు. కనుక విస్తరించి వ్రాయగలరు?

జవాబు : ముప్పది రెండక్షరములు గలది కలి సంతారణ మంత్రమని చెప్పబడుచున్నది. "హరేరామ, హరేరామ, రామ రామ, హరే హరే, హరేకృష్ణ హరేకృష్ణ, కృష్ణ కృష్ణ హరే హరే" ఈ మంత్రము కలి కల్మష నాశనము చేయునని ద్వాపరాంతమున బ్రహ్మ నారదునికుపదేశించెను. ఇందున్న భగవన్నామములు మూడు, హరి, రామ, కృష్ణ. యీ మూడును ముప్పిరిగొన్న మంత్రమిది. యిందు హరి నామము యెనిమిది మార్లున్ను రామ నామము నాలుగు మార్లున్ను కృష్ణనామము నాలుగు మార్లున్ను మొత్తం భగవన్నామము 16 సార్లు వుచ్ఛరింపబడుచున్నది. ఈ 16 పర్యాయములు, భగవన్నామస్మరణ చేయుటచే షోడశ కళలచే నావరింపబడిన జీవుని ఆవరణ దోషము తొలగిపోయి, స్వరూప జ్ఞానము కలుగునని చెప్పబడుచున్నది. కలియుగమున జ్ఞాన, కర్మ, యోగ మార్గములతో ప్రవర్తించుట దుస్తరము, కనుక భక్తిమార్గమున మానవులు కడతేరుటకే యీ మంత్రముపదేశింపబడినదని చెప్పబడినది. హకారము సర్వకర్మములకు బీజమని రేఫకారము ఆ కర్మబీజము నాశనము చేయు జ్ఞానాగ్ని అని కనుక హరియనగా "హరయను రెండక్షరములు హరియంచును పాతకములంబుజనాభా" అని అర్థము చెప్పబడినది. నారాయణ మంత్రములోని "రా" అక్షరమును శివ మంత్రము నమశ్శివాయలో "మ" కారమును జీవాక్షరములై యున్నవి. కనుక "రామ" శబ్దము హరిహరాత్మకము అవిద్యను ఆకర్షించువాడని కృష్ణ శబ్దార్థము. కనుక యీ మంత్రము సర్వ కల్మష నాశనకరమని చెప్పబడుచున్నది. యిందు హరి, రామ, కృష్ణ అను మూడు శబ్దములు ముప్పిరిగొన్న యీ మంత్రమునకు మూలమేది? అనగా మంత్రములన్నియు అక్షరముల కూడికచే నేర్పడినవి ధన్యాత్మకమగు ప్రణవమునుండి

వర్ణాత్మకమగు ఏబది అక్షరములు ఏర్పడి యీ అక్షరముల కూడికలో శబ్దములు, మంత్రములు, వేదశాస్త్రాలు సకల వాఙ్మయము యేర్పడినది. ఆ ప్రణవమునకు మూలమేమియో సద్గురువుల చెంత గ్రహించినవాడే జన్మరాహిత్యరూపముగా కడతేరగలడని వేమన యభిప్రాయము. ఏలననగా పాపము పోయిన చాలదు పుణ్యము శేషించి ఆ పుణ్యానుభవమునకై వుత్తమ జన్మలు ఎత్తవలసివుండును అని అవిద్య తొలగినచో విద్య శేషించును పాపపుణ్యములలో పుణ్యమున్ను. విద్యావిద్యలలో విద్యయును హిరణ్మయశృంఖలములై బంధించును. కనుక సర్వమునకు మూలమైన దానికి మూలము లేదని గుర్తించినపుడే సర్వభ్రాంతి రహితము కాగలదు.

ప్రశ్న : తత్వములు, ప్రకృతి, 25వ వాడు, జీవుడు, 26వ వాడు యీశ్వరుడనియు, జీవేశ్వర సమ్మేళనమే "తత్యమసి" వాక్యార్థ సప్తవింశతి తత్వాత్మకము పరబ్రహ్మమనియు ఆ పరబ్రహ్మను సంధానమే నిష్ఠయనియు పెద్దలు చెప్పిరి? ఇందేది పరిపూర్ణ బ్రహ్మము? విశదంగా వివరణ చేయ ప్రార్థన? 58

జవాబు : ఇందేది పరిపూర్ణ బ్రహ్మము కాదని మీమాటలలోనే జవాబు చిక్కుచున్నది. పరిపూర్ణ పరబ్రహ్మము ఏకానేకములు కానిది. లెక్కకు రానిది. మనోవాక్కులకందనిది. చెప్పినది చూచినది, తలంచినది అంతయూ యెరుకే "నచక్షుర్గచ్ఛతి, నవాగ్గచ్ఛతినోమనః ఎరుకలేక సేవించదగినదేగాని ఎరుకచే దానికి తెలియరానిదియని తెలుసుకోవలెను.

ప్రశ్న: శ్రీశివరామ దీక్షితులవారు "ఆత్మ, శరీరములు రెండును ఇరవై ఐదు తత్వములే అని వ్రాసినారు. కొందరు ఇరవైఐదు తత్వములు శరీరమని ఇరవై ఆరవదే ఆత్మ అని వాదించుచున్నారు. ఆత్మ ఇరవై ఐదవదా? ఇరవై ఆరవదా? ఏది సత్యము? మీరు నిర్ణయము చేసి తెలుపవలెను. 59

జవాబు : అహంకార నిరసన ప్రకరణమునందు వ్రాయబడిన మాటలివి "ఇరవై అయిదవది అయిన ఎరుక అను అహంకారమే, ఆత్మ శరీరము, కనుక అహంకారము లేనివారు ఇరవై ఆరవది అయిన అత్యంత విలక్షణులు, వారే శ్రియఃపతి వారే ఈ శరీరము నందు అహంకారము లేక వున్నారు, వారే అశరీరులు.

దీక్షితులవారు ఇరువది ఐదవది అయిన యెరుక అహంకారమే ఆత్మశరీరం అన్నారు ఇరవై అయిదు తత్వములలో ఆకాశపంచకములోని అనగా జ్ఞాన మనో, బుద్ధి చిత్త అహంకారములలో జ్ఞానము మొదటిది. ఎరుక అన్న జ్ఞానమన్న ఒక్కటే. జ్ఞానము యొక్క శరీరమేగాని ఆత్మశరీరములు రెండు చెప్పబడినట్లు అర్థము కాదు. కనుకనే అహంకారము లేనివారు ఇరవై ఆరవది అయిన ఆత్మ స్వరూపమునే అయివున్నారని అట్టివారే ఈ శరీరమునందు అహంకారము లేక వున్నవారు అని, వారే అశరీరులని అర్థము అనగా

అహంకారము లేని వారే అశరీరులని తెలియవలెను. కనుక ఆత్మ ఇరవై ఆరవదే అహంకారమే శరీరము అని తెలియవలెను.

60 ప్రశ్న: మృత్తికయే తనతనువట, మృత్తిక దళమెత్తి నిలుప మొదలాదురువౌ మృత్తిక యున్నది మూటికి, నిత్తరువులు ధరణి మహితులెరుగరు వేమ" దీని అర్థము వ్రాయగోర్తాను.

జవాబు : (1)మృత్తిక అనగా మట్టి అనగా పంచభూతములలో పృధివినుండి ఓషదులు, ఓషదులనుండి అన్నము, అన్నము నుండి సకల జీవశరీరములు కలుగుచున్నవి. కనుక మృత్తికయే తన తనువట అన్నారు. అనగా తన శరీరము మిగతా శరీరములన్నియి మట్టినుండి పుట్టినవే (2) తారకమునందు చెప్పబడిన సప్త చక్రములలో ఆధార చక్రము మొదటిది ఆధార చక్రము పృధివీభూత సంబంధము, కనుక పృధివీభూత సంబంధమగు మట్టియే 4 దళములతో గూడిన ఆధారచక్రమైనది. దళమెత్తి అనగా దళములు పూని అని అర్థము (3) "మృత్తిక యున్నది మూటికి" అనగా ముమ్మాటికి మృత్తిక సత్యమై వున్నదని ఒక అర్థము మరియొక రీతిగా అర్థము ఏమనగా మూడు వస్తువులు కూడా మట్టియే యున్నదని యీ అర్థములో ఆ మూడవ వస్తువేది? తిన్న అన్నము సప్తధాతురూపము చెంది ఆ పిదప మనస్సు. ఓజస్సు అను రూపములుగా మారుచున్నది. కనుక అన్నము యొక్క సూక్ష్మాంశము మనస్సు అన్నము పృధివీ సంబంధము కనుక మనస్సున్ను ఆ పృధివీ సంబంధము సంబంధమగు మృత్తికయే (లేక మనస్సు) సమిష్టియందు బ్రహ్మ స్వరూపమే అయివున్నది కనుకనే శ్రుతి "అన్నం బ్రహ్మేతి విజానాత్" అంటూ చెప్పినది కనుక ఆ మూడు వస్తువులను మనస్సుని చెప్పినా లేక బ్రహ్మమేనని చెప్పినా, చెప్పవచ్చును. బ్రహ్మము నుండియే పృధ్వీ భూతము, ఉత్పత్తి అగుచున్నది, పృధివినుండి పూర్ణ్యపరిణామములో మరల, ఆ బ్రహ్మమగుచున్నది. విత్తనము నుండి చెట్టు చెట్టునుండి విత్తనము కలుగునటులే ఎరుకనుండి జగత్తు, జగత్తునుండి ఎరుక కలుగుచున్నది. గురుకృప లేనివారు ఎంత మహితులు, అనగా శాస్త్రవేత్తలైననూ తెలియజాలరు. కనుక యీ తెరువులు ధరణి మహితులెరుగరు వేమా అను పద్యములో చెప్పబడినది.

61 ప్రశ్న: గెంటి యెరుకను చిన్మింటనంట నగును! కంటికింపగు గురుశక్తి మింటజేర్చి, జంటబాసిన ఘనడెపోజానుదరయ, విమలగుణ రాజయోగేంద్ర వేమనార్యా॥

జవాబు : చిత్తాకాశము వ్యష్టి ఎరుక, చిదాకాశము సమిష్టియెరుక గురుశక్తి మహాకాశము మిన్ను అనగా ఆకాశము. చిత్తాకాశము చిదాకాశము చేర్చి ఆపైన మహాకాశమును చేర్చి చిదాకాశమహాకాశములు జంటను, ఏమీలేదని స్థిరపచుకొన్నవాడే గొప్పవాడు. పరిపూర్ణుడు అని భావము. పిండాండ దృష్టితో యీ పద్యమునకు తారకయోగానుసారమున్ను, అర్థము చెప్పవచ్చును. ఎట్లనగా హృదయాకాశమునందున్న హంసను, మొదట అజ్ఞాచక్రస్థానమునకు

ఆ పిదప సహస్రారమునకును చేర్చి, చిత్తాకాశ చిదాకాశములను వీడినవాడే ధన్యుడు, అను అర్థమును చెప్పవచ్చును.

ప్రశ్న: జ్ఞాన, మనో, బుద్ధి, చిత్తాహంకారములు అను అంతరేంద్రియములు మానవునియందు 2
యే కాలమునందు సంచరించునో తెలుపగలరు?

జవాబు : జాగ్రతవస్థయందు అంతరేంద్రియములన్నియు పనిచేయును జ్ఞానము వస్తువును గుర్తించును. అట్లు గుర్తించిన పిదప మనస్సు సంకల్పించును. ఆ సంకల్పానుసారము క్రియచేయుటయా, మానుటయా అని యోచించి బుద్ధి నిశ్చయము చేయును. ఆ వస్తువును గూర్చియే చిత్తము చింతించును శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంసస్సంగస్తే షూపజాయతే సంగాత్సంజాయతే కామః కామత్క్రోధిజాయతే॥ విషయములను గూర్చి ధ్యానించుట వలన సంగమము ఏర్పడుచున్నది. సంగమము వలన కామము (కోరిక) యేర్పడుచున్నది. ఆ పిదప ఆ కోరిక తీరుట కడ్డువచ్చిన వారి యెడలక్రోధమున్ను కలుగుచున్నది అని తాత్పర్యము. కనుక చిత్తము విషయ చింతన చేయుట వలన సంగమేర్పడును. అహంకారము అభిమానించును, అట్లభిమానించుట వలన కామము (కోరిక) ఆ పిదప ద్వేషము (క్రోధము) కలుగుచున్నవి.

స్వప్నావస్తయందు యీ అంతరేంద్రియములలో మనస్సు బుద్ధి యీ రెండు మాత్రమే వ్యవహరించుచున్నవి. ఐతే మనస్సునందు చిత్తము, బుద్ధియందు అహంకారము చేరియే యున్నవి. స్వప్నమునందు సహితం చిత్తముచే చింతించుట, అహంకారాభిమానముచే రాగద్వేషములు పొందుట జరుగుచున్నట్లు అనుభవమున్ను రుజువు చేయుచున్నది. ఒక్క జ్ఞానము, మాత్రము పనిచేయుటలేదు. లేని వస్తువు వున్నట్లు భావించటయే మనస్సుపని. కనుక జ్ఞాన క్రియలేదు అని రూఢిగా చెప్పవచ్చును.

సుషుప్తి అవస్తయందు అంతరేంద్రియ వ్యాపారమేమియూ లేదు. అన్నియు అజ్ఞానమందు మగ్నత చెంది అంతఃకరణ రూపం పొందియుండును.

ప్రశ్న: వాసనాక్షయమెట్లగును? 3

జవాబు : వాసనలెట్లు ఏర్పడునో తెలిసినచో నివారణోపాయమున్ను ద్యోతకము కాగలదు. ఒక పనిని పదే పదే చేస్తే అదియొక అలవాటుగా పరిణమించును. ఆ అలవాటు మంచిదైనా చెడ్డదైనా అది ముదిరి గట్టిపడి విడువలేనంత అభిమానము ఆపనియందు యేర్పడి తుదకది ఆ వ్యక్తి యొక్క శీలసంపత్తిలో యెక భాగమగును అదియే వాసన, లేక సంస్కారము ఫోటో అద్దముపై ఛాయాచిత్రము హత్తుకొని పోవునట్లు అంతఃకరణమునందు యీ వాసనలు హత్తుకొని మనస్సుతో పాటు వుత్తర జన్మలకు ప్రయాణము చేసి, తదనుగుణ్యమగు నూతన

కర్మకు ప్రేరకములగుచుండును. బుద్ధిః కర్మానుసారిణి అని ఆయా సంకల్పములు కలిగిబలీయమై జీవునిబానిస చేసి కర్మ చేయుచుండును. " ఇవి చిత్తమునందు ధృఢముగా వ్రేళ్ళు పాతుకొని నివాసమై యుండుటచే వానికి వాసనలు అని పేరు వచ్చినది.

మానవుని కోరికకు తగిన సంకల్పములే పుట్టును అందుకు అవసరమగు కర్మలే చేయును. ఆ ఫలమునే పొందును. కనుక కోరికయే కర్మకు ఆదికారణము వాసనలు కారణముగా కోరిక పుట్టగా పుణ్యపాప కర్మలు చేయబడుచున్నదే. ఆ కర్మఫలము లనుభవించుటకు జన్మలుకలుగుచున్నవి. ఆ విధముగా జన్మ హేతువగుటచే వాసనలు జన్మకు వుపాదాన కారణమై యున్నవి. అంతేకాకుండా సర్వవ్యవహార ప్రేరకత్వము కూడనుండుటచే యిదియే నిమిత్త కారణమున్ను అయివున్నది. ఆ విధముగా సంస్కారమే (వాసనే) సంసార కారణమైయున్నది. కనుక వాసన క్షయముకానిదే సంసారనాశనము కాదు కోరికలు కోరేది అందుకు తగిన సంకల్పములు చేసేది.

వాసనలకు స్థానమైనది మనస్సు. కనుక మనోనాశనము తోడనే వాసనలు నశించును. గాఢ సుషుప్తియందు గాని సమాధియందుకాని మనస్సు, మగ్నత చెందినదే గాని నశించుటలేదు. కనుక జాగ్రద అవస్థలోకాని వ్యుత్థానదశయందుగాని మనస్సుతోనే జాగృతములై కర్మకారణములగుచున్నవి. ఆ మనస్సుయొక్క విక్షేపమే పోయినదిగాని ఆవరణముపోకుండుటే యుందుకు కారణము. (నానా కర్మ జవాసనాన్వితమనోనాశంబు కాకున్న బ్రహ్మానందానుభవంబుకలుగనే నితాంతదుఃఖమంతు సంతాపంబు చల్లారునే అని మోక్షమందు దుఃఖనివృత్తి ఆనందావ్యాప్తి) మనోనాశనము కాకున్నచో కలుగుదని చెప్పబడినది - శుభవాసనలచే మలినవాసనలను పోద్రోలిన చాలునని కొందరందురు. కాని ఇది సరిగాదు మలిన వాసనలు దుర్గంధముతోను, సువాసనలు సుగంధముతోను పోల్చవచ్చును. దుర్గంధము సుగంధముచే తాత్కాలికముగా తగ్గిపోవచ్చును. సుగంధ దుర్గంధములు రెండు మిశ్రమమై ఏది అధికముగా నుంటే అదే పైకి తోచుచుండును. లేక ఆ మిశ్రమ గంధమేదో ఒకటి తోచుచుండునేగాని నిర్గంధం మాత్రం కాదు. అట్లే మలిన వాసన సువాసనలచే పూర్తిగా రహితము కాదు. అధవా రహితమైననూ ఈ శుభవాసన యా మలిన వాసనయొక్క స్థానమాక్రమించునేగాని నిర్వాసన మాత్రము సిద్ధించదు. శుభవాసనలు బంగారు సంకెళ్ళవంటివైనా బంధము మాత్రము తప్పదు కదా! మోక్షాపేక్ష కంటె శుభవాసన మరొకటిలేదు కదాః 'కేవలమోక్షాపేక్ష సంకల్పోబంధః అని నిరాలంబోప నిషత్తు వచనం. సంపూర్ణమగు వాసనాక్షయము కాలవెనంటె మనోనాశనము కాక తప్పదు. ఏలననగా పుట్ట యున్నంతకాలము పురుగులకు, పాములకు చోటిచ్చుచునే ఉండునట్లు మనస్సు ఉన్నంతవరకు కోరికలకు, సంకల్పములకు తావిచ్చుచునే యుండును. మనోనాశనం తత్వజ్ఞానంచే అగునని చెప్పబడినది. తత్వజ్ఞానమనగా ఆత్మసాక్షాత్కారము అనగా మనసే ఆత్మగా మారుచున్నది.

కాని మనస్సు తిరిగి దిగజారుటకు అవకాశం ఉన్నది. కనుక గురుకృపకు పాత్రుడై పూర్ణబోధ తెలిసి గురూపదిష్ట మర్గమున నడిచి ఎరుక కూకటి వేరును యెరిగి త్రవ్వివేయవలసి ఉన్నది. ఫోటో అద్దము వెనుక పూసిన రసాయనిక ద్రవ్యం తీసివేస్తే రూపుములు అంటనట్లు మన మనస్సునకు మూలకారణంగా యున్న ఎరుక, పరిపూర్ణ పరబ్రహ్మమునందు లేనేలేదని ధృడపరుచుకొన్నచో మనోనాశనము అగును. దానితో వాసనలకిక నిలువ నీడలేక నిర్వీర్యములై పోయి నశించును.

ప్రశ్న : ఓంకారమునకు ఎన్ని కలలు? అవిఏవి?

జవాబు : ఓంకారము (బ్రహ్మప్రణవము) నకు నాలుగు పాదములు. అవిద్యాపాదము, విద్యాపాదము, అనందపాదము, తురీయపాదము 'అ' కార 'ఉ'కార 'మ'కార అర్థము మాత్రలే వరుసగా యీ నాలుగు పాదములు. యిందొక్కక్కటి నాల్గు కలలు చొప్పున మొత్తము ఓంకారమునకు (బ్రహ్మ ప్రణవమునకు) పదియారు కలలు. అందులో కలలు 15. అలోక కల ఒకటి మొత్తం 16 కలలు కలయనగా ఒకటిలో 16వ భాగము. 16వ కలయగు అలోక-కలకు, పరమయని పేరు. యీ 16 కలలున్ను జ్ఞానము యొక్క మార్పులు అని గ్రహించవలెను. అనగా జ్ఞానము 16 రకములుగా యున్నదన్నమాట. ఎట్లనగా 1. జాగ్రతలో జాగ్రత : గురు సన్నిధానమున అడిగి తెలుసుకున్న సమస్తమున్ను మరపులేక జ్ఞప్తియందుంచుకొనుట. 2. జాగ్రతలో స్వప్నము : శ్రవణము చేసిన విషయములు జ్ఞాపకము ఉండి యుండక యుండుట యనగా సగం మరచి సగం మరువక యుండుట. 3. జాగ్రతలో సుషుప్తి : విన్నవిషయములు బొత్తిగా జ్ఞప్తి లేకపోవుట 4. జాగ్రతలో తురీయము : వస్తు నిశ్చయ జ్ఞానము కలిగి దానినే స్మరించుచుండుట. 5. స్వప్నంలో జాగ్రత : కలలో దోచిన సమస్తము తిరిగి చెప్పగలుగుట 6. స్వప్నంలో స్వప్నం: కలగన్న విషయములు కొన్ని మరచి కొన్ని మరవక యుండుట. 7. స్వప్నంలో సుషుప్తి : కలగన్న సమస్తము మరచిపోవుట. 8. స్వప్నంలో తురీయము : శుభ స్వప్నములను గని, అందువలన తనకేవో శుభములు గలుగుననే భ్రాంతిని పొందకుండా తన బ్రహ్మనిష్ఠయందు చలించకనే యుండుట 9.సుషుప్తిలో జాగ్రత : సుఖముగా నిద్రించి మేల్కొని ఆ నిద్రాసుఖమును గూర్చిచెప్పట.10. సుషుప్తిలో స్వప్నము : నిద్ర సుఖము తెలిసీ తెలవకుండుట 11. సుషుప్తిలో సుషుప్తి : నిద్ర సుఖమిట్టిదని తెలియకనేపోవుట 12. సుషుప్తిలో తురీయము : నిద్రయందలి సుఖము అజ్ఞానమునకు, అనగా నా కారణ శరీరమునకు విషయమేగాని ప్రత్యగాత్మయైన నాకు విషయం కాదని యెరుగుట.13. తురీయంలో జాగ్రత : బ్రహ్మనిష్టయందుండినపుడు ప్రపంచవృత్తి కలుగుట. 14. తురీయంలో స్వప్నం : ఆత్మానుసంధానం చేయుచున్నప్పుడు ప్రపంచవృత్తులు తోచి తోచకయుండుట. 15. తురీయంలో సుషుప్తి : బ్రహ్మనిష్ఠయందున్నపుడు

ఆకలి దప్పులు మొదలగునవేమీ కలుగకుండుట. 16. తురీయంలో తురీయం : నేనే సచ్చిదానంద పరబ్రహ్మస్వరూపుడనని యెరిగి తాను తానై యుండుట.

ప్రశ్న : పవలు రాతిరి తిరుగు విధమున గనుపించునయ్య, అంతలో యెచట కనుపించదయ్య" అన్నారు శ్రీకృష్ణ దేశికేంద్రులవారు పవలు రాత్రి ఎట్లు తిరుగుచున్నవి?

జవాబు : పగలు రాత్రి వెలుగునీడల వంటివి. పగలు వెలుగు , రాత్రి నీడ దేని వెలుగు దేని నీడ? సూర్యుని వెలుగే పగలు, భూమినీడే రాత్రి. ఇందు తిరుగునది యేది? సూర్యుడా? భూమా? ఈ రెంటియొక్క వెలుగునీడలా? భూగోళ శాస్త్రమును అనుసరించి సూర్యుడు తిరుగుటలేదు. భూమియే సూర్యుని చుట్టూ తిరుగుచున్నది. అట్లు ఒక ప్రదక్షిణము చేయుటకు ఒక సం॥ పట్టును. అయతే భూమి సూర్యుని చుట్టు తిరుగుట మాత్రమే గాక తన చుట్టు తాను తిరుగుచున్నది. తన చుట్టు తిరుగుచునే సూర్యుని చుట్టు తిరుగుచున్నది భూమి. తనచుట్టు తిరుగుటకు ఒక దినము లేక 24 గం॥లు పట్టును. భూమిలో ఒకే మేకు కొట్టి ఒక బొంగరమును దాని ప్రక్కనే ఒక బాలుడు త్రిప్పినపుడు ఆ బొంగరము తన చుట్టు తాను తిరుగుచునే మేకును చుట్టి వచ్చెననుకొనుడు. అదే విధముగా భూమి తన చుట్టూ తాను తిరుగుచునే సూర్యుని చుట్టు తిరుగుచుండును. సూర్యుని కాంతికిరణములు ఎప్పుడూ చూచినను భూమి సగభాగముపై పడుచునే వుండును. మిగతా సగభాగముపైన సూర్యని కాంతి కిరణములు పడకపోవుటచే అచట చీకటిగా వుండును. భూమి తిరుగుటలో వెలుగులో నున్న భాగము చీకటిలోనికి, చీకటిలోనున్న భాగము వెలుగులోనికి వచ్చుచుండును. ఒక భాగము వెలుగులోనికి వచ్చినపుడు సూర్యోదయము అగుచున్నదనియును, వెలుగులోనున్న భాగము చీకటిలోనికి పోవునపుడు సూర్యాస్తమయమగుచున్నదనియును మనమంటున్నామే కానీ సూర్యుడు దయాద్రి ఎక్కుటలేదు. అస్త్రాద్రి వెనుక గ్రుంకుటలేదు. పగలు తిరుగుటలేదు. రాత్రియూ తిరుగుటలేదు. జరుగుచున్నదేమంటే సూర్యప్రకాశము అవిచ్ఛన్నముగా అనగా తెంపులేకుండా ప్రసకాశిస్తూనే వుంటుంది. ఆ ప్రకాశములో భూమి తన చుట్టు తాను తిరుగుటలో వెలుగునీడలు పగలు, రాత్రి తిరుగుచున్నట్లు తోచుచున్నది.

నిజముగా తిరుగుచున్నది, భూమి, భూమి మీదున్న తాను, తాను భూమి స్థిరముగా నున్నవనుకొని, తనకూ భూమికీ వున్న చలనమును సూర్యునికి, సూర్యప్రకాశమునకూ వున్నదని భ్రమించుచున్నాడు. నిజముగా జరుగునది భూమిలోని ఒక విశిష్ట భాగము సూర్యునికి, అభిముఖమగుట పరాంజ్ముకమగుట మాత్రమే.

శ్రీకృష్ణదేశికేంద్రుల వారి కందార్థములలో "తోలికారు మెరపుకైవడి..." అనుదానిలో ఎరుక కలకాలమొక రీతిగ వుండదు. క్షణ క్షణ చలనశిలము కలదై మార్పు చెందుచుండును. అనుటకు దృష్టాంతముగా పగలుగాని రాత్రిగాని శాశ్వతముగా వుండవు. పగలు రాత్రిగా,

రాత్రి పగలుగా ఎట్లు మారుచుండునో అట్లే ఎరుక మరపుగా, మరుపు ఎరుకగా మార్పు చెందుచుండును అని చెప్పనుద్దేశించి 'తిలకింపపవలు రాత్రి తిరుగు విధమున గనిపించునయ్య" అని చెప్పబడింది.

ప్రశ్న : తీర్థ యాత్రల వల్ల ప్రయోజనమేమి?

జవాబు : జనసామాన్యమునందు అస్తిక్యబుద్ధి పెంపుచేయుటకై మన పూర్వులు దేవాలయములు కట్టించి, అందు దేవతా ప్రతిష్టలు గావించిరి. బాహ్యాభ్యంతర పరిశుద్ధితో దేవతారాధన గావించవలెను. గనుక ఆ దేవాలయములు నదీతీరములయందు లేదా, సుందర దృశ్యముల మధ్య పర్వాతారణ్యములయందు దేవాలయములు నిర్మించుచుండిరి. ప్రజల నాకర్షించుటకు వుత్సాహము కలిగించుటకు, కళ్యాణములు, తీర్థములు, ఉత్సవములు, నాటకాది ప్రదర్శనములు, మున్నగునవి పర్వదినములయందు అనగా ఏకాదశీ, పూర్ణిమ, అమావాస్యయందు ఏర్పాటు చేసెడివారు. ఆయా దేవాలయములు దేవతలచే నిర్మింపబడెననీ, ఆయా దేవత విగ్రహములు లేక శివలింగములు స్వయంభువులై ఆయా ప్రదేశములయందే వెలసినవగుటచే నచటనే నిర్మింపవలసివచ్చెననీ, ఆక్షేత్రమహాత్మ్యము నుగ్గడించు కథలు గ్రంథములు వ్రాసి ప్రచారము చేయుటయు జరిగించబడుచుండెను. ఆ పుణ్యక్షేత్రములలో పుణ్యకార్యములు జరిగించిన పుణ్యఫలం, ద్విగుణీకృతమగునని, ఆ గ్రంథములందు చెప్పబడుచున్నది. "రోచనార్థాఫలశ్రుతిః" అనగా రుచి పుట్టించుట కొరకే ఫలశ్రుతి నిర్ణయం అని తెలియవలెను."ఉపాసనాకానా హితార్థాయ బ్రహ్మణోరూపకల్పనా' ' అనగా వుపాసన సౌలభ్యము కొరకు నిర్గణమగు బ్రహ్మస్వరూపమునకు రూపకల్పన జరిగించబడెను. "దూరపు కొండలు నునుపు" అనే న్యాయంగా ఆయాక్షేత్ర మహత్యములు విని, చదివి భక్తులు ఆయా తీర్థములను దర్శించెడివారు,. అట్టివారేగాక ప్రకృతి సౌందర్యదర్శనమునకు, వినోద విహారములకు కొందరు శాంతి విశ్రాంతులకై కొందరు, వివిధ వృత్తుల నవలంభించి ధనార్జన చేయుటకు కొందరు ఆయాతీర్థములకు పోవుచుందురు. అవి యెంతో పుణ్యక్షేత్రములని అచట ఆధ్యాత్మిక సాధనలు చేసిన త్వరగా ఫలప్రదమగునని నమ్మి కొందరు నిజమగు సాధకులు యోగులు చేరితే కేవలం వుదరపోషణార్థము దొంగ సన్యాసులు సాధువులు చేరుచుండుటయు కలదు.

ఈ విధముగా ఆధ్యాత్మిక పురోభివృద్ధియే జీవితలక్ష్యముగా గల హైందవ దేశమున అనేక క్షేత్రములయందు అనేక దేవాలయములు నిర్మింపబడెను. భక్తితో ఆయా క్షేత్రములకేగి ఆయాదేవతల నారాధించుట వలన ప్రజలలో భక్తిభావము పెంపొందుటకు అవకాశమున్ను కలదు.

ఐతే తీర్థయాత్రలు చేసినంత మాత్రమున పాపములన్నీ పోయి పుణ్యము కలుగుననుట మాత్రం సత్యం కాదనియే చెప్పవలెను. అదే నిజమైతే ధనికులైనవారు ప్రయాణ

సౌకర్యములు విశేషంగా గల యీ కాలంలో తగు ధనము వెచ్చించి దేశములోనున్న పుణ్యక్షేత్రములన్నియు స్వల్పకాలములోనే తిరిగిరావచ్చును. అంతటితో వారి పాపములన్నియు పటాపంచలై వారికి పుణ్యము సంప్రాప్తించుననుట మోక్షార్హులైపోదురనుట మాత్రము వివేక దృష్టికి ఎంతో హాస్యాస్పదము, ఎందువల్లననగా అపుడు ధనవంతులకే మోక్షము అని చెప్పవలసి వచ్చును గదా!

కాని తీర్థయాత్రలు కేవలం నిష్ప్రయెజనములని చెప్పరాదు. వినోదం, విజ్ఞానం కలుగట మాత్రమే గాక, యింటివద్దనున్న తాపత్రయములు చాలవరకు లేకుండుటచే మానసికముగ శాంతి, విశ్రాంతులు, ఆనందము కలుగగలవు. కాని తీర్థాటన వెనుక ఆధ్యాత్మిక సాధనగా నిర్ణయించిన పెద్దల అభిప్రాయమేమి? కష్టసుఖముల హృదయమున నాటుట, భక్తిభావము పెంపొందుట మాత్రమే గాక, ఏ క్షేత్రములో నిసించు మహానుభావుని యొక్క ప్రబోధము చేతనైనా, మానవులకు నిజమగు వివేక వైరాగ్యములు కలుగగలమేమోనని అభిప్రాయముతోనే పెద్దలు తీర్థయాత్రము విధించియుండిరని చెప్పవచ్చును. అట్టి సద్గురు సందర్శనమే తీర్థయాత్రలవలన చేకూరగల ముఖ్య ప్రయోజనము.

ప్రశ్న: నిరావరణమునందు, ఆవరణము కలుగుట సాధ్యమా? లేనిచో ఆవరణమునకు మూలమేమి?

జవాబు : ఆవరణము ఆకాసము, నిరావరణము ఆచలమనుచు అనిరి మహాత్ములే" అన్నారు శ్రీకృష్ణదేశికేంద్రులవారు కనుక నిరావరణమగు పరిపూర్ణ పరబ్రహ్మమునందు, ఆవరణము కలుగుట ఎంత మాత్రము సాధ్యము కాదు. ఆవరణమునకు మూలము, ఆయావరణయందలి చైతన్యము మాత్రమే? కనుకనే శ్రీకృష్ణదేశికేంద్రులవారు "మేనెరుకల రెంటిలో, దానిని యిది, దీని నదియుదగ సృజియుంచున్" అని సెలవిచ్చినారు.

ప్రశ్న: మోక్షము బ్రతికియున్నపుడా? చచ్చిన తర్వాతనా?

జ: బందము వున్నదనీ, దాని నుండి మోక్షము పొందాలి అని అనుకొనుటయే భ్రాంతి. బంధించునది లేక సర్వబంధములకు మూలకారణమైనది ఏదియో అదియే లేనపుడు బంధము మిధ్యయగుచున్నది. బంధము మిధ్యయగుచో, మోక్షమున్ను మిధ్యయే కావలయును కనుక బంధమోక్షములు రెండు ఆ రెంటికీ కారణమగుమూల వస్తువు భ్రాంతిరూపములే, "భ్రాంతిరహితమిదం మోక్షం" అనగా యిట్టి భ్రాంతి లేకపోవుటయే నిజమగు మోక్షం.

భయభ్రాంతులు కలిగేది బ్రతికియున్న వానికే కదా. ఆ భయభ్రాంతులు తొలగిపోవలసినది కూడా బ్రతికున్నవానికే గాని చచ్చినవానికే భ్రాంతీలేదు. భ్రాంతరహితమూ

లేదు. సకల భ్రాంతులకూ మూలమైన మూలంలేని యీ గుర్తెరిగే శరీరము ఏమీలేదని గురుకృపచే బ్రతికియుండగనే ధృఢం కావాలి.

చచ్చే క్షణానికి పోకుండా నిలచియున్న భయభ్రాంతులు పాపపుణ్యసంస్కారాలు వగైరాలన్నీ అట్లే నిలిచియుంటాయి. చచ్చిన తర్వాత వచ్చేదిలేదు పొయ్యేది లేదు. కర్మభక్తి యోగాది సాధనలవల్లే చచ్చిన తరువాత, ఆముష్మిక సుఖం కలుగుతుందనీ సాలోక్యాది ముక్తులు కలుగుతాయి అనీ, అనుటకు విశ్వాసాలే మూలములు వేదాంతమునందు మాత్రము విశ్వాసాలకు తావులేదు. ఏ విషయం గ్రుడ్డిగా నమ్మవలసి వచ్చినా, అది వేదాంతమే కాదు. భ్రాంతి రహితం అనే సద్యోఫలితమే కలుగని నాడు వేదాంతం నిజంగా అనవసరమే. అన్నంతింటే ఆకలి, నీరు త్రాగితే దప్పిక అప్పటికప్పుడే పోయినట్లుగానే భ్రాంతి రహితరూపమగు మోక్షము లేక ముక్తి సద్యోకాలముననే కలుగవలెను కనుకనే ॥ అశరీరం సర్వదా అస్తి శరీరం రహితం సదా అయమేవ సద్యో ముక్తి దన్యదా భ్రమకారణం" అని చెప్పబడినది.

ప్రశ్న: ఉత్తబట్టబయటకు జ్ఞానమున్ను, కర్మమున్ను, లేనట్లు పరిపూర్ణునకు పుణ్యాపాపములు, మరుజన్మ ఉండదుకదా? 9

జవాబు : పరిపూర్ణుడు అనగా ఎవరు? గురువువల్ల ఉపదేశముగాని పరిపూర్ణ ప్రబోధనుగాని విన్న ప్రతివాడు పరిపూర్ణుడనరాదు. ఆ ప్రబోధ పూర్తిగా ఆరూఢమై మనోవాక్శరీరముల యందు సహజప్రవృత్తి చేత, కర్తృత్వరహితుడై, అశరీరత్వము సంపాదించినవాడే పరిపూర్ణుడు. అట్టి వానికి పాపపుణ్యములు అంటని మాట యదార్థమే. కాని పరిపూర్ణ బోధ తెలిసిన వారందరికి పాపపుణ్యములంటవని ఎంతమాత్రము, దురభిప్రాయపడరాదు. ఆ విధముగా కొందరు దురభిప్రాయపడి యధేచ్ఛా విహారము చేయుచూ యిహపరముల రెంటికి చెడి తాము చెడినదేగాక తమ్మాశ్రయించిన వారిని గూడ చెరచుచు యీ పవిత్ర సిద్ధాంతమునకు అపకీర్తి అప్రతిష్ట తెచ్చినవారు అగుచున్నారు. అది చాల శోచనీయమగు విషయము. 70

ప్రశ్న: శాపాదులుగాని, మంత్రతంత్రప్రయోగాదులు గాని భూత ప్రేత పిశాచాదులుగాని పరిపూర్ణులను బాధించునా? బాధించుచున్నచో వారు ఎరుకలోని వారా?

జవాబు: పై ప్రశ్నకు ఇవ్వబడిన జవాబులో పరిపూర్ణులనగా ఎట్టివారో వివరించబడినది. అట్టివారిని ఏమియు బాధింపవనియే చెప్పవచ్చును. స్థూలశరీరముపై ఎట్టి మార్పులు ఏర్పడినను అది ప్రారబ్ధశరీరము గనుక అది ప్రారబ్ధరూపమే అని చెప్పవలెను. పరిపూర్ణ పరబ్రహ్మమునందు ఎరుకరూపమగు అంతఃకరణగాని, అంతఃకరణపరిణామమగు మనస్సుగాని లేనేలేదని అరూఢపరుచకొన్నవారగుటచే సుఖదుఃఖాదులను అనుభవించు మనస్సు వారికి నిజముగా లేనేలేదు. అట్టివారి విషయములో మంత్ర తంత్ర ప్రయోగాదులు

ఏమియు చేయజాలవు. ఏలననగా మనస్సు దుర్బలమై ఉన్నవారిపైన మనోశక్తులు సాధించిన వారియొక్క సంకల్పబలము ఆచ్ఛాదించి స్వాధీనపర్చుకొని దుష్టఫలితాలు కలిగించుటకు హేతువు కావచ్చు. కాని పరిపూర్ణ పరబ్రహ్మమందు ఎరుకే లేదని నిశ్చయించుకొన్న ధృఢచిత్తులను ఏమియు చేయజాలవు. బాధించునని చెప్పెడివారు ఏ భావముతో అట్లు చెప్పిరో గమనించవలెనుగాని వారు ఎరుకలో వారని నిరశించరాదు.

ప్రశ్న : ఆశ (భ్రాంతి) లేనివాడు కావలెనని అందురు. అవి తనకు వేరుగా నున్నదా? తానే అయివున్నదా?

జవాబు : ఆశ అనేది అనేక దుర్గుణములలో ఒకటి గుణము వేరు (గుణి) అనగా గుణములు గల వస్తువు లేక వ్యక్తి వేరు అని తెలుసుకొన వలయును. ఆ విధముగా గుణి (అనగా గుణములు కలవాడు) గుణము కన్న (భాషాపరిజ్ఞానముచే) వేరనియె చెప్పవలసి యుండును కాని గుణి గుణసంబంధము వేదాంత పరిభాషలో అవినాభావ సంబంధము కలది. ఎట్లనగా బెల్లము వస్తువు, దాని గుణము తీపి. కాని బెల్లమును విడిచి తీపిగాని తీపిని విడిచి బెల్లము గాని ఉండజాలవు కదా. తీపిపోవలెనన్న బెల్లము పోవలసినదే, అట్లే ఆశ పోవలెనన్న ఆశించే ఎరుక పోతేనేకాని ఆశ పోనేపోదని ఏపరిపూర్ణుల భావము. ఏలనననగా సకల భ్రాంతులకు మూలము మూలంలేని ఈ గుర్తురిగే శరీరము.

ప్రశ్న : సద్గురువులచే రచింపబడిన గ్రంధములు శోధన చేసి తెలిసి కొనుట ముఖ్యము? లేక సద్గురువులే అవసరమా?

జావాబు : సద్గురు సన్నిధానమున వుంటే గ్రంధముతో పనిలేదు. గ్రంధము వివరించకుండా వుంటే విషయములకు శంకలకు కూడా సద్గురువు వల్ల సమాధానం పొందవచ్చును. గురువు సన్నిధానమందు లేనప్పుడు మాత్రమే గ్రంధము యొక్క అవసరము మనసిచ్చి గురువాక్యమును వినలేనివారు విన్నను కనలేనివారు గ్రంధస్థమైన గురువాక్యములను చూచుకొని పదేపదే మనన విధివిన్యాసాలు చేయుటకు గ్రంధముకూడా అవసరమేయగును. శ్రీ శివరామదీక్షితుల వారు భాగవతుల శ్రీ కృష్ణదేశిక ప్రభువు మొ॥గు మహామహులు నేడు స్వయముగా మనకు భోధించలేరు కదా యీ దృష్టితో మాత్రమే గ్రంధములు కూడా ముఖ్యములే అని చెప్పవలయును. అయితే రెండిలోను ఏది గొప్పది? అంటే గురువే అని నా సమాధానము ఏలననా "యస్య సన్నిధి మాత్రేణ చిదానందాయతేమనః" అని గురు గీతా ప్రవచనము.

ప్రశ్న : సాంప్రదాయకము ఆదినుంచి శ్రీ మహావిష్ణువును తీసుకొన్నారు. కాని ఆ మహావిష్ణువే దశావతారములు దాల్చినట్టు పురాణములు చెప్పుచున్నవి. ఆ విధంగా చెప్పినపుడు ఆ మహావిష్ణువునకే జన్మరహితం లేనేలేదని తెలుచున్నది. దీనికి తమ సమాధానమేమి?

జవాబు : గురు పరంపరలో "శ్రీ బ్రహ్మ విద్యా గురు, విష్ణు, సూర్యం, శ్రీ యాజ్ఞవల్క్యం, జనకం శుకంచ, సాందీపమీశం, కృష్ణంచ, అర్జునం వందే గురూన్మే గురుపాదుకాంతం " అని చెప్పబడిన దానిలో యాజ్ఞవల్క్య మొదలు తరువాత వారలే మానవులు మొదట చెప్పబడిన (1) బ్రహ్మవిద్యాగురు (2) విష్ణు (3) సూర్యులు ముగ్గురూ మానవాతీతులైన దేవాతా సంబంధీకులా? లేక అసలు వ్యక్తులే కాదా? లేకుంటే వారెవరు? విచారిస్తేగాని యీ ప్రశ్నకు జవాబు గ్రాహ్యము కాదు.

1. బ్రహ్మవిద్యాగురు : బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" బ్రహ్మమును తెలిసిన వాడు, బ్రహ్మమే అగును అని దీని భావము. కనుక మొదటి గురువు బ్రహ్మమే. అనగా గురుతత్వమే గురువుగా చెప్పబడెను గాని, బ్రహ్మ విద్యాగురువు ఒక వ్యక్తియే గాడని గుర్తించ వలెను.

2. విష్ణువు : శంఖు,చక్ర, గదా పద్మములు చతుర్భాహుల యందు ధరించి వైకుంఠము అని చెప్పబడే లోకపాలకుడా? లేక "సర్వ వ్యాపకో విష్ణుః" అన్నట్లు అకాశము వలె సర్వత్ర వ్యాపించిన వస్తువా? బ్రహ్మవిద్యాగురు అని చెప్పబడిన గురుతత్వమే (పరమాత్మయే) వ్యాపకతా ధర్మముచే విష్ణువని రెండవ పేరు వహించెను.

3. సూర్యుడు : అనగా (1) నవ గ్రహములలో ఉత్కృష్ట ప్రకాశము గల్గియున్న సూర్యగోళకమా? (2) లేక సూర్యమండల మందున్నాడని, చెప్పబడే ఆదిత్యుడను పురుషుడా? (3) లేక సర్వమును ప్రకాశింపచేయగల స్వయం ప్రకాశ తత్వమా? విజ్ఞానశాస్త్రరీత్యా సూర్యబింబ రూపంగా మనకు గాన వచ్చేది, భగ భగమండే ప్రాణవాయువు యొక్క అగ్ని జ్వాలలు కనుక సూర్యుడనగా ప్రాణము, అగ్నియూ రెండూ కలిసిన వస్తువు అని చెప్పాలి. కనుక దానిని గురువుగా చెప్పుటకు మీలులేదు. అట్లే దాని యందొక పురుషుడున్నాడని ఆ వ్యక్తియే గురువని చెప్పటయు సరిగాదు. స్వయంప్రకాశత్వ లక్షణములే గైకొని దానినొక వ్యక్తిగా అలంకారికముగా కవిత్వధోరణిలో చెప్పినారన్నమాట. ఏలననగా సూర్యుడు తేజోనిధి పరబ్రహ్మ నిధి. ప్రకాశము అనగా జ్ఞానము అని గుర్తించ వలెను. యిప్పుడాది గురువగు పరబ్రహ్మతత్వము మొదటి గురువునే దాని వ్యాపకతా ధర్మముచే విష్ణువని, అదియే కొనియాడబడిన దనిన్ని దాని స్వయంప్రకాశత్వలక్షణముచే ఆ గురుతత్వమే సూర్యుడుగా అభివర్ణింపబడినదని తెలియవలెను.

"ఉపాసకానాం హితార్థాయ బ్రాహ్మణోర్యరూపకల్పనా" అనగా ఉపాసకుల హితమును గోరి వారు సులభంగా గ్రాహ్యం చేసుకొని ఉపాసన చేయుటకు వీలుగా నుండులాగున బ్రహ్మమునకు రూపకల్పన చేయబడినదట. మొదట్లో ఏమియు తెలియరానిదిగా నున్న గురుతత్వం రెండవ స్థానమున వ్యాపక ధర్మముచే సర్వత్రనున్నట్లు గోచరమై, పిదప మూడవ స్థానమున అది అఖండ జ్ఞాన స్వరూపమగు స్వయం ప్రకాశకత్వముగల వస్తువు అని, క్రమశః స్థూల దృక్పథము సాధకుడుకు చెప్పబడినదని గ్రహించవలెను. క్రమశః ఆ మొదటి

గురుస్వరూపమే స్థూలాతిస్థూలముగా పరిణామము చెంది నామరూపములు వహించి నేటి నాగురువు రూపములో నాకు ప్రత్యక్షముగా నున్నది. కనుకనే "మన్నాథ శ్రీ జగన్నాథో,మద్గురు శ్రీ జగద్గురు ! స్వాత్మైవ సర్వభూతత్మ తస్మై శ్రీ గురువేనమః అని గురుగీత అభివర్ణించింది.

ఈదృష్టితో యోచిస్తే, వైకుంఠ నాథుడుగు, విష్ణువు దశావతారములు దాల్చిన వాడు ఆది గురువు కాదనియే చెప్పవలెను. అపుడూ విష్ణువు జన్మరాహిత్యము బొందక దశావతారములెందు కెత్తినాడూ? అను ప్రశ్నకు తావే లేదు.

4 ప్రశ్న : "అపుత్రస్య గతిర్నాస్తి" అంటారు. ఎంత వరకు సత్యము?

జవాబు అపుత్రస్య గతిర్నాస్తి అనగా పుత్రులు లేనివానికి గతులు లేవు అని అర్థము. గతి అనగా నడక, యాత్ర, ప్రయాణము అని అర్థములు. జీవితములో యజ్ఞయాగాది పుణ్యకర్మలు చేసినవాడు పితృయానము అను మార్గములో నడిచి చంద్రమండలము చేరుననీ, నివృత్తి మార్గములో కృషిచేసివాడు దేవయానము అను మార్గములో సూర్యమండలము దాటి బ్రహ్మలోకము చేరునని శాస్త్రములు చెప్పుచున్నవి. పుత్రడు యీ ప్రయాణములో చనిపోయిన తండ్రికి యెట్లు సహాయకారిగా వచ్చును. అని విచారించవలెను. తండ్రికి కర్మకాండలలో పిండప్రదానములు, తర్పణములు మొదలగు శ్రాద్ధకర్మలు చేసినచో తండ్రికి ఆ ప్రయాణంలో ఆకలిదప్పులు నివారణ చేయును అనీ, శ్రద్ధాది కర్మకాండవల్ల పితృదేవతల నారాధించి, వారి ఆశీర్వచనము అందునని నమ్మకముతో పుత్రుడు తల్లిదండ్రులకు శ్రద్ధాది కర్మలు పిండప్రదానాలు, తిలతర్పణములు చేయును.

గతియనగా ఒక ప్రదేశమునుండి వేరొక ప్రదేశమునకు నడక. గనుక ఊర్ధ్వగతి, అధోగతి, మధ్యగతి యని మూడింటిగా విభజించవచ్చును. పుణ్యకార్యములు చేసినవాడు ఊర్ధ్వలోకములు (పుణ్యలోకములు) పొందుట ఊర్ధ్వగతి, పితృమాన, దేవయానమార్గంలో పూర్ధ్వలోకములను చెందును. అచట పుణ్యఫలములగు సౌఖ్యము అనుభవించిన పిదప "క్షీణేపుణ్యం మార్త్యలోకం విశంతి" అని చెప్పబడ్డ విధంగా తిరిగి మధ్యలోకం (భూలోకంలో) జన్మించును. పాపపుణ్యములు చేసినవాడు అధోగతిలో అధోలోకములలో జన్మించును. పుణ్యపాపమిశ్రమ కర్మలు రెండూ చేసినవాడు భూలోకములో జన్మించును. ఇదే మద్యగతి.

పాపకార్యముల చేసివాడు ఆపాపఫలములను, అనుభవించితీరవలసినదే. అది తప్పించుటకు ఏ దేవునికి సాధ్యపడదు. ఇక పుత్రుడు తప్పించగలవాగడా, ఎంత మాత్రం తప్పించలేడు. అట్టి పాపిష్టి తండ్రికి కుమారుడుత్తమగతులను ఆసలే కలిగించలేడు. పుణ్యాత్ముడైన తండ్రి తనపుణ్యబలముచేతనే వుత్తమలోకములు చెందునుగాని కుమారుడు సహాయము చేసినగాని వుత్తమలోకములు పొందజాలడనుట ఎంతమాత్రము సమంజసము కాదు.

వాదనార్థము తండ్రికి వుత్తమగతిని పొందుటలో కుమారుని సహాయ మవసరమే. అని భావించిన జన్మరాహిత్యమగు మోక్షము ఒక స్థానము కానేకాదు. అస్థానమునకు నడిచిపోవుట అనేది లేదు. కనుక అది గతియనుటకు వీలు లేదు. కర్మవలన జన్మకనుక కర్మనాశనమే జన్మనాశనము. ఆగామీ సంచిత ప్రారబ్ధములు లేకపోతే జన్మరాహిత్యము. ఆ కర్మఫలములు  జీవించి వుండగానే తగిన కృషి చేసి మానవుడు మరణించెనేని అతడిక తిరిగి పుట్టడు. తిరిగి పుట్టకుండా పోవలెనన్న జీవుడు ఏ స్థానమునకును పోనవసరంలేదు. తిరిగి పుట్టినవాడే మరొక స్థానమునకు పోవలెను. కనుక మోక్షము గోరువానికి గతులలో నిమిత్తములేదు. అతనికి పుత్రులున్నా లేకున్నా ఏమీబాధలేదు. కనుక సంతానము లేదని ఎంతమాత్రము చింతింపనవసరము లేదు.

ప్రశ్న : నేను అంటేఎవరు? నేను అనుదానికి శరీరం కలుగుటకు కారణమేమి?

జవాబు : ప్రాణ మనస్సుల చేరికలలోనే అన్ని వృత్తులు కలుగుచున్నవి. అహంవృత్తి (నేను అనేవృత్తి) కూడా ఒక వృత్తియే. అంటే నేను అనేది ఒక విధమైయిన సంకల్పము. ఈ నేను అనే శబ్దముచే ఏ వస్తువు సూచింపబడునో అది ఆ మాట  సందర్భమునుబట్టి మారుచుండును. ఉదాహరణకు నేను బ్రతికి యున్నాను'' నల్లగాయున్నాను అన్నప్పుడు 'నేను' అనగా నాస్థూలము నేను దుఃఖములో నున్నపుడు ''నేను'' అంటే సూక్ష్మ శరీరము నేను అజ్ఞానిని అన్నప్పుడు ''నేను'' అంటే కారణశరీరము  ''నేను'' ప్రకాశ స్వరూపడును నా ప్రకాశమువల్లనే దేహేంద్రియములు సకల వ్యవహారములు చేయుచున్నది. అన్నప్పుడు నేనంటే ప్రత్యగాత్మ సృష్టికంతకు ''నేనే''మూలకారణమన్నపుడు ''నేను'' పరమాత్మను, యీ విధంగా నేను యొక్క వస్తురూపము మారుచున్నది.

సృష్టిలో ప్రతివస్తువునకు స్థూలము, సూక్ష్మము. అను రెండు లక్షణములు. ఉదాహరణకు - బెల్లమను బెల్లపుగడ్డ స్థూలము, దాని యందలి తీపి, సూక్ష్మమై యున్నది. స్థూల సూక్ష్మములు రెండు ఒకేసారి వుత్పత్తి వృద్ధిక్షయములు పొందును. సూక్ష్మము ముందుపుట్టి తరువాత స్థూలము పుట్టుటగాని, ముందు స్థూలము పుట్టి తరువాత సూక్ష్మముపుట్టుటగాని జరగదు. మీ ప్రశ్నలో సూక్ష్మములగు నేను ముందు పుట్టినదనిన్ని తరువాత దాని స్థూలమగు శరీరం పుట్టినదనిన్ని మీరు భావించునట్లు కనబడుచున్నది. అది సరికాదు. పురుష ప్రకృతులు నేను మేనులు ఒకేసారి కలుగుచున్నవో అట్లే సమస్త పదార్థముల యందు కూడా స్థూలసూక్ష్మములు ఒకేసారి కలుగుచున్నవి. నేను శరీరం కలుగుటకు కారణమేమిటి? అని మీరడుగుచున్నారు? నేనుకు  మేను కలుగలేదు. నేను మేనులు రెండు ఒకమారే కలిగినవి. కనుక నేను కలుగుటకు కారణమేదో మేను కలుగుటకు కూడా అదియే కారణము అని చెప్పితే సరిపోతుంది. సృష్టి యెందుకైనది అను ప్రశ్న యెంతో, యిదీ అంతే. సృష్టికర్త భోగార్థం నేను తోపాటే శరీరం కలిగినది అని చెప్పవచ్చు.

౬ ప్రశ్న : గురు స్వరూపము అనగా నేమో సంపూర్ణముగా వివరించగోర్తాను?

జవాబు : గురుస్వరూపమమని గొప్ప స్వరూపమని శబ్దార్థము. ఇది అణోరణీయాన్ మహాలో మహీయాన్'' అని వర్ణింపబడి మహత్తు కంటెనూ పెద్దదైన బ్రహ్మస్వరూపమేగాని తనకు మంత్రోపదేశము చేసిన మానవవ్యక్తి మాత్రమే కాదు. ఆ బ్రహ్మమే తనకు తరుణోపాయము వుపదేశించుటకు మానవాకృతిలో యిట్లు అవతరించినాడని భక్తి ప్రపత్తులతో శిష్యుడు గురువును పూజించుట మిక్కిలి అవసరము. సాక్షాత్ బ్రహ్మస్వరూపమైన గురుస్వరూపమే బ్రహ్మ, విష్ణు, మహేశ్వర రూపములు వహించినది. తనకు మంత్రోపదేశము చేసిన మానవుని కేవల బ్రహ్మస్వరూపునిగానే భావించుటెందుకు? తనకుపదేశమిచ్చిన గురువు బ్రహ్మమును తెలుసుకున్నవాడా? కాడా? ''బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి'' అంటే బ్రహ్మము తెలుసుకున్నవాడు బ్రహ్మమే యగుచున్నాడని అర్థము ఏ వస్తువుని మనం గుర్తించినా అపుడు మనస్సు ఆ వస్తురూపమును చెందినదన్నమాట. మనస్సు బ్రహ్మమైనపుడే బ్రహ్మసాక్షాత్కారము పొందినాడన్నమాట. కనుక గురువును బ్రహ్మమును ఆ విధముగా తెలుసుకున్నవాడు గనుకనే అతడు సాక్షాత్తు బ్రహ్మస్వరూపుడైనాడు. అట్టి గురువునే వుపాసించవలెను అని నిరాలంబోపనిషత్తు చెప్పుచున్నది. ''సర్వశరీరస్త చైతన్య బ్రహ్మప్రాపకోగురురుపాస్త్యః'' అని అంటుంది.

ఎందుకీ ఉపాసన చేయవలెను? (1) గురుకృప కలుగుట(2) గురుడు నరుడనే భావనరహితమై గురుడు పరుడేయను భావన ధృఢమగుటకు గురూపాసన కావలెను లేనిచో గురువాక్యమునందు విశ్వాసము, ధృఢత్వం కలుగజాలదు.

పరమాత్మ స్వరూపుడైన గురుస్వరూపమునందే చతుర్థశ భువనాలు బ్రహ్మాండ భాండములు, త్రిమూర్తులు, ముక్కోటి దేవతలు వుండియున్నారు. గురువును పూజించినచో పరమాత్మ స్వరూపమును పూజించినట్లేగాక, దేవతలందరినీ పూజించినట్లే యగును. కాని అందే దైవము నుపాసించిననూ గురూపాసన చేసినట్లుగాదు.

గురుస్వరూపమనగా పరిపూర్ణ పరబ్రహ్మమేనని కొందరభిప్రాయపడుచున్నారు గాని అది సరిగాదు. గురుస్వరూపమనగా పరమాత్మ స్వరూపము తనయొక్క స్వస్వరూపము, సర్వస్వరూపము, అన్నియు అగునేగాని పరిపూర్ణ పరబ్రహ్మ మాత్రం కాదు. పరిపూర్ణము గురుస్వరూపముగా మారలేదు. బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపము అవలేదు. తనే గురువుగా ఈ లోకమున అవతరించనూ లేదు. పరిపూర్ణ పరబ్రహ్మము దేనిక్రిందా మారలేదు. ఏ వస్తువు లేక ఏ వ్యక్తి పరిపూర్ణ బ్రహ్మము కాజాలదు. పరిపూర్ణ బోధ ధృఢమైతే గురుశిష్యోభయ రహితమగునంటారు గదా. రహితమైపోయే గురుస్వరూపమును పరిపూర్ణమనదగునా? శిష్యుని కలలో గురుమూర్తి వచ్చి శిష్యుని కలలోపలి బాధలను భయభ్రాంతులను పోగొట్టగా శిష్యుని కలతో పాటు గురువుకూడా లేకుండా పోవునని కందార్థములో చెప్పబడుచున్నది. ఎరుకను

కలలోపల నేనరుదెంచితి మీరలట్లు యరుదెంచితిరీ యెరుక జననేను మీరలు, యెరుకతో జనునారమనుచు నెరిగేటి కొరకు....ఎరుకతో వచ్చి యెరుకతో పోయే గురువు పరిపూర్ణమగునా? గురుడు గురుబోధ కెరిగించేటి వేళ శిష్యుడెరిగేటి వేళన్, యిరువువైశ్వానర్ కర్పూరమువలె వెలిగియవల పోడజూపరోయీ..." అను కందార్థము ప్రకారం గురువు చివరకు పోయేవాడు గదా? అట్లు పోయే గురువు పరిపూర్ణమన జెల్లునా? మరియును "యెరుక నెరుంగని బయలులో గురుడను శిష్యుండు వారి గొడవయు నేమీ కెరిగించి వన్నియును మీరలెరిగినవన్నియును మీరునేనవుళ్ళుక్కి....' అంటూంటే వుళ్ళుక్కి అయిన గురుడు పరిపూర్ణమేనని అనజెల్లునా? గురువు అఖండ యెరుక స్వరూపడగునేగాని పరిపూర్ణమెన్నడు కాడు అని తెలియవలెను.

ప్రశ్న: "యెరుకకూకడు వేరునెరిగి త్రవ్వితెచాలు" అన్నారు శ్రీకృష్ణదేశికేంద్రులవారు. దీక్షితీయంలో "ఎరుకఫలానదాని వలన వచ్చింది అని గుర్తులేదు. యెరుక శూన్యము అన్నారు. ఎక్కడనయ్యా యెరిగి త్రవ్వేది? 7

జవాబు : ఎరుక బయలందు లేమిని, ఎరుకను శూన్యంబటంచు యెరిగించబడెన్" అని శ్రీకృష్ణదేశికులున్నూ అన్నారు. అయితే పరిపూర్ణ పరబ్రహ్మమునందు ఎరుక శూన్యమన్నారుగాని ఎరుకయందు ఎరుక శూన్యమని అనలేదు కదా! "విత్తే చెట్టై పుట్టును విత్తే, విత్తనము రీతి వెలయును ధరపై, విత్తుకు చెట్టుకు వేరే విత్తన, మొకటున్నదనిన వినగూడదోయీ, తనకు తాబుట్టును వినవోయీ" అన్నారు. ఒక విత్తే, విత్తుగాను చెట్టుగానూ యున్నట్లే ఎరుకే, ఎరుక జగములుగా వున్నది. విత్తువలన చెట్టు, చెట్టువలన విత్తు వచ్చినట్టుగానే ఎరుకవలన జగము జగము వలన యెరుక వచ్చుచున్నవి. ఉన్న పరిపూర్ణము దానియందెన్నడు లేని యెరుకకు ఏ విధంగానూ మూలము కాదు. ఐతే యిక యెరుక కూకడ వేరుఏది? "పిండబ్రహ్మాండంబులు" అన్న కందార్థం గురుముఖతః వస్తు నిశ్చయపూర్వకంగా విచారిస్తే అఖండంబగు యెరుకరూపునగాన వస్తుంది. అదియే ఎరుక కూకడ వేరు. దాని యందలి భ్రాంతియే రహితం కావలసియున్నది. కనుక అట్టి కూకడు వేరును ఎరిగి పరిపూర్ణ పరబ్రహ్మమునందు దీనికి మూలముగాని స్థానముగాని లేదనితెలుసుకొని భ్రాంతిరహితం పొందుటే కూకుడు వేరును త్రవ్వి వేయుట.

ప్రశ్న: బాలోన్మత్త పిశాచవత్" అను దృష్టాంతమెందుల కీయబడినది? 8

జవాబు : 1. బాలుడు : పరిపూర్ణ భావమారూఢుడైనవానిని బాలునితో ఎందుకు పోల్చినాడు? కామినీ కాంచనములయందు బాలుని దృష్టియు పూర్ణబోధ అరూఢమైనవాని దృష్టియు సమానములు. ప్రాపంచీకుల దృష్టియిందుకు భిన్నముగా యుండును. ఎట్లనగా ప్రాపంచీకుల దృష్టిలో ధనమూల మిదం జగత్ అని ధనమే సర్వస్వగా నెంచి ధనము కొరకై ఎన్ని శ్రమలైనపడి ధన సంపాదన చేతురు. ధనము లభించిన పొంగిపోదురు. లేకున్న క్రుంగిపోదురు. అట్లే

స్త్రీవ్యామోహముచే మరికొందరు బద్ధులై స్త్రీకొరకు యెట్టిత్యాగమైన చేతురు. ఇక బాలుడనగా పసివాడు. పసివానికి స్త్రీవ్యామోహమున్ను వుండజాలదుకదా ఒక ధనవ్యామోహమును ఉండదు. ఎట్లనగా తల్లిదండ్రులు తనయందలి గారాబముచే ఎంతటి విలువగల నవరత్న స్థగిత సువర్ణాభరణములుంచిననూ సంతోషముతో పొంగిపోడు. దొంగవచ్చి అట్టి వస్తువులు ఒలుచుకుని పోయిననూ దుఃఖింపడు కనుక ఆరూఢునికి కూడా కాంతా కనకములయందట్టి తటస్థ భావమే యుండుగాని యెట్టి భ్రాంతిన్ని యుండదు. అతడా విషయములో బాలునితో పోల్చబడినాడు. 2) ఉన్మత్తుడు : అనగా పిచ్చివాడు ప్రాపంచీకులు ఆరూఢుని జూచి అతని పల్కులు విని, అతనిని పిచ్చివానిగా భావింతురు ఏలననగా అతడిచ్చు సమాధానములు తమ ప్రశ్నలకు సదుత్తరములుగా కానుపించవు. ఎట్లనగా ఒక కసాయివాడొక గోవు కొరకై వెదుకుచు వచ్చి యొక ఋషీశ్వరుని ఆ గోవు ఏట్లుపోయినదని అడుగగా "చూచేకన్ను చెప్పలేదు చేప్పేనోరు చూడలేదు" అని సమాధానము చెప్పగా యితడు పిచ్చివాడని యెంచి కసాయివాడు వెడలిపోయెను. అతని మాటలు వీనికి పిచ్చివాని మాటలుగా గానుపించెను. విమర్శించువారికి ఈ ఋషి మాటలు వింతగా నుండును. ఏలననగా కంటి ద్వారా చూచేది నోటిద్వారా మాట్లాడేది ఒకే మనస్సు కనుక ఋషి చెప్పుట కిష్టము లేక యుక్తిగా తప్పించుకొన్నట్లు భావింతురు. కానీ యదార్థస్థితి ఏమనగా చూచేది అనేది వినేది అన్నీ మనస్సే. కాని ఆ మనస్సు గురువాజ్ఞమీరక పరిపూర్ణ పద్ధతిగా నుండును. కనుక ప్రాపంచీకులు సరిగా ప్రత్యుత్తరము లిచ్చుటకు వారు ప్రయత్నింపరు. వారికా నిర్ణయములన్ను యుండవు. వీరు నా వారు వీరు పైవారు అను నిర్ణయమున్ను వుండదు. కనుక ప్రాపంచీకుల దృష్టికి వాడు పిచ్చివాడుగా తోచును.

3)పిశాచం: పిశాచమావహించిన వాని అంతఃకరణమునందు వానియొక్క వ్యక్తిత్వలక్షణము లేవిన్ని యుండవు. పిశాచము యొక్కవ్యక్తిత్వమే ఆరోపితమై వుండును. కనుకవాడు పిశాచము యొక్క నిర్ణయానుసారమే కర్మేంద్రియ వ్యాపారము చేయును. ఉదాహరణకు "పురుష పిశాచమావహించిన స్త్రీ, పురుషునివలెనే హావభావ ప్రకటన గావించును అట్లే అంతఃకరణమునందు పరిపూర్ణస్తితి చేకూరిన పురుషుడు ఆ పరిపూర్ణస్థితి నిర్ణయానుసారము కర్మేంద్రియ వ్యాపారము జరిగించును గాని తన కర్తవ్యముండదు. పరిపూర్ణుని కర్తృత్వరహిత కర్మాచరణ విధానమునకే దృష్టాంతమివ్వబడినదేగాని పరిపూర్ణుడు పిశాచచేష్టలు చేయుననుటకే దృష్టాంతమీయబడలేదు. అట్లే పరిపూర్ణుడు పిచ్చివానివలె గుడ్డలు చింపుకొంటాడు. దిగంబరుడై యుంటాడు అని గాని చంటిపిల్లవానివలె మలమూత్రములలో పొర్లుతాడు అనిగాని అర్థం చెప్పరాదు.

ప్రశ్న: జీవుడు శుక్లముతో తల్లి గర్భమున ప్రవేశించునా? లేక ఘటనిర్మాణమైన తర్వాతనా?

జవాబు : తండ్రి తిన్న అన్నమునుండి శుక్లముత్పత్తై వర్షబిందువు ద్వారా సస్యములోని ఒకానొక

గింజలో ప్రవేశించిన జీవుడు ఆ గింజ అన్నరూపకంలో భక్షించిన పురుషుని (తండ్రి) శరీరములో మూడు మాసములకు ఆ పురుషుని శుక్లమునందుండి తల్లి గర్భమునందు పడును. నాడే జీవుడు ప్రవేశించినాడని చెప్పవలెను. పిండము క్రమముగా యెదిగి వృద్ధి చెందుట ఆ జీవ లక్షణమే కాని అన్యంకాదు అయినను చేతన చలనములు మాత్రము తదనంతరము అనగా 7వ నెలలోగాని ప్రకటముగావు, శిశువునందలి గుండె స్పందించుట కారంభించుటయు, పిండము కొంచెమెదిగిన తర్వాతనే.

ప్రశ్న : జీవమెన్నడు నాశనమొందదు అని గీత, ఎరుక పుట్టనేలేదు అని దీక్షితులవారు. వీనికి సమన్వయమెట్లు? 80

జవాబు : జీవాత్మ పరమాత్మలు రెండూ వస్తుతః ఒకటే కాని జీవుని వ్యష్టికర్మచే వుపాధివసుడై, పరమాత్మస్థానమందే ఒక వుపాధినుంచి మరొక వుపాధికి పోవుచున్నాడు గానీ నాశనము లేదు కర్మరహితమైతే పరమాత్మగా వుంటున్నాము. ఎరుక పుట్టనేలేదంటే పరిపూర్ణ పరబ్రహ్మము యందు ఎరుక పుట్టలేదు. అని అర్థము ఏ పరమాత్మ వుపాధులను గ్రహిస్తున్నదో ఆ పరమాత్మకు పరిపూర్ణ పరబ్రహ్మమందు మూలముగాని కొనకు ప్రవేశించుటకు స్థానముగాని లేదు.

ప్రశ్న : పౌర్ణమి నాటి గురుపూజ యొక్క విశేషమేమి? రాత్రిపూజయెందుకు? 81

జవాబు: పౌర్ణమినాడు చంద్రుడుషోడశ కళాప్రపూర్ణుడై యుండును. అనగా 16 కళలతోను సంపూర్ణముగా నుండును.

శ్లో॥ అమృతా, మానదా, పూషా, తుష్టి, పుష్టి
రతి, ధృతిః, శశనీ, చంద్రికా,కాంతి,
ర్జ్యోత్స్నా ప్రీతి, రంగదా, పూర్ణా, పూర్ణామృత,
కామ, దాయిస్యః స్స్వరజాః కలాః

యిందు చెప్పినవన్నియు మనస్సునకాహ్లాదమును, బలమును, వుత్సాహమును ధైర్య,స్థైర్యములను కలిగించునవియే. చంద్రుడు మనస్సునకధిష్ఠా దేవతయగుట అతని అనుగ్రహవిశేషముచే యివన్నియు మానవునికి లభించును. పూర్ణిమనాడు మన భూమి సూర్య చంద్రులకు మధ్యగానుండును. మూడును ఒకే సరళరేఖపై నున్నట్లుండును. కనుక ఆ దినమున భూమిపై నివశించు ప్రాణికోటిపైన ముఖ్యముగా చంద్రుని ప్రభావము హెచ్చుగా నుండును. మనస్సునకు చంద్రకళల ప్రభావముచే వుత్తేజము వుత్సాహము ఏకాగ్రత మొదలగునవి సంక్రమించును. గనుక విక్షేపము లేకుండా మనస్సు శక్తివంతమై పూజామూర్తి యందు లగ్నత చెందగలదు. రాత్రిగల పౌర్ణమినాటిరాత్రియందు, చంద్రుడు ప్రత్యక్షముగా ప్రకాశించుచుండగా చేయుపూజవలన ఫలమింకను అధికము

ప్రశ్న: నిత్య సంతృప్తుడు నిరాశగా జీవించెడివాడు, మోక్షమనే భ్రాంతి లేనివాడు, మానవోపాధియందెట్లు వుంటాడు. ప్రపంచములో యెట్లు జీవిస్తాడు?

జవాబు : అందరి మానవులవలనే వుంటాడు కాని లేనిదాన్ని కోరడు. వున్నదానితోనే తృప్తిపడును. ఏ కోరికలు లేక తనయొక్క, తనపై ఆధారపడినవారి యొక్కయు భుక్తి జరుగుటకూ మాత్రం అవసరమైన పనులు ధర్మపద్ధతిగా చేస్తాడు. అది తన విధ్యుక్తధర్మమని మాత్రమే చేయును గాని చేసినవానికి ఫలములు కోరడు. తన నిజరూపమైన ఆత్మకు పరిపూర్ణ పరబ్రహ్మమందు మూలమే లేదని పూరిపూర్ణ బోధను ఆరూఢపరచుకొన్న వానికే యిట్టి నిష్కామకర్మ కర్తృత్వత్యాగము సాధ్యము. ప్రపంచంలో యెట్లు నడుస్తాడు? అంటే ఆకలైనపుడు వున్నది తింటాడు దప్పిక అయితే నీరు త్రాగుతాడు నిద్ర వస్తే నిద్రపోతాడు కాని ఎల్లప్పుడు పరిపూర్ణ పరబ్రహ్మమందు తాను లేనే లేననే నిర్ణయమునందే ఆరూఢులైయుండును. తానే లేడు గనుక తనకు బంధము లేదు. బంధమే లేనపుడు మోక్షమున్నూ వుండదు. కనుక మోక్షాపేక్షతో సహా ఏ భ్రాంతిని మాత్రము అతని కుండదు.

ప్రశ్న: వేదాంత గ్రంథములు "ఎరుకే స్వయంభు దాని సంకల్పము చేత సృష్టి జరిగినది." "అదియే పరిపూర్ణము" అంటున్నాయి. ఆ మాటనే చాలమంది చెప్పుకొనుచున్నారు. ఆ యెరుక శరీరమును విడచి యెటులబోవును? వేరే శరీరము యెత్తుటకు ఎంతకాలము పట్టును? అని నా గురుస్వామి శిష్యులు చెప్పుకొనుచున్నారు. లేనిది, లేదని విచారించిన కారణంచే మీకు సంశయము కల్గుచున్నదని నేను చెప్పినాను. దీనికి మీ నిర్ణయము తెలుపకోరుచున్నాను?

జవాబు: పరిపూర్ణము యెరుక రెంటినీ, వస్తునిశ్చయపూర్వకముగా విచారించని వారు వారికి తోచిన విధంగా చెప్పుకొనుచుందురు. వారితో మనకు పనిలేదు వేదాంత గ్రంథములలో ఎరుక స్వయంభు అనీ దాని సంకల్పముచే సృష్టి జరిగినది అనే మాటలు పరిపూర్ణబోధకు సమన్వయమే. గాని వ్యతిరేకములు కావు. ఎట్లనగా స్వయంభు అనగా తనంత తానే (అనగా వేరేమూలము లేకుండానే) పుట్టినదని అర్థము. పుట్టినది గిట్టక తప్పదు. అని అందరూ అంగీకరించే విషయమే. అట్టి యెరుకే మనమనే కేవల పరిపూర్ణము కాదుకాని అదిన్ని పూర్ణమే అయివున్నదని "పూర్ణమదః పూర్ణమిదం" అంటూ శ్రుతి చెప్పుచున్నది. ఎరుకకూడా పరిపూర్ణమువలె నిండుకొనియున్నట్లుగానవచ్చుటచే యిది ప్రత్యక్షమగు పూర్ణము అనగా ఇది మనోవాక్కులచే తెలియబడుపూర్ణము "పూర్ణమదః" అని చెప్పబడిన పరిపూర్ణము మనోవాక్కుల కందనిది కనుక అది పరోక్షపూర్ణము అన్నారు. వాక్కులకందే ప్రత్యక్షపూర్ణము యొక్క రహితమునందు కేవల పరిపూర్ణ పరబ్రహ్మమే శేషించుచున్నదని ఆ శ్రుతి యొక్క అభిప్రాయము. కనుక శ్రుతులు (వేదాంత గ్రంథములు) పరిపూర్ణ బోధకు వ్యతిరేకము కావు.

మరియు శ్రుతులు, అన్నం బ్రహ్మ; వాక్కు బ్రహ్మం, చక్షువు బ్రహ్మ ప్రాణాం బ్రహ్మ మనస్సు బ్రహ్మ అంటూ చెప్పుకుంటూ పోయి చివరకు అఖండ జ్ఞానమే బ్రహ్మ అని చెప్పినది. అంతవరకు చెప్పిన బ్రహ్మ మనస్సునకూ వాక్కునకూ అందే బ్రహ్మము మాత్రమే. ఆ బ్రహ్మమునందు స్వగత భేదములున్నవి. ఒక చెట్టు దృష్టాంతముగా గైకొన్నచో దాని వేరు మొదలు, కొమ్మలు, ఆకులు, పూవులు,స్వగత బేధములున్నా అన్ని కలసియే చెట్టు అని పేరు పొందినది. వేళ్ళు కొమ్మలు, ఆకులు కాయలు యివి అన్ని చెట్టుకవయవములు అట్లే మనస్సు ప్రాణము వాక్కు యిత్యాదులన్నియి యెరుక యొక్క అవయవ భేదములు. వీనిని విడచి యెరుక లేదు. యెరుకను విడచి యివన్నీ వేరుగా వుండవు. అందుకే కృష్ణదేశికేంద్రులు "యెరుకన్న వివరించ తత్వాలు" అనీ తత్వతతి యెరుకంచనినా" అనీ సెలవిచ్చినారు. ఎవరెట్లు విచారించినా పరిపూర్ణ భావజ్ఞులు యీ పూర్ణదృష్టితో సమన్వయము చేసుకొనగలుగుదురు. వస్తు నిశ్చయజ్ఞానము లేని యితరులు, యెరుక శరీరమును విడచిపోవుననీ, మరల మరొక శరీరములో ప్రవేశించుననీ అనుకొందురు. ఎంతకాలమునకు వేరే శరీరములో ప్రవేశించును అని ప్రశ్నించుకొందురు. శరీరమునకు లోపల, శరీరము బైటా శరీరమునుందు వున్నదంతా యెరుకే అని అంటూనే యెందుండి యెక్కడికి పోవును? అని ప్రశ్నించుకొనుట అసంగతము. దాని వల్ల యెరుకకు ఏకదేశీయత కలుగును. యివన్నీ యెరుక లోపలి చిత్రములు. ఒక యింటిలోని ఒక గదిలోనుంచి మరొక గదిలోనికి పోయినట్లు మనఃప్రాణ రూపమగు వ్యష్టిగుర్తు సంచారము చేయుటయే జనన మరణములు ఇంటిలోనివారు, వారివారి పనులను బట్టి ఒక గదిలోనుండి మరొక గదిలోనికి పనిబడినపుడు సంచరించు విధంగానే కర్మగతి ననుసరించి యెరుక లోపలనే ఆ వ్యష్టి గుర్తు సంచరించును. ఎప్పుడెందుకుసంచరించును? అంటే ఆపని (కర్మ) గల్గినపుడు సంచరించును. యింటిలోని వారందరు ఒకే నిర్ణయము ప్రకారం ఒకే విధంగా ఆయా గదులలో సంచరించరు గదా? కనుకనే " గహనా కర్మణోగతిః" అనగా కర్మగతిని నిర్ధారణ చేయుట అసాధ్యమని గీత నిర్ణయించుచున్నది.

పరిపూర్ణ బోధజ్ఞులు ముఖ్యముగా పరిపూర్ణ యెరుకల రెంటినీ యెరిగి యెరుకను విడచుటకే యత్నింతురు. అనగా ఇంటిని విడచిపోవుటకే యత్నింతురు. ఇంటి గదులలోనే సంచారక్రమమును గూర్చి అంతగా పట్టించుకొనరు. వారు దేవయానము, పితృయానము యిత్యాది విషయములకు పరిపూర్ణ భావమెరుగని యితరులవలె అంతప్రాధాన్యమీయరు. యిల్లే అచ్చిరానపుడు యింట్లో ఏగదియును అచ్చిరాదుగదా? ఒక పరిపూర్ణ గురువు వద్దకు, ఒక ఛాదస్తపు బ్రాహ్మణుడేతెంచి అయ్యా, నేను తమ యింటికి వచ్చుచుండగా మధ్యనున్న తోటలో నక్క ఒకటి యెదురుగా వచ్చినది. అది నా కుడి ప్రక్కనుండి పోయిన మంచిదా? లేక యెడమ ప్రక్కనుండి పోయిన మంచిదా?" అని ప్రశ్నించగా, ఆ గురుస్వామి "ఎటుపోయినా ఏమి బాధలేదు. కరవకుండా పోతే మాత్రము మంచిది" అన్నారట. అట్లాగే

మరణించిన వాడెంత కాలమునకు తిరిగి పుట్టును? అనే ప్రశ్నకన్న, అసలు పుట్టకుండా పోయే విధానమెట్లు? అని ప్రశ్నించుకొంటే మంచిది.

లేనెరుక యనగా అసలే లేనిదికాదు. ఎరుక యందు యెరుక సత్యమే. వున్నవి రెండే. పరిపూర్ణము, యీ లేనెరుక. యిందు పరిపూర్ణమందు ఎరుక లేనేలేదు. గనుకను, పరిపూర్ణము యెరుకకు మూలము కాదు. కనుకను, యెరుకకు యెరుకే మూలము కాని యింకొక మూలము లేనే లేకపోవుట చేతను, యెరుకకు లేనెరుకయని పేరిడినారు. మీరు వారికి చెప్పిన జవాబు సరిఅయినదే అనుటలో సందేహంలేదు.

ప్రశ్న: జీవులు చేయునట్టి పుణ్యపాపకర్మలు భగవంతుడు చేయునట్టివేకదా? జీవులందు దోషమని ఏల చెప్పగలరు? అవి యెవరికి?

జవాబు : జీవుల పూర్వకర్మ వాసనలచే కర్మప్రవృత్తి అనగా కర్మ చేయు సంకల్పము కలుగుచున్నది. యే కర్మనైనా చేయుటకు మానుటకు జీవునకు స్వాతంత్ర్యమున్నది. ఏ పని చేయవలెనన్నా జ్ఞానేంద్రియములు ద్వారా విషయములను గుర్తించి అంతరేంద్రియముల ద్వారా సంకల్పాదులు చేసి కర్మేంద్రియముల ద్వారా మానవుడు కర్మ చేయుచున్నాడు. కాని భగవంతుడు చేయుట లేదు. ఐతే భగవంతుడనుగ్రహించినన శక్తి యుక్తులను మానవుడు నిర్ణయించుకొన్న ఆయాకర్మలు చేయుటకు వినియోగించుకొనుచున్నాడు. భగవంతుడు వేరు, జీవుడు వేరు అనుకొన్నంతకాలము కర్తృత్వమంతయు, కర్మ బాధ్యత అంతయు జీవునిదే. కనుక దోషములు జీవునకే సంక్రమించును. అంతయూ ఆ పరమాత్మే , పరమాత్మ వినాగా అన్యమే లేదు. కనుక కర్త, కారయిత, కర్మ, కర్మఫలము అతడే అనుకొన్న అఖండ జ్ఞానికి మాత్రము ఏ కర్మ ఫలములూ అంటవు. కాని వాచా మాత్రం అనుకొని స్వార్థము కొరకు కర్మలాచరించు వాని వేదాంతము కేవలము మెట్ట వేదాంతమే యగును.

ప్రశ్న : ఈ మహాబోధ కలియుగంలో మొట్టమొదట ఎవరు కనుగొనరి? అంధ్రలోనా? భారతదేశంలోనా? ఇపుడితర దేశాలలో ఏమైనా వున్నది?

జవాబు : తాత్విక జిజ్ఞాసకు, భారతదేశమే పుట్టిల్లు. యీ కలియుగంలో మొదటి సారిగా యీ మహాబోధ పుట్టలేదు. కృతయుగమాదిగా అన్ని యుగములలోనూ గురుశిష్య పరంపరా ప్రాప్తంగా వస్తూనేయున్నది. కలియుగంలో నేటికి 5000 సంవత్సరాలు పై కాలము గడచినది. అప్పటి గురుశిష్యుల నామములు కాలవాహినిలో మరుగైపోయినవి. వేదములెంత సనాతనమో యీ బోధయు అంత సనాతనమే. ఇక దేశ విషయం చెప్పవలెనంటే, యాజ్ఞవల్క్య, జనక, శుక, సాందీప శ్రీకృష్ణార్జునలందురు ఉత్తర భారతంలోనున్నవారే కనుక అక్కడనే యీ బోధ ఆదిలో విస్తరించి యుండవచ్చును. క్రమశః దక్షిణమునకు ప్రాకి మహారాష్ట్రమున, పిదప భారతదేశపు నడిబొడ్డుగానున్న తెలంగాణా ప్రాంతమునకు వ్యాపించి యిపుడు ఆంధ్ర,

కర్నాటక తమిళనాడులకు కూడా ప్రాకినది అని చెప్పనగును. యితర తాత్విక ధోరణులు, పాశ్యాత్య దేశములకు కొంత వ్యాపించినది. ఇంకనూ పూర్ణబోధ సిద్ధాంతము వ్యాపకము కాలేదనియే చెప్పనగును.

ప్రశ్న: శ్రీశివరామ దీక్షితులవారు వ్రాసిన చలాచల వాక్యములలో కేవలాత్మ అచల 86
నామములలో (55) గురుస్వరూపం అని వ్రాసినారు. అట్లే అచలనామములలో(52) గురుస్వరూపమైనది అని వ్రాసినారు వీని భావమేమి?

జవాబు: గురుస్వరూపం అంటే గురువే పరిపూర్ణ పరబ్రహ్మము అని అర్థం కాదు. యిందుకు నిదర్శనముగా కేవలాత్మ అచలనామములలో (54) నెంబరు నామము గురుశిష్యోభయరహితం అని వుంటుటకూడా గమనించండి. కనుక 54,55 నెంబర్లు రెండూ కలిపి చదివితే విశదము కాగలదు.

గురువులేనిదే పరిపూర్ణము అని అంటూనే గురువే పరిపూర్ణమని యెట్లా అంటారు? కనుక గురుస్వరూపం అనగా గొప్ప స్వరూపం లేక పెద్ద స్వరూపం అని మాత్రమే అర్థం గ్రహించాలి. అనగా పరిపూర్ణ పరబ్రహ్మమే గొప్పది. లేక పెద్ద వస్తువు. అంతకంటె పెద్ద వస్తువు లేదని అర్థం. ఈ అంశంలోనే అచల వాక్యములలో కూడా 52వ వాక్యం గురుస్వరూపమైనది అని చెప్పినారు.

ప్రశ్న: సంకల్పించు మనస్సు, చలన లక్షణములుగల వాయు సంబంధము పూర్వ సంస్కారములందు హత్తుకొనియున్నవి. అట్టి మనస్సు యొక్క చలనము లేకుండా 87
చేయుటెట్లు?

జవాబు : శ్లో॥ అసంశయం మహాబాహో! మనోదుర్నిగ్రహంచలమ్
అబ్యాసేనతు కౌంతేయ వైరాగ్యేణచ గృహ్యతే॥

అనగా మనస్సు చంచలమును నిగ్రహించుటకు శక్యముకానిదియు నగుటలో సందేహము లేదు. కాని అభ్యాసము వలనను వైరాగ్యము వలనను స్వాధీనము అగును అని గీతలో భగవానులు సెలవిచ్చినారు. అభ్యాస వైరాగ్యముల నిజాభిప్రాయము ముందుగా తెలియవలెను. అభ్యాసమనగా అభ్యాసయోగమా? అభ్యాసయోగమనగా మంత్ర,లయ హఠయోగములు. యమనియమాది అష్టాంగ మార్గములకు పరాకాష్ట యగు సమాధి స్థితి సాధించిన వానికి గూడ వ్యుత్థానదశయందు మనోచలనము కలుగుచునే వుండును సమాధిలో గూడ మనస్సు పోవుట లేదు దాని చంచలత్వమణగి తాత్కాలికంగా మాత్రమే అచలస్థితిలోన్నది. కనుక అభ్యాసమనగా అభ్యాసయోగముకాదు.

అట్లే వస్తువుల యందు ద్వేషబుద్ధితో వస్తుపరిత్యాగము చేయుట వైరాగ్యమున్నూ కాదు అంతఃకరణమందు రాగద్వేషములు కల్గుటకు కారణము వ్యష్టిగుర్తు (Individual

consciousness) " ఆత్మ వస్తు కామాయ సర్వం ప్రియం భవతి" అని బృహదారణ్యకోపనిషత్ చెప్పుచున్నది. ఆత్మయందలి ప్రేమచేతనే మానవునికి దేనియందైననూ ప్రేమ కలుగుచున్నది. రాగము లేకపోవుటే వైరాగ్యము కనుక వైరాగ్యము కలుగవలెనన్న ఆత్మయందలి ప్రేమ పరిపూర్ణబోధచే రహితము గావలె. "ఉన్నది పరిపూర్ణము. లేనిదెన్నటికి యెరుకయనుచు దృఢమౌ దాకెన్నుము తిన్నని యీ బోధ శిష్యతిలకా మరువకుమీ" అని శ్రీకృష్ణదేశికేంద్రుల ఆదేశము. ఈ విధంగా అభ్యసించుటయే అభ్యాసము లేని యెరుకను అఖండ త్యాగ బుద్ధిచే వదలుటయే నిజమగువైరాగ్యము. జ్ఞానపంచ దశాంగముల నభ్యసించి సాధించు రాజయోగము వలన బ్రహ్మజ్ఞానము కలుగునేగాని వైరాగ్యము గలుగదు. ఆత్మయందలి ప్రేమ నాశనం కాకపోవుటచే రాగబీజములు సూక్ష్మంగా నిలిచియుండి పునఃపున: మొలకెత్తుచుండును.

ప్రశ్న: విహంగ పిపీలికా మార్గముల వివరణ - అచల ఋషుల మార్గమేమి?

జవాబు : అచల ఋషుల మార్గము పిపీలికా మార్గమా? లేక విహంగమార్గమా? అంటే యీ రెండున్నూ కాని పరిపూర్ణ రాజ మార్గము. ఏలననగా భక్తి, కర్మయోగజ్ఞాన మార్గములన్నియు నిజప్రబోధ విధానమందుంతర్భూతమైయున్నవి. కనుకనే దీనిని పరిపూర్ణ రాజయోగమందురు. గురూపాసన విధిగా చేయవలసియున్నది. కనుక ఇది భక్తి మార్గమగును. త్రికరణ శుద్ధితో సమిష్టి శ్రేయోదాయకమైన కర్మలను చేయవలసియున్నది. కనుక యిది కర్మ మార్గమున్నూ అగును. గురువు చూపించిన ఆత్మ వస్తువును తెలిసి తానే అఖండ యెరుకస్వరూపుడనని భావించి ధ్యానించుట వలన యిది యోగమార్గమున్ను అగును. అఖండ యెరుకనే గాక పరిపూర్ణ పరబాహ్యమును గూడ గురుముఖఃత గుర్తెరిగి దాని యందు లేనెరుకకు మూలం గాని కొనకు ప్రవేశించుటకు స్థానముగాని లేదని తెలుసుకొనే బోధ గనుక యిది అతీత జ్ఞానమార్గమును అగును. కనుక దీనికి అచలపరిపూర్ణ రాజయోగము అని పేరు వచ్చినది. అఖండ యెరుక స్వరూపము తానేయని ఆరూఢమగువరకు యీ బోధయందన్ని సాధనలు గలవు. అట్టివానికి మాత్రమే "యే సాధన నీకెందుకు వీసానికి పనికిరాదు అన్నారు. శ్రీకృష్ణదేశికేంద్రులు పరిపూర్ణబోధ సాధనాంతర నిరపేక్షమైనదని చెప్పుట అధికారి విషయములోనే, కనుక పరిపూర్ణ బోధ కేవలం విహంగమార్గం కాదు కొందరు ఎట్టి సాధన సంపత్తియు లేకనే "సూచనకాలమందే యెరుక పాయినది. మేమచల పరిపూర్ణులము మాకు పుణ్యపాపములుండవు" అని ఆత్మవంచన చేసుకొనుచుండుట దురదృష్టకరము.

ప్రశ్న: మానవుడు చేసిన కర్మఫలితాన్ని యీ లోకమునందే అనుభవిస్తాడా? లేక చనిపోయిన పిదప యేదోలోకములో యెప్పుడో అనుభవిస్తాడా?

జవాబు : కర్మఫలము రెండు విధములు (1) దృష్టఫలము అనగా యీ జన్మయందే ప్రత్యక్షంగా అనుభవించునది. ఉదా : దొంగతనము చేస్తే, ధనము లభించుట, పట్టుబడితే ప్రభుత్వశిక్షకు

గురియగుట ప్రత్యక్ష ఫలము. (2) అదృష్టఫలము : అంతఃకరణమున సంస్కారమును మాత్రం కల్గించి ఆగామీ అను నామంతో రాబోవు జన్మలో యెప్పుడో ఫలప్రాప్తికి వచ్చే కర్మఫలము. కనుక యీ జన్మయందు చేసిన కర్మయొక్క దృష్ట ఫలము మాత్రమీ జన్మయందే అనుభవిస్తాడు. అదృష్టరూపమగు ఫలము యెప్పుడు ఏ రీతిగా ఏ లోకములో అనుభవిస్తాడో యెవరున్నూ చెప్పజాలరు కనుకనే దానిని అదృష్టఫలమన్నారు. మరిన్ని "గహన కర్మణోగతిః" అనిన్ని చెప్పబడినది. ఐతే జ్ఞాని కర్తృత్వత్యాగియై, చేసిన కర్మలెట్టి సంస్కారమున్ను కలిగింపజాలవు. కనుక అతని కాగామీ లేదు. అందరివలెనే దృష్టఫలము మాత్రం తప్పదు. ఏలననగా పని అన్నతర్వాత దాని ఫలితము వుండును.

ప్రశ్న: చనిపోయిన వెంటనే మానవుడు తిరిగి జన్మకు వచ్చునా? లేక యాతను చేసుకొన్న 90
కర్మఫలములననుసరించి మరెప్పుడో జన్మించునా?

జవాబు : ఈషణత్రయ బద్ధుడై కేవలప్రాపంచిక జీవితమును గడిపి, తెచ్చుకొన్న ప్రారబ్ధమును నిశ్శేషముగ అనుభవించినమీదట సహజపద్ధతిగా మరణించినవాడు "తృణ జలూక న్యాయము" గా అనగా గడ్డిపురుగు నడచునపుడు, ముందుకాళ్ళెత్తి ప్రయాణము చేయు దిశలో నున్న మరొక వస్తువుపై ఆన్చిగాని, వెనుకటి కాళ్ళు లేవతీయదు అదే పద్ధతిగా మరుసటి జన్మలో అనుభవించుటకు నిర్ణీతమైన కర్మఫలములు (సుఖదుఃఖములు) భోగించుటకు అనువైన శరీరమును చూచుకొనియే యీ వర్తమాన శరీరమును అతడు విడచుచున్నాడు. అనగా కర్మయాన మార్గమున పోవువాడు సామాన్యముగా వెంటనే మరొక శరీరమును ధరించుచున్నాడు. సాధారణముగా అని యెందుకు అనవలసి వచ్చెననగా, హత్యగాని, బలవన్మరణమునకు గాని, హఠాన్మరణముకు గాని గురియై పూర్తిగా ప్రారబ్ధమును అనుభవించకనే గతించువాడు శేషించిన ఆయుఃప్రమాణకాలము ఆకాశావరణములో కర్మశరీరము లేనివాడై అల్లాడుచుండును. లేక విశేషముగ పుణ్యకర్మలో లేక విశేషముగా పాపకర్మలో చేసినవాడు ఊర్ధ్వ అధోలోకములలో ఆయా కర్మఫలితములగు సుఖదుఃఖముల ననుభవించి ఆ పిదప తిరిగి మర్త్యలోకమున జన్మించును.

ప్రశ్న : పిపీలక న్యాయము, విహంగన్యాయము ఏ రెంటిలో ఏ మార్గముశ్రేష్టము? 91

జవాబు : పిపీలికమనగా చీమ, విహంగమనగా పక్షి. ఈ రెండూ ఆశించిన ఫలము ఒక్కటే, కాని మార్గములు వేరు. ఎట్లనగా చెట్టుకొమ్మచివర వ్రేలాడు పండును అనుభవించవలెనన్న కోర్కెతో చీమ చెట్టుపైకి మెల్ల మెల్లగా ఎగబ్రాకి పండును చేరి దానికి బెజ్జం పెట్టి సుఖంగా పండునంతయు తిని వేయును. యిది పిపీలికా మార్గము. ఎగిరి ఫలమును సమీపించి పక్షి, తన ముక్కుతో గాని లేక కాళ్ళతోగాని దాన్ని పట్టుకొని తీసుకొని పోవప్రయత్నించును. ఫలము అందీ అందడంతోనే ముచ్చిక పట్టువదలి జారి క్రిందిపడిపోయే ప్రమాదము

మిక్కుటంగా గలదు. చీమకు పండు చేరుకొనుట అలస్యమగునేమోగాని ఫలము దక్కితీరును.

ఆత్మ సాక్షాత్కార రూపమైన ఫలప్రాప్తికే యీ రెండు మార్గములు చెప్పబడినవి. ఇందు పిపీలిక మార్గము (1) కర్మాయోగము ద్వారా అంతఃకరణశుద్ధి (2) భక్తి మార్గముచే యిష్టదేవతానుగ్రహప్రాప్తి సాధన చతుష్టయ సంపత్తి. ఏకాగ్రత కల్గిన పిమ్మట (3) శ్రవణ మనన నిధిధ్యాసలచే ఆత్మ సాక్షాత్కారము పొందుట పిపీలిక మార్గము ఇందు విహంగ మార్గమేది యనగా శాస్త్రపాండిత్యముచే ఆత్మ యిట్టిదని తెలుసుకొని ఆత్మ సాక్షాత్కారము సాధింపకోరుటయు తారక సాంఖ్య అమనస్కయోగ సాధనలు కూడా చేసి కేవలం అహం బ్రహ్మాస్మి అను భావనమాత్రం చేత, తరింపగోరుట విహంగమార్గం, యిందు పిపీలిక మార్గమే శ్రేష్టమనుటనెట్టి సందేహము లేదు. ఆత్మస్వరూప వస్తు నిశ్చయ జ్ఞానము కల్గినవారికే నిజగురుసాంప్రదాయకమునందు పరిపూర్ణ రాజయోగము తెలుపబడును. కనుక అది పిపీలిక మార్గమే యనదగును. అట్లుగాక శిష్యుడు దొరికిన వెంటనే వానికి పరిపూర్ణభావము దెలుపబూనుట విహంగమార్గమే అనదగును. అట్టి ప్రయాణమువలన ప్రయోజనముండదని చెప్పకతప్పదు.

ప్రశ్న: షోడశ కళలేవి? వీనికి యీశ్వర సృష్టితో సంబంధమేమి?

జవాబు : మానవునకు కలిగే వేర్వేరు అవస్థల్లో జ్ఞానము హెచ్చుతగ్గులు కల్గి పనిచేయుచున్నది. ఆ జ్ఞానము యొక్క స్థితి భేదములకే, షోడశకళలు అని చెప్పబడినవి. జాగ్రత, స్వప్నము, సుషుప్తి, తురీయములలో జాగ్రదావస్థలోజ్ఞానముతో కూడి మనస్సు సకల వ్యవహారములు చేయుచున్నది, స్వప్నంలో మనస్సొక్కటే పనిచేస్తుంది. సుషుప్తిలో మనస్సుకూడా అజ్ఞానములో మగ్నత చెందినది. తురీయంలో జ్ఞానమొక్కటే తానుతానై ప్రకాశించు చున్నది. యీ జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయావస్థలను ఒక్కొక్క దానిని నాలుగేసిగా విభజించినారు. యెట్లనగా జాగ్రత్తలో జాగ్రత, జాగ్రతలో స్వప్నం, జాగ్రతలో సుషుప్తి జాగ్రతలో తురీయం, యిట్లే మిగతావానిని నాలుగేసిగా విభజించుట వలన మొత్తం 16 కళలు యివి తన జ్ఞానము యొక్క అంతర భేదమ్ములేగాని వీనికి ఈశ్వర సృష్టితో సంబంధమేమీలేదు.

ప్రశ్న: ప్రాణమీశరీరము నందెట్లు ప్రవేశించును? ఎట్లు పుట్టును?

జవాబు : ప్రాణమనగా కేవలం వాయువు కాదు. ప్రాణమనగా శక్తి. ఈ శక్తి సర్వమునందు నిగూఢంగా వుండియే యున్నది. ఈ ప్రాణశక్తి తండ్రియొక్క శుక్లమునందునూ తల్లి శ్రోణితమందునూ కూడా వుండి రెంటి చేరికలో ప్రకటమై తల్లియొక్క ఆహారపానీయములతో విజృంభించి పిండమును వృద్ధిగావించుచున్నది. తల్లి గర్భమునందున్నంతకాలము బిడ్డ పుట్టువరకు తల్లీపిల్లల ప్రాణశక్తి కలిసియే వున్నది వాతావరణమునందు స్తంభించియున్న

గాలి విసనకర్ర (పంకా)తో విసరగానే త్వగేంద్రియమునకు శీతోష్ణ స్పర్శ కల్గించునట్లుగానే బిడ్డయొక్క ఘ్రాణేంద్రియమునకు బ్రహ్మాండమందలి వాయువు సోకగానే లోనున్న ప్రాణశక్తి పనిచేయుట ప్రారంభించి వుచ్ఛ్వాస నిశ్వాసలు జరపనిచో బిడ్డను విసనకర్ర ఆడించినట్లుగా యిటూనటూ నూపుటలో వుచ్ఛ్వాస నిశ్వాసలు జరుపుట ప్రారంభమగును.

ప్రశ్న: మానవునియందు విశేషజ్ఞానముండుటకు గల కారణమేమి? 94

జవాబు : సృష్టియంతయు త్రిగుణాత్మకమైయున్నది. అందు సత్వగుణమువలన బ్రహ్మాది దేవతలందరును రజోగుణమువలన సకలజంగమ ప్రాణులును, తమోగుణము వలన భూపర్వత, వృక్షలతాగుల్మాది స్థావరములు కలిగెను. యీ త్రిగుణములు మరల నొక్కొక్కటి మూడేసి అంతర్భాగములయ్యెను. ఎట్లనగా ఉదాహరణకు జంగమ ప్రాణులకుత్పత్తి కారణమైన రజోగుణము మూడు భాగములెట్లాయెననగా 1) రజోగుణములో సత్వగుణము 2) రజోగుణములో రజోగుణము 3) రజోగుణములో తమోగుణము ఇందు రజోగుణములోని సత్వగుణమువలన మానవులుదయించిరి.

శ్లో ॥ సత్వాత్వంజాయతే జ్ఞానం, రజసోలోభ యేవచ
ప్రమాద మోహౌ తమసో భవతో 2 జ్ఞానమేవచ భ॥గీ॥14-19.

తా॥ సత్వగుణమున జ్ఞానము రజోగుణమున లోభము. తమోగుణము వలన ప్రమాద, మోహ, అజ్ఞానములున్ను కలుగుచున్నవి.

కనుక సత్వగుణము వలన జనించిన బ్రహ్మాదులకు సర్వజ్ఞత్వాది గుణములున్నవి. అట్లే జంగమజీవులలో రజోగుణమందలి సత్వగుణముచే వుత్పత్తియైన మానవులకు, రజోగుణములో రజస్తమస్సులవల్ల వుత్పత్తియైన యితర జీవుల కంటె జ్ఞానము విశేషముగా యున్నది. కనుక జ్ఞానమునకు కారణము సత్వగుణము. మానవుని అంతఃకరణమందు సత్వగుణాధిక్యత యుండుటచే యితర జంగమ జీవులకంటె మానవుల యందు జ్ఞానము విశేషము. మరియు మానవ శరీర నిర్మాణమునందే యొక విశిష్టత గలదు. అన్ని జంగమ జీవులలోను వెన్నెముక అడ్డంగా నుండును. మానవుని వెన్నెముక నిటారుగా నున్నది. అనగా మానవ శరీరమందలి బ్రహ్మరంధ్రము, హృదయము ఒకే సరళరేఖలో నుండుటచే పరమాత్మ ప్రకాశం తిన్నగా మానవుని అంతఃకరణకు చేరుటకవరోధమేమియు లేదు. యితర ప్రాణుల శరీరములలో శిరోభాగమందలి బ్రహ్మరంధ్రము ద్వారా ప్రవేశించిన పరమాత్మ ప్రకాశము అడ్డము తిరిగిగాని అంతఃకరణమందు చేరలేదు. మానవుని యందలి జ్ఞానము విశేషముగా నుండుట కిదియు నొక కారణముగా నున్నది.

ప్రశ్న : పూర్ణయోగమునందు కృషి చేస్తూ భ్రాంతిరహితం కాక పూర్వమే హఠాన్మరణం సంభవిస్తే వానిగతియేమి? 95

జవాబు : వాడుత్తమాధికారియగునేని జన్మరహితం కావాలనే ఆకాంక్ష అట్టి హఠాన్మరణ కాలమందునూ వాని అంతఃకరణముయందు బలీయమయ్యే యుండును. కనుక ఆ ఆశయసిద్ధికై వాడు యోగ్యులగు తల్లిదండ్రుల గర్భవాసమున ఆశయసిద్ధికనువగు పరిసరములయందే, తిరిగి మానవుడుగా మాత్రమే పుట్టి కృతార్థత నొందగలడు. ఏదిఏమైనను చేసిన కృషి ఎన్నడూ వృధాగా మాత్రం పోదు. వాని అంతఃకరణయందు ఒక శుభ సంస్కారము నుత్పత్తి చేసితీరును. అసలు అందుకై పుట్టితే పూర్తిగా భ్రాంతిరహితం కానిదే వానికట్టి చావు రానేరాదు. పూర్వజన్మసుకృత విశేషం వుంటేగాని గురుసందర్శనమే కాదు ఆ పిమ్మట గురుపదేశం కూడా పొంది, కృషి చేస్తూ చనిపోతే తప్పక మానవుడయ్యే పుడతాడు. నీచయోనందెన్నడూ పుట్టడు.

ప్రశ్న: శిష్యుడు కడతేరు బాధ్యత శిష్యునిదా లేక గురువునిదా?

జవాబు : తొలిబాధ్యత పూర్తిగా శిష్యునిదే 'ఉద్ధరేదాత్మనాత్మానం'' అనగా నిన్ను నీవే యుద్ధరించుకోవాలి'' అంటుంది భగవద్గీత. " తనుమను ధనములు గురునకు వినయంబున ధారబోసి వేడ్క గురునిచే ననువైన బోధవడసిన'' అనిన్ని, ''నాలుగు శుశ్రూషణములు లో లతగావించుకొనుచు లోకాతీతం బాలోకించి గురునిచే....'' అనిన్ని, జలము నెడబాయనొల్లని, జలచరముల రీవిబూని సచ్ఛిష్యుడు హృజ్జలజంబను పీఠముపై నిలిపితరము మాని గురువునే కొల్చుసుమీ''...అనిన్ని గురుబోధ పొందుటకు ముందుగా శిష్యుడు చేయవలసిన పనులు, కందార్థములలో పేర్కొనబడినవి. శిష్యుడట్లు చేసినమీదట గురువునకు దయరాగలదు. ''అతనికి దయవస్తే అరనిమిషముననే బోధస్థితినీకు కుదిరించు'' ననిన్ని ''హృదయగ్రంధి విడుటకై సదయత యీ బోధదెల్పజనదా గురుడై'' అనిన్ని కృష్ణదేశికేంద్రులవారు సెలవిచ్చినారు. శిష్యుడు లక్షణయుతుడైనపుడే గురునికి బాధ్యత సంక్రమించగలదు.

ప్రశ్న: ఏడవనెలలో పిండమునందు జీవుడు ప్రవేశిస్తాడంటారు పెద్దలు అప్పటివరకు పిండమెట్లెదుగుచున్నది?

జవాబు : జీవుడు, మేఘమండలం నుండి వర్షముద్వారా సస్యాదులలో ప్రవేశించి, తండ్రితినే అన్నముద్వారా తండ్రి గర్భంలో ప్రవేశించి సప్తధాతు పరిణామం చెంది శుక్లబిందువులో ప్రవేశించి తల్లి గర్భమున ప్రవేశించుచున్నాడు. తల్లి గర్భమునందున్న అండముతో సంయోగము చెంది పిండరూపమై తల్లితినే అన్నపానాదుల యొక్కయు పీల్చుకొనే ప్రాణవాయువు యొక్కయు బలముచే నెదిగి అవయవములు లేర్పడుచున్నవి. అదివరలో మరపురూపంలో నున్న జ్ఞానము ఏడవనెలలో వికాసము చెందుచున్నది. అంతేకాని ప్రథమ పర్యాయము జీవుడు ఏడవనెలలో పిండమందు ప్రవేశించుచుండుట లేదు. ఏడవ నెలలో జీవునికి చేతనము కలుగుచున్నది అని చెప్పనొప్పను.

ప్రశ్న : పరిపూర్ణమునందు యెరుక లేదు. కాని యెరుక స్థానమునందు యెరుక వున్నది. १६
అనిన్ని పరిపూర్ణము యెరుక యొక్క బాహ్యాంభ్యంతరములయందు నిండి నిబిడి కృతముగానున్నది అనిన్ని గురువాక్యము కదా? అప్పుడు ఎరుక పరిపూర్ణమునందు వున్నట్టుకాదా?

జవాబు : యెరుక స్థానమునందు యెరుక వున్నది అంటే భావమేమో విమర్శించవలెను. ఎరుకకు యెరుకే స్థానమూ, మూలమూ, అయివున్నది అని అర్థము అంతేగాని యెరుక ఏదో ఒకస్థానమందు సత్యము, నిత్యము అయివున్నదియని అర్థం కాదు. పరిపూర్ణము యెరుక యొక్క బాహ్యాభ్యంతరములయందు నిండి నిబిడీకృతమైయున్నది అంటే ఎరుక ఉన్నట్టు తోచబడే స్థానమందు అంతటా పరిపూర్ణమై యున్నది, అని అర్థముగాని ఎరుక అనేది ఒకటి నిజముగా వున్నదియనిన్ని, చెరువులో ముంచిన కుం శయొక్క బాహ్యాభ్యంతరములయందు నీరు నిండుకొని యున్నట్లు, నిజమైన ఎరుక యొక్క బాహ్యాభ్యంతరములయందు పరిపూర్ణము నిండివున్నది. అని అనుకొనకూడదు. పరిపూర్ణము ఎట్లు వున్నది? దృష్టాంతము చెప్పబడును. తాడుయందు తోచిన మిథ్యా సర్పము యొక్క వునికి అసత్యమని తెలిసిన తరువాత, తోచిన మిథ్యాసర్పము యొక్క బాహ్యాభ్యంతరములయందు తాడే ఎట్లు నిండి నిబిడీకృతముగా వున్నది యని ధృఢమో అట్లే ఎరుక లేనే లేదు అని నిశ్చయము అయిన తరువాత అట్టి లేని ఎరుక యొక్క బాహ్యాభ్యంతరములయందు పరిపూర్ణము వున్నదేగాని ఎరుకలేనేలేదని అర్థముగాని ఎరుకే పరిపూర్ణమందు వున్నదియని అర్థము చేయుట సరికాదు. తాడుయందు ఏస్థానమందైనను సర్పము వున్నట్లు చెప్పవచ్చునా? ఎరుక లేనేలేదని అంటే లేని వస్తువుకు బాహ్యమేమి? అంతరమేమి? దేనికిబైట, దేనికి లోపల పరిపూర్ణమందు ఎరుకలేదు అని మొట్టమొదటే చెప్పినారుకదా!

ప్రశ్న: తను, మన ధనములనగానేమి? १७

జవాబు : తనువనగా - స్థూలశరీరము. మనము అనగా మనస్సు, సూక్ష్మశరీరసంబంధము సూక్ష్మ శరీరము 17 ఇంద్రియములతో కూడినది. అందు మనస్సులేనిచో యింద్రియ వ్యవహారమే యుండదు. కనుక మనస్సే సూక్ష్మశరీరమని చెప్పవచ్చును. ధనము అనగా మూలధనము తనుమనములపైన రెంటికి కారణమైన కారణశరీరమే ధనముగాని రూపాయి అణాపైసలతో కూడినది కాదు. అని తెలియవలెను.

తనుమన ధనములు, శిష్యుడు గురువునకు నివేదింపవలెనని గురు సాంప్రదాయక ధర్మము. యీ విషయమే గురుగీత

శ్లో ॥ శరీర మింద్రియం ప్రాణం అర్థస్వజన బాంధవాన్।
ఆత్మ దారాధికం సర్వం సద్గురుభ్యోనివేదయేత్॥

అని చెప్పినది. అందు శరీరము అనగా స్థూల శరీరము యింద్రియమనగా సూక్ష్మ శరీరము. ప్రాణము కారణశరీరము కనుక తనుమన ధనములు అనగా స్థూల సూక్ష్మ కారణ శరీరములు అనియే చెప్పవలెను యివియే గాక, అర్థము = వస్తుసంపద, స్వజన బాంధవాన్ = స్వజనులు, బంధువులు, ఆత్మదారాదికం = తన భార్య మొదలగు సర్వము సద్గురుభ్యోనివేదయేత్ = సద్గురునికి నివేదించవలెను. అని చెప్పబడినది. కనుక తనుమన ధనములు గురునికర్పించుటయనగా భౌతిక పద్ధతిగా అతని స్వాధీనమందుంచుట కాదు. భావనారూపముగా యివన్నియు నాతనికే అర్పించితిననియు కనుక యవి అన్నియు నాతని సొత్తే నాదికాదు అనియు భావించుట మాత్రమే. కనుక శ్లోకంలో "నివేదయేత్" అనే శబ్దము ప్రయోగింపబడినది. నివేదించిన పదార్థము ప్రసాద రూపముగా మనమే అనుభవింతుము. అంతేగాని గురుమూర్తికి వానితో ఏమి ప్రయోజనము?

కనుక తనుమన ధనము అర్పించుట యనగా వానియందు సర్వభ్రాంతులను వదలివేసి వానియందు నేను, నాది అనే అహంకారమమకారమును వదులుట మాత్రమే. నవవిధ భక్తులలో ఆత్మనివేదనమని చెప్పబడినదీ యర్పణమే. ప్రపత్తియని చెప్పుటే శరణాగతి యొక్క స్వరూపమిదియే. శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ..." అని భగవద్గీతా చరమశ్లోకంలో భగవానుడు చెప్పిన దీభావమే. తనుమన ధనములు గురునికర్పించితిమని గురుపుత్రులందరు పల్కుదురు. అందకు నిదర్శనము వారి ప్రవర్తనయందు గానరావలెను. తన, మనో వాక్కాయములను గురువు విధించిన ఆచార, విచారములయందుంచవలెను. తనుమన ధనములు గురునికిచ్చివేస్తే ఆ మూటినీ గురువాజ్ఞ ప్రకారమే నడపవలెను. తన యిచ్ఛయేమాత్రముండరాదు. అపుడే తనుమనధనములు గురుని కర్పించినాడని అనదగును.

100 ప్రశ్న: స్థూల సూక్ష్మ శరీరములు కలిసియే వచ్చి కలిసియే పోవుచున్నవా? లేక వేర్వేరుగా వేర్వేరు కాలములయందు రాకపోకలు సలుపుచున్నవా?

జవాబు : కలిసియే రాకపోకలు సాగించుచున్నవి. ఎట్లనగా చెట్టునుండి విత్తనము విడిపోయినపుడు ఆ విత్తనము చెట్టును బీజరూపంగా తీసుకొనియే పోవుచున్నది. అట్లే చెట్టు మొలచినదంటే తనయందు తిరిగి విత్తనము వుత్పత్తి చేయు లక్షణముతోనే బైలు దేరుచున్నది. సూక్ష్మ శరీరము విత్తనము వంటిది దానికి స్థూల శరీరము చెట్టువంటిది. మరణము చెందినపుడు మనఃప్రాణాలతో గూడిన సూక్ష్మశరీరము బైటికి పోవుచున్నది. స్థూల శరీరమును మరల కల్గించు సంస్కారములే మనస్సు అనే పేరుతో ప్రాణము మోసుకొనిపోగా బైటికి పోవుచున్నవి. కనుక రాబోవు స్థూల శరీరము సూక్ష్మశరీరముతో గలసిపోవుచున్నది. అట్లే స్థూలమగు తండ్రి శుక్ల బిందువునందు సూక్ష్మమమగు మనఃప్రాణములు జీవరూపంగా చేరియే యుండును. అవియే తల్లి గర్భమునందలి అండమున ప్రవేశించి వృద్ధిచెంది నవమాసాంతరం స్థూల సూక్ష్మ శరీరములతో గూడిన శిశువు జన్మించును. జీవుడు 7వ

మాసమునందు మాత్రమే పిండమునందు ప్రవేశించుననే మాటకు అర్థమేమనగా - జీవ చైతన్యము అప్పటినుంచి పనిచేయుట ప్రారంభించునని మాత్రమే అర్థము. స్థూలమందే సూక్ష్మముండును. సూక్ష్మమందే స్థూల పరిణామ హేతువున్ను వుండును. ఇదియే విశ్వనిర్మాణ సూత్రము. ఇది సర్వేసర్వత్ర వర్తించును. శవము యిక్కడే మిగిలియున్నదిగదా అనరాదు. సూక్ష్మము దానియందెప్పుడు లేదో ఆక్షణమునుంచే అది కుళ్ళిపోవుటకారంభించును గదా!

ప్రశ్న: గురుపరంపరలో "ఓంకార పీఠ సిద్ధాంతం" అనుటకు కారణమేమి? * 101

జవాబు : ఓంకార పీఠసిద్ధాంతం అని పరిపూర్ణ బోధ సిద్ధాంతమునకు పేరులేదు మహాద్వైత సిద్ధాంతపరమతత్వకందార్థములనే పేరుతో 1910 సం॥లో శ్రీ సచ్చిదానంద పగడాల వెంకటేశ్వరావధూతగారు ఒక గ్రంథమును వ్రాసి ప్రకటిస్తూ అందు ఓంకార పీఠసిద్ధాంతమని ప్రథమ పర్యాయము వాడినారు. ప్రణవాతీతమైన పరిపూర్ణ బోధ సిద్ధాంతమునకు ఓంకార రహిత సిద్ధాంత మనదగునే గాని ఓంకార పీఠ సిద్ధాంతమని అనదగునా? అను ప్రశ్న గూడ మీ ప్రశ్నలో వున్నది.

భాగవతుల కృష్ణదేశికేంద్రులవారు పూజావిధానమంతయు (అష్టోత్తర శతనామములు సహా) రచించిరి. అందు గురు పరంపరా శ్లోకములో ఓంకార పీఠసిద్ధాంతమని వర్ణింపలేదు. ఐతే శ్రీకృష్ణదాసుగారే లఘుపూజ నిమిత్తం శ్లోకములు కూడ వ్రాసియున్నారు. కాని లఘు పూజకు పూర్వం చదవలసిన గురుపరంపరా శ్లోకములుకూడా క్లుప్తంగా వ్రాస్తే బాగుండేది అనే భావంతో సచ్చిదానంద వెంకటేశ్వరావధూత గారు గురుపరంపర యంతయు నాలుగు శ్లోకములలో యిమిడ్చి వ్రాసి తాము భావార్థమును వ్రాసి ప్రకటించిన భద్రాద్రి రామశతకంలో చేర్చి ముద్రింపించినారు. అందు మొదటి శ్లోకములోనే "ఓంకార పీఠసిద్ధాంతము బ్రహ్మ విద్యోపదేశిక శ్రీమన్నారాయణం, సూర్యం సద్గురుభ్యనమోనమః" అని వ్రాసినారు.

'ఓంకార పీఠ సిద్ధాంతం" అనుట సమర్థనీయమా? అంటే ఒక విధంగా సమర్థించవచ్చును. (1) ఎట్లనగా పరిపూర్ణ బోధ ఓంకార రహితమైన బోధయైనా పీఠమునకు ఓంకార పీఠమని యనుటలో తప్పులేదు. అపుడు ఓంకారపీఠ సిద్ధాంతమనగా, ఓంకారపీఠము వారి యొక్క సిద్ధాంతము అని అర్థము (2) ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" "ఓం" యిత్యుపాసీత అనిన్ని శ్రుతులు బల్కుచున్నవి. గురుతత్వము. ఓంకారము యొక్క ఆవరణ స్వరూపమేగాని అన్యం కాదు అన్నియుపాసనలు మాని ఒక్క గురుతత్వమనే, గురుకృపా ప్రసాదసిద్ధికై యుపాసన గావించు సాంప్రదాయం యొక్క దీక్షితీయ సాంప్రదాయకమే. (3) ఓంకారమే సింహాసనముగా గల్గి దానిని అధిష్ఠించి యున్నది గురుతత్వం. గురుగీత ప్రథమాధ్యాయమందలి ధ్యానశ్లోకములలో.

శ్లో॥ ఊర్ధ్వామ్నాయ గురోఃపదం త్రిభువనోంకారాఖ్య సింహాసనం" అని గురుమూర్తి అభివర్ణింపబడినాడు. అంటే గురుపదము ఓంకారమనే పేరుగల సింహాసనమును అధిష్ఠించి

యున్నదన్నమాట. పీట అనుదానికి సంస్కృతము పీఠం. సింహాసనమన్నా అదే, కనుక ఓంకార పీఠమన్నా ఓంకార సింహాసనమన్నా యొక్కటే. గురుపదము ఓంకారము కన్న కూడా గొప్పదేయన్న యర్థమునుసూచించును. ఓంకార, గురుపదముల రెంటికన్నీ విలక్షణమైనది పరిపూర్ణ పరబ్రహ్మము.

ప్రశ్న: రాజయోగ సాధకులైన స్త్రీపురుషులు సంతాన నిరోధకమైన ఆపరేషన్లు చేయుంచుకొనుట ధర్మమా? అధర్మమా?

జవాబు : స్త్రీ గర్భము ధరించిన పిదప ఆ పిండమును ఏ రూపముగా నాశనమొనర్చజూచిననూ అది అధర్మమే. పిండమే ఏర్పడకుండా భార్యాభర్తలు జాగ్రత్త పడుటకి ఆపరేషను చేయించుకొనుట అధర్మము కాజాలదు దుష్టాంగమును లేక అధికముగా పెరిగిన శరీరభాగమును, లేక అనవసరంగా నున్న (చేతికి ఆరవవేలు వంటిదానిని) అవయవములు ఆపరేషను ద్వారా తీయించి వేయుట ఎట్లు అధర్మముకాదో యీ ఆపరేషనుయున్నూ అధర్మముకాదు. దీనివల్ల పరపీడనమేమిలేదు. కనుక పాపహేతువుకాదు. రాజయోగ సాధకుని ధర్మములుసమష్టి శ్రేయో దాయకముగా నుండును. సాంఘిక రాజకీయ ప్రయోజనములకై లేదా సమాజ శ్రేయస్సు కొరకు ప్రభుత్వము ప్రోత్సహించు కార్యములు జరుపుటయే ధర్మము "రాజానుమనుధర్మః" అని యుండనేయున్నది.

ప్రశ్న: బట్టబయలే తాను తానే బట్టబయలు అని శివరామదీక్షితీయం (ద్వాదశ భావం) లో వున్నది. తాను అన్నా, నేను అన్నా, ఎరుకన్నా నన్ని పర్యాయపదములని నానమ్మకం. బట్టబయలు తనకుసంబంధం లేదని యెట్లా వ్రాసినారు?

జవాబు : 'నేను' 'తాను' అను మాటలు పర్యాయపదములుగావు. తాను అనగా నేనుకు అన్యమైన అతను అనగా నేనుగానిది. నేను అనుమాటకు అర్థం ఆత్మలేక పరమాత్మ తాను అనుమాటకు అర్థం కేవలాత్మలేక పరిపూర్ణ పరబ్రహ్మము. కనుకనే "తా, నేనకను నిండిన దానికి పేరేమి?...."అనిన్ని. నేనన్న దాంట్లోనేనీనా ప్రసంగము తానన్న దాంట్లోనే తలపోయవ లెనిట్లు" అనిన్ని కందార్థాలలో వాడినారు. తాను నేనూ ఒకటే అయితే తానేనకను" అని యెందుకు వ్రాతురు? తనను గురించి మాట్లాడునపుడు నేను అంటాడు. యితరులను గురించి మాట్లాడునపుడు తన కన్యంగా వున్నవానిని అతడని తానని తనకన్యంగా మాట్లాడునుగదా! కనుక తానే బట్టబయలు బట్టబయలే తాను అనే మాటలకర్థమేమంటే పరమాత్మ స్వరూపుడనైన నాకన్యముగా నున్న వస్తువే బట్టబయలు. బట్టబయలే నా కన్యముగానున్న వస్తువు అని అర్థం. అంతేగాని ఎరుకే నేను, ఎరుకే తాను అని చెప్పబడేవి బయలు, అని అనరాదు.

ప్రశ్న: ఆయుర్దాయములో ఒకసంవత్సరము క్షీణించి పోయినందుకు విచారించవలెనుగాని జన్మదినోత్సవపు పండుగేల చేయవలెను?

జవాబు : ఎవరి జన్మదినోత్సవము? ఎవరు జరుపుచున్నారు? అను విషయములపై జన్మదినోత్సవము యొక్క యుచితానుచితములు ఆధారపడియుండును. ఎట్లనగా : 1) ఎవరి యొక్క పుట్టినరోజు? బాలబాలికల పుట్టినరోజు, బాలబాలికలన కన్న తల్లిదండ్రులకు ( అదైనా తగుమాత్రమ సంతానం కలిగినవారు లేక జాతకాల పిచ్చియున్నవారు అయితేనే) మాత్రం ఆ బిడ్డల పుట్టినరోజు గుర్తుంటుంది. శిశువు ఎదుగుచూ క్రమ వికాసం చెందుచూ ఆటపాటల యందు విద్యాబుద్ధులయందు అరితేరుచూవుంటే చూచి ఆనందిస్తూ ఒక్కొక్క సం॥ పైబడుతూ వున్న కొద్దీ ముద్దు ముచ్చట్లు తీర్చుకొంటూ పుట్టినరోజు పండుగలు చేసుకొని తల్లిదండ్రులానందిస్తూ వుంటారు. ఆ శిశువు ఆయుర్ధాయము తెలియకుండా వుంటేనే వారికానందము. లేనిచో దుఃఖమే కదా! మార్కండేయునికి 16 సం॥ములే ఆయుర్ధాయము అని తెలిసి ప్రతి పుట్టినరోజునా తల్లికంటతడిబెట్టుచునే యుండెగదా?

కొంత వయస్సు వచ్చుసరికి నా పుట్టినరోజు యిది అని తేది తెలుసుకొని, ఆ రోజున తల్లిదండ్రులు పండుగ చేయుట గమనించి జ్ఞాపకముంచుకొని ఆ తల్లిదండ్రులున్నా పోయినా యిక తానే స్వతంత్రంగా ఆ పుట్టినరోజు పండగ చేసుకొని తన కానందజనకమగు శబ్దస్పర్శ రూపరసా గంధాది కృత్రిమ విషయానందములను కల్పించుకొని బంధు మిత్రాదులతో ఆనందిస్తాడు. వారి అభినందలను బహుమతులను స్వీకరిస్తాడు. శుభాకాంక్షలను, శుభాశీస్సులను టెలిగ్రాముల ద్వారా కూడా అందుకొంటాడు. యిదంతా కృత్రిమ ప్రదర్శనా రూపమగు పటాటోపము మాత్రమే గాని యీ శుభాశీస్సులలో చిత్తశుద్ధి బహుతక్కువ. ఆడంబరం, హంగామా మాత్ర జాస్తీ, తండ్రి పుట్టినరోజున కుమారుడే శుభాకాంక్షలు శుభాశీస్సులూ పంపుట వరకూ వచ్చింది నేటి నవనాగరికత.

ఎవరి పుట్టినరోజు వారే జరుపుకొనుట చాలా అనుచితమేయనుటలో ఏమీ సందేహం లేదు. ఏమాత్రం యోచనాపరుడైనా యిందలి అనౌచిత్యము తనకి గోచరమౌతుంది. సాధారణముగా మానవునికి యిరవై సంవత్సరములు వచ్చుసరికి శరీరముపూర్ణవికాసము చెందుతుంది. అంతటి నుంచి యిక దేహశక్తులు క్రమశః క్షీణించుట ప్రారంభించును గడచిన క్షణము రాదు. కాలమాగదు. ఆయుర్ధాయము క్షీణించుచున్నది. మరణమాసన్నమగుచున్నది. మానవజన్మ కల్గినందుకుకు గడిచిన సంవత్సరమున నేను ఏమి సాధించగల్గితిని? ఎంతవరకు పురోగమించితి? అని సింహావలోకనము గావించుకొనవలెను. గమ్యస్థానమింకనూ ఎంతదూరమున్నది. నా ఆశయసిద్ధి ఎప్పటికి కల్గునో అని చింతించుటయే విజ్ఞానదృష్టి గల ప్రతి వ్యక్తియు నిజంగా తన పుట్టినరోజునాడు చేయవలసిన జిజ్ఞాస, అందుకు బదులుగా వ్యర్థవినోదములయందు విషయానందమునందు పుట్టినరోజు ప్రొద్దుపుచ్చుట అవివేకమనుటలో సందేహమేమిలేదు.

ఒకరు పుట్టినరోజు మరొకరు జరుపుకొనుట సామాన్య విషయంకాదు. తాను పుట్టినరోజు యితరులేల పండుగచేసుకొవాలి? తనవల్ల లోకమునకు లేక యితరులకు ఏమి మేలు చేకూరినది? లోకమునకు తానేవిధంగా సేవచేయగల్గినాడు? లోకమేవిధంగా తనకు ఋణపడియున్నది? అది ఏమీ లేనిచో అతడు పుట్టినరోజున యెవరైన పండుగ చేసుకొందురా? శ్రీకృష్ణజయంతి, శ్రీరామనవమి, బుద్ధ జయంతి, క్రిస్మస్, యివన్నియు మహాపురుషుల పుట్టిన రోజులు. అట్లే ఆధునిక యుగమున శంకరజయంతి, గాంధి జయంతి, శ్రీరామకృష్ణ వివేకానందాదుల జయంతులు వారు మరణించినను వారి జీవిత విశేషముల లోకమున చిరస్మరణీయమై జయంత్యుత్సవములకు దారితీసినవి. వారు లోకమునకు ప్రసాదించిన సందేశములు, చేసిన దివ్య ప్రబోధములు, వారి సత్క్రియల సంపత్తి సమిష్టి శ్రేయోదాయక మహత్కార్యములు, లోక సేవా పరాయణమై స్వార్థమెరుగని దివ్యజీవనము యివిగదా వారిని ప్రేమాస్పదుల గావించినవి? వారి జీవితముల నాదర్శముగా గైకొని తన జీవితములను సరిదిద్దుకొనగోరువారా మహామహులు జన్మించినందువల్లగదా తమకిట్టి మహోన్నతాదర్శము. తమ జీవితములకొక వరవడి రూపమగు మార్గములభ్యమై నని తమ సంతోషమును ప్రకటించుకొనుటగాను జన్మదినోత్సవములు జరుపుకొందురు. అట్టి మహామహులు సజీవులయ్యే యున్నచో వారి జన్మదినోత్సవము జరిగించుటింకనూ యెన్నోరెట్లు ఆవశ్యకరణీయమై యున్నది. ఏలననగా వారింకనూ పదికాలములపాటు ఆయురారోగ్యములు కల్గియున్నచో వారి దివ్యప్రబోధము వినుటకు వారి ఆచరణ ననుకరించుటకు తన సాధనయందు కల్గు అవంతారాంతరాయములు తొలగించుకొనుటకై సాధనాంతరములు తెలియుటకు ఆరోగ్య భాగ్యముతో విలసిల్లు ఆ మహామహుల,యునికి ఎంత అవసరమో ఇక వేరుగా చెప్పవలెనా? అట్టి మహాత్ములు ఆయురారోగ్యములకై తాను నిత్యము ప్రార్థించుచునే యుండుట సహజము గదా? అందునూ ఆయన పుట్టినరోజు వచ్చెనదనగానే వారి అయుర్దాయములో మరియొక సంవత్సరము క్షీణించిపోయెనే వారి నెట్లాగైనా తమ మధ్య సాధ్యమైనంత ఎక్కువ కాలము నిలుపుకొనవలెను అని యెంచి తన ఆదర్శపురుషుని యొక్క ఆయురారోగ్యములకు తన యిష్టదైవమును లేదా నిర్గుణస్వరూపమగు గురుపరమాత్మను గూర్చి ధ్యాన అర్చన ప్రార్థనాదులు చేయుటకే జన్మదినోత్సవము జరుపుకొందురు. అంతే గాని వేడుక కొరకు వినోదము కొరకు గొప్పకొరకు మాత్రం కాదు. అయితే జన్మదినోత్సవ సందర్భమున వేడుకలెందుకు? అంటే, జనమును ఆకర్షించుటకొరకు వైభవముకొరకు, కార్యనిర్వహనయందు సహితము యుత్సాహ ప్రోత్సాశములకొరకు మాత్రమేయని తెలియవలెను.

ప్రశ్న: జపము, ధ్యానము, నిష్కామకర్మ యిత్యాదులు చేయుట పరిపూర్ణ బోధకు సహాయకారి కాగలదా?

జవాబు : సాధనలన్నీ అంతఃకరణశుద్ధి, ఏకాగ్రత కలుగుటకై సహాయకారులు అవి కలిగినపుడే యెరుక యొక్క వస్తునిశ్చయం ఆరూఢత కాగలదు. ఆ వస్తు నిశ్చయం లేనిచో పరిపూర్ణబోధ ఎంతమాత్రము అతుకనే అతుకదు. కనుక సాధనావస్థలో అన్నీ కావల్సినవే.

ప్రశ్న: మోక్షము, ఆగంతుకమా? లేక స్వాభావికమా?

జవాబు : మోక్షమనగానేమి? బంధము లేకపోవుట కదా? బంధము, ఎప్పుడు వచ్చినది? సృష్టిలోనికి వస్తే కదా అసలు బంధము. కనుక సృష్టికి పూర్వమున్న దేదో అదే మోక్షమనీ, సృష్టిజాలములో పడుటే బంధమనీ, సృష్టికి పూర్వమున్న ఆత్మ త్రికాలబాధ్యమైనది, కనుక ఆ వస్తువు (మోక్షము) కొత్తగా రావలసిన పనిఏమీ లేదని, కనుక మోక్షము (లేక ఆత్మస్థానము) స్వాభావికమే గాని, ఆగంతుకము గాదనీ కొందరి వాదము. ఐతే (1) సృష్టికి కారణమైన వస్తువును బంధమనవలెను దానిని మోక్షమనరాదు. (2) ఆ సృష్టి కారణ వస్తువు లేని స్థితి యేదో దానిని (అనవలసివస్తే) మోక్షమనాలి. కార్యరూపము బంధము. కారణరూపము మోక్షము అనవచ్చునా? (3) పరిపూర్ణ బ్రహ్మమునందు, సృష్టి కారణమగు వస్తువు పుట్టనేలేదు. కనుక బంధమూ లేదు. మోక్షము లేదు. రెండూ మిధ్య, మోక్షమును ఆగంతుకమని అనరాదు. స్వాభావికమని అనరాదు. కనుక బంధమోక్షములు రెండూ భ్రాంతిరూపములే. అందుకే శ్రీకృష్ణ దేశికేంద్రులవారు ''రోసితి మోక్షాద్యపేక్ష'' అని అన్నారు.

ప్రశ్న : బ్రహ్మవిదుడు, బ్రహ్మవిద్వరుడు, బ్రహ్మ విద్వరీయుడు, బ్రహ్మవిద్వరిష్ఠుడు వీరి లక్షణాలేమి?

జవాబు : యీ నల్వురును జీవన్ముక్తులే. కర్మలచే పుణ్యలోకములు కలుగును అను భ్రాంతి యిందెవ్వరికి లేదు. ఆకాశము అన్నిటితో కలిసియున్నట్లున్నా దేనితోనూ కలియక అసంగమైయున్న విధముగానే ప్రాపంచికులతో కలిసియున్నను వీరెట్టి సంగము లేకనే వర్తించుచుందురు. అంత్యమున వీరందరు విదేహముక్తిని పొందెదరు. బ్రహ్మవిదుడు: లోక సంగ్రహార్థము అనగా తానే చేయకున్న తన్ను చూచి యితరులు చెడుదురను వుద్దేశముతో వర్ణాశ్రమాచార ధర్మాలను యధావిధిగా పాటించుచుండును. ఆ కర్మలచే తన బ్రహ్మనిష్ఠ చెడునేమోయని భీతిచెందడు. చేసిన కర్మఫలములను బ్రహ్మార్పణము చేయుచుండును. జీవనోపాధికొరకేదో వృత్తి యందుండి భుక్తిక్రియ నిర్వర్తించుచుండును. యాదృచ్ఛాలాభ సంతుష్టి కలిగి ప్రారబ్దరీత్యా కలుగు సుఖదుఃఖములకు తాను విలక్షణుడై ఖేదమోదములు లేక నిత్య సంతుష్టుడైయుండును.

మిగిలిన ముప్వురు బ్రహ్మనిష్ఠయందే నిమగ్నులైయుందురు. బ్రహ్మ విద్వరుడు శరీరము పడిపోకుండా నిలుచుటకై నిష్ఠనుండి తానుగానే మేల్కొని అన్నపానము లారగించును విద్వరీయుడు శిష్యులు మేల్కొల్పి అన్నపానము లిచ్చువరకు ఆకలిదప్పులను

విస్మరించియేయుండును. బ్రహ్మవిద్వరిష్టుడు తనయంతతట తను తినడు. యితరులు నిష్టనుండి మేల్కొలిపి పెట్టినా తినడు. అసలు బ్రహ్మనిష్టనుండి చలించనే చలించడు.

పరిపూర్ణ భావజ్ఞుడు యీ నల్వురిలో ఏ తరగతికిన్ని చెందడు. అందరివలె వుండి, అన్ని పనులు చేసి, కేవలం ప్రాపంచీకుని వలెనే మెలగుచుందురు. కాని గురుకృపచే మేల్కొని అశరీర పద్ధతి తెలిసి కర్తృత్వ రహిత కర్మాచరణ చేయుచుండును. ఎరుక వదలియున్నవాడు గాన అతనిని బ్రహ్మవేత్త (బ్రహ్మవిదుడు) అని అనరాదు. అతడు జీవుడూ గాడు బ్రహ్మమూ కాదు. పరిపూర్ణ బ్రహ్మము అవిజ్ఞేయమై మనో వాక్కుల కగోచరమైయున్నది. కనుక ఆ బ్రహ్మమునకు నేతృత్వమూ లేదు. దాని నెరిగినవాడు బ్రహ్మవేత్తయుకాడు. కనుకనే కృష్ణదేశికేంద్రులవారు కం॥ పరమహంసాశ్రమ ధరుని, పరిపూర్ణబోధవాని పనులు సమమె. వారినెరిగినెరుగక నుతి నిందలు గరపిన తత్ఫలము ప్రజలకగుజుమీ అన్నారు.

108 ప్రశ్న: బసవేశ్వర అల్లమాప్రభువులు ఎవరు? వారి సాంప్రదాయమేమి?

జవాబు : బసవేశ్వరులు నందికేశ్వరుని అవతారమని శైవగాధలు తెలుపుచున్నవి. శివుడే తనకు గురువుగా వచ్చి బోధింపవలెనని బసవేశ్వరుడు ప్రార్థింపగా పరమేశ్వరుడు అల్లమా ప్రభువు అనురాజుగా అవతరించి ప్రబోధ గావించెనని ప్రతీతి. కనుక అల్లమా ప్రభువునకు గురువు మరొకరుండుటకు వీల్లేదు. రసమనదగని వస్తువు పరిపూర్ణ బ్రహ్మము గురువగు అల్లమా ప్రభువునికే తెలుసును. బసవేశ్వరుడెంత ఘనుడైనా ఆ గురుగోప్యము గురువువలన గాక మరెట్లు తెలియగలదు? అని శ్రీకృష్ణ దేశికేంద్రులు తమ కందపద్యములలో "రసమనదగనిది వస్తువు బసవన్నకదెట్లు యెరుక, ప్రభువుకు దెలుసున్," అని సెలవిచ్చినారు. అల్లమాప్రభు బసవేశ్వరులకు మార్గమంటూ వేరే ప్రవర్తిల్లేదు. వారివలన పరిపూర్ణ బోధయు విస్తరిల్ల లేదు.

109 ప్రశ్న: మోక్షము, లేక జన్మరాహిత్యము మానవోపాధి యందున్న వారికి మాత్రమేనా? దేవతలకు కూడా లేదా? సాలెపురుగు, పాము, యేనుగు మోక్షం చెందినట్లు కలదుగదా!

జవాబు : మోక్షము లేక జన్మరాహిత్యము ఒక్క మానవులకే గాని యితర వుపాధులనుండి గాని దేవతా శరీరముల నుండిగాని సాధ్యంకాదు. మానవులకు మాత్రమే ఆత్మస్వరూప సాక్షాత్కారం పొందుట కనువగు జ్ఞానసంపత్తియున్న కర్మశరీరమున్నూ కలవు. మిగతా జీవోపాధుల యందట్టి జ్ఞానము లేదు. కనుక వానికి మోక్షఅర్హత లేదు. దేవతా శరీరములు కేవలం తేజోమయ రూపములే గాని వానికి కర్మశరీరములు లేవు. కనుక వారు మోక్షకారక కర్మ చేయలేరు. గనుక దేవతలకున్ను మోక్షం లేదు.

కర్మచేత మోక్షం రాదంటారుగదా! ఇక కర్మశరీరము లేకుంటే నేమి? కర్మ చేయకుంటేనేమి? మోక్షకారక కర్మ అనేదొకటుంటుంది? యిత్యాది ప్రశ్నలు కలుగుట

సహజమే ఐతే "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన, సేవయా...." అని వుద్బోదిస్తూ వున్నది భగవద్గీత శరీరము లేనిచో గురువుకడ కేగుటెట్లు? ప్రణిపాతము (సాష్టాంగనమస్కారం) చేయుటెట్లు? పరిప్రశ్న చేసి తెలుసుకొనుటెట్లు? ఇవే మోక్షకారక కర్మలు. సాలెపురుగు, పాము, ఏనుగు ఇవి జన్మ రాహిత్యముపొందలేదు.శివసాయిజ్యముపొందివుండవచ్చు. సర్వభ్రాంతిరహితమైన మోక్షము మాత్రము అదికాదు. ఏలననగా జ్ఞానపద్ధతి చేతగాని,అజ్ఞాన కార్యమగు భ్రాంతి రాహిత్యము కాదు. దాని ఉపాదియందు అట్టి అఖండజ్ఞాన సంపత్తికి అవకాశం లేదు. ఆ పాము, ఏనుగు, సాలీడు వాని పూర్వజన్మలయందు మానవోపాధియందుండిన మహాభక్తులై యేదో కించిద్దోషమున జడభరతుడు లేడి జన్మఎత్తినట్లు ఎత్తినవి. శివభక్తి సంస్కారము యీ జన్మలో వానికట్టి ప్రేరేపణ ఇచ్చినది. అవి శివసాయిజ్యం పొందుట కూడా పూర్వజన్మల పుణ్యఫలమే. భక్తులను యుత్తేజపరచుటకున్ను భక్తి యొక్క ప్రాశస్త్యమును చెప్పుటకున్ను యిటువంటి కథలల్లబడి యుండి గ్రంధస్తము చేయబడియుండెననుట స్పష్టము. ఒక్క మానవోపాధి యందున్న పుణ్యాత్ములకే పరిపూర్ణబోధ సుమా, అని సూచించుటకే కృష్ణదేశికులు మొదటి కందార్థములో "జనులారా!" అని సంబోధించినారు.

ప్రశ్న : పరిపూర్ణబోధచే కడతేర్చే బాధ్యత గురునిదా? లేక కడతేరే బాధ్యత శిష్యునిదా?

జవాబు : యిరువురిదీ కూడా, ఎట్లనగా కందార్థము : హృదయగ్రంధి విడుటకై సదయత యీ బోధ దెల్పజనదా గురుడై," అన్నారు కనుక గురునికి బాధ్యత లేకపోలేదు. శిష్యుని కడతేర్చెదనని చేరదీసినందుకు వానికి బోధయొక్క మర్మధర్మములు బోధించి కడతేర్చవలసిన బాధ్యత గురునికి తప్పక కలదు. గురువు కాసువీసములకాశించు స్వార్థపరుడుగా నుండరాదు. కాని, శిష్యుడు గురువాజ్ఞ మీరని భక్తుడై యుండవలెను.

శిష్యుడు తాను కడతేరవలెనను తీవ్రతగలవాడై, గురుసేవ, గురునిష్ఠ మానక, గురువాజ్ఞ మీరక, శ్రద్ధ బోధనందు నిలిపి కృషి చేయుచూ త్రికరణ శుద్ధిగా ప్రవర్తించువాడై యుండవలెను. గురుశిష్యులిరువురూ యిట్టి ఆదర్శ లక్షణములు కలవారైనపుడే గాని శిష్యుడు తరించడు. ముఖ్యముగా శిష్యునికి తీవ్రత వుండి తీరవలెను. తీవ్రత వుండి గురుభక్తి వుంటే గురువెట్టివాడైనా శిష్యుడు తరించగలడు.

ప్రశ్న: ఆత్మానందము అనగానేమి?

జవాబు : ఆత్మానందము లేక బ్రహ్మానందం విషయానందము కన్న భిన్నమైనది. శబ్ద, స్పర్శ రూప, రసగంధ విషయములను యింద్రియములు ద్వారా భోగించుట వలన కలుగు తాత్కాలికమగు సంతోషము, విషయానందము ఈ విషయానందము దుఃఖ సమ్మిశ్రమైయుండి సుఖదుఃఖములు అను ద్వంద్యములలో చేరియున్నది. సుఖము వెనుక దుఃఖము, దుఃఖము వెనుక సుఖము వెలుగు నీడలవలె అనుసరించుచుండును. కనుక విషయానందం క్షణికమన్నారు.

ఆత్మానందము అట్లుగాదు. అది శబ్దస్పర్శాదుల వలన కలిగినదిగాదు. సరికదా శబ్దస్పర్శాది విషయగ్రహణ చేయు మనస్సే లేకపోవుట వలన కలుగునది యీ ఆనందము సుషుప్తి సమాధుల యందు కాననగును. అని యితరులు చెప్పుచున్నారు. సుషుప్తిలో శబ్దాది విషయములను గుర్తించి అనుభవించు మనస్సున్ను యింద్రియములును అజ్ఞాన మందు మగ్నత చెందియుండును. కనుక సుఖదుఃఖములు రెండునూ లేని శూన్యస్తితి మాత్రమే. అట్లుగాక శబ్దాది విషయములను యింద్రియముల ద్వారా గుర్తించు మనస్సును ప్రాణాయామాదులచే బలాత్కారముగా అణచిపెట్టుటవలన కూడ దుఃఖరహిత స్థితి కలుగునేగాని సుషుప్తి యందు గాని, యోగసమాధి యందుగాని, ఆత్మానందము లేదు. కాని జ్ఞానామనస్క పద్ధతియందు ఆత్మస్వరూపమునందు మనస్సును ఏకాగ్రత చెంది యుండుట వలన మనస్సే తన మూలకారణమైన ఆత్మస్వరూపము వహించి యుండును. ఇదియే ఆత్మానుభవము.

109 ప్రశ్న: ప్రణవోపాసన వలన కలుగు ఫలితమేమి?

జవాబు : ప్రణవమనగా 'ఓం' కారము ఇది వర్ణ సమామ్నాయములోని యొక అక్షరము గాదు. ఇది ధ్వన్యాత్మకము. కేవలం ధ్వనియే స్వరూపంగా గలది. సృష్టికి పూర్వము, సృష్టికారణమైన అధిష్ఠాన చేతన పరబ్రహ్మము నందలి పరావాక్ రూపంగా లేశ స్వరూపమైవుండి, ధ్వన్యాత్మకమగు నాదరూపకంగా వికసించెను. అట్టి నాద స్వరూపము పొందుటలో కల్గిన చలనమే ప్రాణమాయెను. ప్రాణముతో గూడిన ప్రణవనాదము నుండి పంచబీజములు, ఆ బీజములు నుండి ఒక్కొక్క అక్షరమునందే పదేసి అక్షరముల చొప్పున మొత్తం ఏబది (50) అక్షరములు వానినుండి శబ్దజాలము, సకలనామములు, అఖిల వాంగ్మయము ఏర్పడెను. ఆ పిమ్మట శబ్దోచ్ఛారణలో రూపకల్పన జరిగెను. ఈ విధముగా తొలుత నామరూపములు లేని అధిష్ఠాన బ్రహ్మమే ప్రణవమను నామముచే ప్రసిద్ధి కెక్కి "తస్యవాచకః ప్రణవః" అని చెప్పబడుటకు కారణమయ్యెను. ఉప+ఆసన = ఉపాసన, కనుక ఉపాసన యనగా సమీపస్థితి యని అర్థము కనుక మనస్సునందు, దేనినైనను, స్థిరముగా నిల్పి ధ్యానమొనర్చుట ఉపాసన యనదగును. "మనోహిజతువత్" అనగా మనస్సు లక్కవంటిది. కరగించి ఏ మూసలో పోస్తే తదాకారాకాలితమగును. కనుక ప్రణవోపాసనలో మనస్సు ప్రణవరూపమే వహించును. ప్రణవము నామరూపముల పూర్వస్థితి గనుక ప్రణవరూపము వహించిన మనస్సు (లేక తాను) నామరూపములు యందలి భ్రాంతిని పారద్రోలగల్గును గాని తనయందలి భ్రాంతి మాత్రము నిలచియే యుండునని గుర్తింపవలెను.

110 ప్రశ్న : "నేనే ప్రపంచము, ప్రపంచము నేనే" అన్నారు కదా నాలో ఆకాశము మేఘమండలము, జ్యోతిర్లోకము, చంద్రమండలము, మహర్లోకము, సత్యలోకము అను యీ యేడు లోకములు చ్చుటగలవు?

జవాబు : మీరు చెప్పినది ఏడు లోకములు అని చెప్పబడలేదు. అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాళములను లోకములు ఏడున్ను అధోలోకములుగాను, భూలోకము, భువర్లోకము,సువర్లోకము, మహర్లోకం, జనోలోకం, తపోలోకం, సత్యలోకము అను యేడున్నూ వూర్ధ్వలోకములుగాను చెప్పబడినవి. పిండాండము వ్యష్టిశరీరము అనగా జీవుని శరీరము బ్రహ్మాండము సమిష్టి శరీరము, లేక ఈశ్వరుని శరీరము. పిండాండమందీ 14 లోకములకు భద్రాద్రి రామశతకం 31వ పద్యములో స్థానములు చెప్పబడినవి. శ్రుతి "యదేవేహ తదమత్ర, యదముత్ర తదన్విహ" అనగా పిండాండమందెట్లో, బ్రహ్మాండ మందట్లేననీ, బ్రహ్మాండమందేట్లో పిండాండ మందునూ అట్లేననీ యీ శ్రుతి తాత్పర్యము. కనుక బ్రహ్మాండమందు యీ చతుర్ధశలోకములున్నవన్నమాట. కం॥ లోకంబులు, లోకేశులు, లోకస్థులు తెగిన తుది, నలోకంబగు బెంజీకటి కవ్వల, నెవ్వండే కాకృతి, వెలుగునో ఆతనినే సేవింతున్" మహాప్రళయంలో లోకములు అన్నియు పోయిన పిదపనుండే శూన్యాకాశమునకావల వెలిగే పరమాత్మను ప్రార్థిస్తూన్నాడట. అంటే లోకములన్నీ శూన్యాకాశములోనే వుండియున్నవన్నమాటేగదా! ఆత్మయందే పంచభూతములతో గూడిన ప్రపంచముయొక్క నామరూపములు కల్పితములై ఆత్మయందే వుండివున్నవి. అట్టి ఆత్మ స్వరూపమే నేను, నా నిజస్వరూపమిదియే కనుక ఆ నేనే ప్రపంచముగా పరిణమించెనని కొందరూ, నా యందు ప్రపంచము కల్పితము అని కొందరూ అంటున్నారు. ఎట్లున్నా, లోకములన్నియు ఆకాశములోనివే. ఆకాశము నాలోనిదే కనుక లోకములన్నియు నాలోనివే. యింకొక విధంగా చూస్తే "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనగా అంతయూ బ్రహ్మస్వరూపమే. నేను బ్రహ్మమే. ప్రపంచమూ బ్రహ్మమే. కనుక ప్రపంచము నేను ఒక్కటే. కనుక ఏమి వున్నా అన్ని నాయందే వున్నవన్నమాట.

ప్రశ్న: ఈ వుత్త బట్టబయలు ఏమీలేదు అని ద్వాదశి చెపుతోంది ఐతే దేవుడు లేడా? 114

జవాబు : దేవుడు లేడనే మాట పూర్ణభావజ్ఞులెన్నడూ చెప్పరు. కలలో నైనా అట్లు భావించరు. "దేవుడ్ని నీన్ను యెరుగవు నీవు యిప్పటికీ అంటున్నారు. నిజమైన దేవుడ్ని తెలుసుకో మంటున్నారు. ఆ దేవునికి॥ మ్రొక్కేరితర జేజేలు" అంటున్నారు. నిజమైన దేవుడా పరిపూర్ణ పరబ్రహ్మమే. మిగతాదంతా యెరుక విలాసమే నంటున్నారు. ద్వాదశి అని చెప్పబడే వాక్యానికి నిజాభిప్రాయము తెలియకపోవుట వలన వచ్చిన తికమక యిదంతా ఆ వాక్యానికి యేదోవిధంగా పరిపూర్ణానికి అన్వయింపచేయుటానికి తంటాలు పడుతుంటారు. సాంప్రదాయకార్థము తెలియని గురుపుంగవులు కనుక సాంప్రదాయక నిజాభిప్రాయము. సద్గురువుల వద్ద శ్రవణం చేయక తెలియబడదు.

ప్రశ్న: గృహస్థాశ్రమంలో ప్రవేశించుట, బురదలో యేనుగు కూరుకుని పోవుట వంటిదంటారు 115
కొందరు. మీరు గృహస్థాశ్రమంలో రాజయోగివై వుండాలంటారు ఎట్లాగు?

జవాబు : గృహస్థాశ్రమం శరీర నిర్మాణాన్ని బట్టి తప్పక అవసరం, శరీరములో ఆకలి, దప్పి, నిద్ర అలస్యము, సంగమము అనేవి అగ్నియొక్క అంశగుణములు, కనుక ఆకలి దప్పిక, నిద్ర వంటివే సంగమాపేక్ష కనుక గృహస్థాశ్రమంలో ప్రవేశించనచో శరీర ధర్మమును విడనాడినట్లే అది అనారోగ్యములకు దారి తీయగలదు. యింద్రియములను బలాత్కారముగా నరికట్టి మనస్సుచే వాని విషయములను స్మరించువానిని మిధ్యాచారి అన్నాడు కృష్ణభగవానుడు. మరిన్ని, విషయధ్యానము వలన సంగము, కామము, క్రోధము, మోహము, స్మృతి, విభ్రమము, బుద్ధినాశము, సర్వనాశము సంభవించును. కామ ప్రవృత్తి నణగద్రొక్కొనచో బలీయమైన సంస్కారమంతఃకరణ యందేర్పడి "మృత్యోశ్చమృత్యు మాప్నోతి" అన్నట్లు శాశ్వతముగా జన్మపరంపరలో బద్ధుడగుచున్నాడు. గురుకృపకు పాత్రుడై అంటీ, అంటని లక్షణములతో సంసారమునందుండుట బురదలో దిగబడుట కాదు. అదియే ఆ స్పర్శయోగము. అశరీర పద్ధతి, అట్టివాడు సన్యాసి కంటె చాలా అధికుడు. అతడెంతో ధీరుడు. సంసార బాధ్యతలనుండి పిరికివాడై పారిపోయే భీరుడు కాదు. అతడు బాహ్యదృష్టికి సంసారిగానే గోచరించును అంతరంగమున సన్యాసియే.

ప్రశ్న : పరిశుద్ధాహారమన నేమి?

జవాబు : భగవద్గీత 17వ అధ్యాయము 8వ శ్లోకములో సాత్వికుల కిష్టమమగునది అని వర్ణించిన ఆహారము, అనగా ఆయువును, సత్వగుణమును, బలమును, ఆరోగ్యమును, సుఖసంతోషములను, వృద్ధి పొందించునదియును రసవంతమైనదియును, చమురు గలిగినదియు, చిరకాలముండునదియు, చూచుటకింపైనదియుగు, ఆహారము పరిశుద్ధాహారమని సామాన్యార్థములో చెప్పుకొనవచ్చును. కాని విశేషార్థములో పరిశుద్ధాహారమనగా న్యాయమార్గమున లభించిన ద్రవ్యముతో సంపాదించిన ఆహారమే పరిశుద్ధమైన ఆహారముగాని అన్యాయార్జిత విత్తముచే సంపాదించిన ఆహారము అపరిశుద్ధము. అది స్థూలశరీరారోగ్యమును పెంపుచేసినప్పటికీ సూక్ష్మ శరీరమునకు హాని కలిగించుచుండుటచే అపరిశుద్ధమే అనవలసియున్నది "అన్నపు సూక్ష్మాంశము మనస్సు" కనుక తిను అన్నము (ఏరూపంలో తినే ఆహారమైనా) పాప పద్ధతులచే సంపాదింపబడినచో ఆ పాపము మనస్సును కలుషితమొనర్చును. అన్నము పరబ్రహ్మస్వరూపము అని కొనియాడబడినది అట్టి అన్నము పరిశుద్ధమైనచో బ్రహ్మజ్ఞానమే కలుగగలదు 'పరాన్నం ప్రాణపోకటా' అను సామెత కలదు. పరుల కష్టార్జితమును తినువాడు పాపి, ఏలయనగా వారి పాపములు వీనికి చేరును. ఆ తిన్న అన్నం సప్తధాతు పరిణామము పొంది శుక్లోత్పత్తియై సంతానహేతువగుచున్నది. కనుక పాపపుటన్నమును తిని బ్రతికెడివాని సంతానము కూడా పాపిష్టి సంతానమే కాగలదు. కనుక పవిత్రమగు స్వకష్టార్జిత ద్రవ్యమే పరిశుద్ధాహారమని తెలియదగును.

ప్రశ్న : సృష్టిలో స్త్రీముందా? పురుషుడు ముందా? యిద్దరు సమానమా? మొదట ఏరకంగా సృష్టింపబడ్డారు? (117)

జవాబు : సృష్టికి పూర్వము ఏక రసస్వరూపమైన బ్రహ్మమొక్కటియే యుండెను. అది స్త్రీ కాదు, పురుషుడు కాదు. బ్రహ్మ శబ్దము నపుంసకలింగము మొదటనది నిస్సంకల్పరూపమై యుండెను. ఆ బ్రహ్మము "సో2కామయత బహుస్యాం ప్రజాయేయ" నేననేకమగుదును, గాక అని కోరెను. ఆ సంకల్పము కల్గినపుడా బ్రహ్మము సంకల్పపురుషుడై పుంలింగశబ్ద వాచ్యుడై ఆత్మనామము చేతను, పరమేశ్వరనామము చేతను, ప్రసిద్ధుడాయెను. "అవ్యక్త నామ్నా పరమేశ శక్తిః" ఆయన శక్తికి అవ్యక్తమని, మూల ప్రకృతియనీ, ప్రదానమనీ, త్రిగుణ గర్భిణీ యనీ భూతయోని, యనీ, అనేక పేర్లచే వ్యవహరింపబడుచున్నది. ఈ శక్తి ఆయన శక్తియేయై ఆయన యందే స్థానముగలదై యుండుటచే అది ఆయనకంటె భిన్నము కాదు. కనుక ఆయననే కొందరు స్త్రీరూపము ప్రధానంగా తీసుకొని పరాశక్తి ఆదిశక్తి అనే పేరుతో వ్యవహరించిరి. కొందరు అర్ధనారీశ్వరునిగా భావించిరి.

అట్టి పరమేశ్వర శక్తి యందలి సత్వగుణ విజృంభణ వల్ల దేవతా సృష్టి రజోగుణ విజృంభణచే జీవసృష్టి, తమోగుణ విజృంభణచే పాంచభౌతిక మగు జగత్సృష్టి అయెను. ఇపుడున్న సృష్టియే మొదటి సృష్టిగాని, ఆఖరి సృష్టి గాని గాదు. సృష్టి ప్రళయములు ఒక దానివెనుక నొకటి అనంతముగా సముద్ర కెరటాలవలె కలుగుచున్నవి. కనుక సృష్టి ప్రారంభమంటూ ఒకటి లేదు. పూర్వసృష్టి యందలి బ్రహ్మాండములన్నియు, జీవులకర్మ సంచితముతో సహా, విత్తనములో మహావృక్షమంతయు, దాగియున్నట్లు బ్రహ్మాండములో దాగియుండి వర్తమాన సృష్టియందాకర్మరాశి నుండి కొంత కర్మతీసుకొని ఆ కర్మననుభవించుటకు యోగ్యమైనది. స్త్రీ శరీరమైతే స్త్రీశరీరము, పురుష శరీర యోగ్యమైతే పురుష శరీరము ధరించును. వేదశాస్త్ర పురాణాలలో అనేక విధాలుగా సృష్టి నిర్ణయము గావించబడినది. విజ్ఞాన దృష్టితో చూస్తే స్థూలశరీరమునకేగాని మరే శరీరానికి లింగబేధమేలేదుకనుక యీ భేదము ఔపాధికము మాత్రమే అదియందున్న బ్రహ్మము నందు పురుష ప్రకృతలు రెండూ యిమిడి యున్నట్లు ప్రతి శరీరమునందూ వున్న తెలివి పురుష భాగము, దేహము స్త్రీ భాగము యీ తెలివీ దేహములలో ఏది ముందు? పురుష రూపమైన తెలివిముందా? స్త్రీరూపమైన దేహము ముందా? తీపిముందా? బెల్లము ముందా? తీపి, బెల్లమూ రెండూ ఏకకాలమందు కల్గినట్లే స్త్రీ పురుష శరీరములు రెండూవారి వారి కర్మానుసారం ఒక కాలమందే సృష్టి అయినవి.

ప్రశ్న: వేదములు అపౌరుషేయములా? అదెట్లు? (118)

జవాబు : వేదము అనే శబ్దము విద్ అనే సంస్కృత ధాతువునుండి వుత్పత్తి చెందినది. విద్ అనగా తెలియుట కనుక వేదము అనగా తెలియబడినది ఏదే అదంతయు వేదమే అని

అర్థము. కాని వేదములు అనగా ఋక్ యజుస్సామధర్వణ వేదములన బడే నాలుగు వేదములు అని రూఢ్యర్థము ఈ నాలుగు వేదములు యెట్లు పుట్టినవి? అనేవి విచారించి తెలిసికొనవలసియున్నది. యిందుకు వేదములే ఒక జవాబు చెప్పినవి.

శ్రుతి "బ్రహ్మ నిశ్వసితో వేదాః" అని పల్కినది బ్రహ్మము యొక్క నిశ్వాసమే వేదములు అని దీనికర్థము అక్షరశః అర్థము తీసుకొంటే బ్రహ్మమనునది ఒక వ్యక్తి అని, యెంచి, దాని కుచ్ఛ్వాసనిస్వాసలే జరిపే యింద్రియ గోళకము వున్నదని అనవలసివస్తుంది. నిరాకారమగు బ్రహ్మ వస్తువు విషయంలో యీ అర్థము చెప్పుట విపరీతార్థమే కాగలదు. బ్రహ్మ శబ్దమునకు చతుర్ముఖ బ్రహ్మయని అర్థము తీసుకొంటే ఒకటి కాదుగదా నాలుగు ముఖాలున్నాయి గనుక అర్థము సరిపోవచ్చును. కాని అపుడు బ్రహ్మ అని వుండాలి కాని బ్రహ్మ అని వుండరాదు. మరి శ్రుతి సమన్వయ పూర్వకంగా వేదముల యుత్పత్తిని గూర్చి నిర్ణయించాలి. సృష్టికి పూర్వము అచలమై నిస్సంకల్ప రూపంగానున్న బ్రహ్మవస్తువునకు తొలిసంకల్పము కలిగినపుడే ప్రధమతః చలనము కలిగినది. చలనము కలిగితే దానితో పాటు ధ్వనియున్ను కలుగుతుంది. ధ్వన్యాత్మకము మాత్రమేయగు నా ప్రణవశబ్దమునుండి వివిధత్వము చెందిన వర్ణాత్మకమగు ధ్వనులు కలిగెను. అవి వొండొంటితో చేరి వైఖరీ రూపమగు శబ్ద (పద) జాలము ఏర్పడెను. శబ్దముల చేరికలో వాక్యములు శ్రుతులు, సూత్రములు, శ్లోకములు యిత్యాదిగా వాఙ్మయమంతయు కలిగెను. "బ్రహ్మనిశ్వసిత వేదాః" అనేదానికి యింతమాత్రమే అర్థము గ్రహించవలెను.

ఐతే వేదములయందు వ్యక్తపరచబడిన భావములు ఎవరివి? అవి అపౌరుషేయములా అనగా ఆకాశవాణి" పల్కిన పల్కులలోని భావములవంటివా?వ్యక్తిరూపమేలేని అవ్యక్తము నుండి వచ్చినవా? లేక వ్యక్తుల (పురుషుల) యొక్క భావములా? అను ప్రశ్న మిగిలియే యున్నది. సృష్టి రహస్యమును తెలుసుకొనుటకై మన మహర్షులు గావించిన తపస్సులలో, ఏకాగ్రత చెందిన వారి పరిశుద్ధ మనస్సులకు స్ఫురించిన భావముల వారు ఋక్కులుగా, మంత్రములుగా, శ్లోకములుగా వెలువరించిరి. కనుకనే కనుకనే "ఋషయః మంత్రద్రష్టారః"ద్రష్టుర్వాక్యంశ్రుతిః " ఋషులనగా మంత్రద్రష్టలు అనీ, చూచిన వారి వాక్యమే శ్రుతియని యీ వాక్యములకర్థము. వేర్వేరు ఋషులు వేర్వేరు కాలములలో జిజ్ఞాస చేసి వారికి గోచరించిన సత్యములను వెల్లడించిరనియే చెప్పవలెను. కనుకనే "శ్రుతయశ్చభిన్నా, స్మృతయశ్చభిన్నా మహాఋషీణాం మతయశ్చభిన్నాః" అని చెప్పబడినది. వేదములు అపౌరుషేయములే అయినచో యిట్లు విభిన్నత్వమునకు సావుకాశమే యుండదు?

"ద్రష్టుర్వాక్యం శ్రుతిః" శ్రుతియనగా చూచి చెప్పినవాని వాక్యము అని అర్థము కదా! ఆ చూచిన వాడు పురుషుడే గదా మొదట్లో చెప్పిన వేదశబ్దార్థమును బట్టి తెలియబడినదే వేదము అని అన్నపుడు ఎవరికి తెలియబడినదో అతడున్ను పురుషుడే కదా కనుక తపస్సులో

ఋషులకు తెలియబడినవన్నా లేక గానవచ్చినవన్నా లేక స్ఫురించినవన్నా ఆ వేదముల యందలి భావములు అన్నియు పౌరుషేయములే, అపౌరుషేయములు కావు అనుటయే విజ్ఞాన దృష్టి.

ఐతే ఏ తెలివికి తెలియబడినదో స్ఫురించినదో లేక గానవచ్చినదో ఆ తెలివి, అజ్ఞానము, జ్ఞానా దేవతు కైవల్యం'' అనిన్ని "ప్రజ్ఞానం బ్రహ్మ'' అనిన్ని చెప్పబడిన రీతిగా బ్రహ్మము కన్న భిన్నము కాదు గదా కనుక వేదములు అపౌరుషేయములు అని సమర్థించవచ్చును. బ్రహ్మణోన్యం నకించన'' కనుక ఆ దృష్టితో వేదములు అపౌరుషేయములు అని చెప్పుకొంటే అభ్యంతరములేదు.

ప్రశ్న: సకల జీవోపాధులలో ఉత్తమమైన మానవజన్మకు వచ్చి కూడా చాలమంది మానవులు (11(6)) స్వార్థబుద్ధితో పశుపక్ష్యాదుల వలె పొట్ట కొరకే ప్రాకులాడుటకు కారణము విద్యలేకనా? సహవాస దోషము వలననా? లేక పూర్వజన్మ దుష్కృతము వలననా? విపులంగా తెలుపవలెను?

జవాబు : స్థూలదృష్టికి ఈ మూడును కారణములుగానే కనిపించును కాని ముఖ్య కారణమేదో కొంత విచారించినగాని తేటతెల్లము కాదు. మనిషి జీవించవలెనన్న తిండి కొరకు ప్రాకులాడుట ప్రథమ కర్తవ్యము "శరీరమాధ్యంఖలు ధర్మసాధనం'' శరీరము బాగుంటేనే మానవుడు ఏమైనను చేయగలడు గనుక ధర్మపద్ధతిగా శరీరపోషణ కొరకు స్వకష్టార్జితముగా ధనము సంపాదించుట తప్పుకాదు. కాని పరుల పీడించక మాత్రమే ధనమార్జింపవలెను పరులను పీడించి సంపాదించుట దోషము అట్టి దోషబుద్ధి కలుగుటకు కారణమేమి"బుద్ధిః కర్మానుసారిణి'' అనే న్యాయంగా పూర్వజన్మ దుష్టవాసనలు దుష్టవృత్తికి ప్రేరేపించును అంతవరకు మాత్రమే పూర్వకర్మ యొక్క జవాబుదారి. అయితే మనకు యుక్తాయుక్త విచక్షణ చేయు బుద్ధీంద్రియమును ఉన్నది. అట్టి బుద్ధిచే అధర్మ పద్ధతులను నిషేధించి ధర్మపద్ధతినే అవలంభించుట మానవుని విధి. అట్లు చేయనిచో మానవుడు పశుతుల్యుడే. ఎంత విద్యా విహీనుడైననూ మంచి చెడ్డలను నిర్ణయించుటకు బుద్ధీంద్రియము చాలును కాని కొందరు నేనేమి చదువుకోలేదు. ఆ ధర్మాధర్మములేవి తెలియదు అని వాదించిన యెడల అది నిశ్చయముగా ఆత్మవంచనే అగును. అయితే మరికొందరు ధర్మాధర్మములు ఎరిగి యుండియు దుష్టుల సహవాసము చేత వారితోనే కలిసి పతనమగుచున్నారు. ఈ విధముగా పాపకార్యములాచరించి పాడగుటకు పూర్వకర్మ, అజ్ఞానము, సహవాసదోషము అనువానికి ఏ కించిన్మాత్ర భాగమో ఉంటూ ఉండవచ్చును. కాని స్వార్థబుద్ధి పూర్తిగా నశించవలెనన్న స్వార్థ బుద్ధి జనించుటకు మూలకారణమేదో తెలుసుకొని దానియొక్క అత్యంత నివృత్తి యందుగాని స్వార్థము నశించదని తెలుసుకొనుట ముఖ్య అవసరం. "ఆత్మవస్తు కామాయా

సర్వం ప్రియం భవతి" అను శ్రుత్యానుసారము తనయందు తనకుగల ప్రేమచేతనే తన భార్య తన సంతానము, తన వస్తువులు తనకు ప్రేమపాత్రమగుచున్నవి. ఇదియే కదా స్వార్థము. ఈ స్వార్థమునకు హేతువు తనయందు తనకుగల ప్రేమయే తనయందే తనకు ప్రేమ లేనిచో ఇక స్వార్థము అనుదాని ప్రసక్తే లేదు. కనుక తాననే వస్తువు ఎట్టిది? అది ఎట్లు తొలుగును? దాని కూకుడు వేరు ఎరిగి త్రవ్విన గాని ఆ మూలము నశించునా? నశించదు కదా! కనుక తానెవ్వరో తన మూలమేదో దాన్ని రహిత పరచు విధానమెట్టిదో పరిపూర్ణ గురువుల చెంత శరణాగతి చేసి తెలుసుకొని కృషిచేసిన వారికిగాని స్వార్థము నశించదు.

ప్రశ్న: జాగ్రత, స్వప్నములు రెండూ ఒకటే అయనా, దానిని లనుభవించేది ఒకటే అయినా ఏ అవస్థ బలీయమైనది? విచారించగోర్తాను?

జవాబు : జాగ్రత, స్వప్నములు రెండూ ఒకటి కావు. ఏలననగా స్వప్నములో మనస్సు ఒకటే ఏకచ్ఛత్రాధిపత్యము వహించి, గుర్తెరిగేది, గుర్తెరగబడేది, గుర్తు అన్నియు ఆ మనస్సే అయి స్వప్న, సుఖ దుఃఖములను అనుభవించుచున్నది. జాగ్రదవస్త యందు, అట్లుగాక సత్యాసత్య, యుక్తాయుక్త, ధర్మాధర్మ విచక్షణ చేయు జ్ఞానము, మనస్సునకు తోడై వ్యవహార కారణమగుచున్నది. స్వప్నానుభవము వలన నూతన సంస్కారములు ఉత్పత్తి కావు. జాగ్రతలో నూతన సంస్కారములు ఏర్పడుచున్నవి కనుక మానవుని అభివృద్ధికి గాని, పతనమునకు గాని జాగ్రదావస్థ యందలి కార్యకలాపములే పునాదులు వేయుచున్నవి. కనుక ఇదియే బలీయమని చెప్పవచ్చును. కనుక జాగ్రదవస్థ యందు మానవుడు జాగరూకుడై గురూపదిష్ట మార్గము నందు ప్రయత్న పూర్వకముగా కృషి చేసి కృతార్థుడు కావలసియున్నది.

ప్రశ్న : The thought of "j" is the mind. when does this 'I' arice? Seek for it within you. Then this 'I' vanishes (I minus I is poornam) ఈ భావమునకు, దీక్షితుల వారి భావమునకు ఏమైనా భేదమున్నదా?

జవాబు : నేను అనుదాని యొక్క అహం వృత్తియే మనస్సు. ఈ నేను ఎక్కడ పుట్టుచున్నదో నీలోనే అన్వేషింపుము. అపుడు ఈ నేను అంతర్హితమగును. అని పై ఇంగ్లీషు మాటలకు అర్థము. అనగా నేననే వస్తువునుండి మనస్సు పుట్టుచున్నదని ఈ నేను నీలో ఎక్కడ పుట్టుచున్నదో తెలుసుకుంటిని. ఈ నేననే అహంకారము నశించునని భావము. నిస్సంకల్పస్థితిలో నేను నేనుగానే ఉన్నది దానికి నేననే అహంభావము అపుడు లేదు. ఆ తరువాత కలిగెను. ఈ నిస్సంకల్ప రూపములో నున్న నేను సంకల్పరూపము చెంది వ్యష్టి అహంకారము కలుగుచున్నది. ఈ శరీరమునందు నిస్సంకల్ప సంకల్ప రూపములుగా నుండు ఈ నేను హృదయ స్థానమునందే కలుగును. దీనిని తెలిసినంత మాత్రమున ఇది ఎట్లు

నశించును? సంకల్ప స్థితిలో నుండుటయు, నిస్సంకల్ప స్థితిలో నుండుటయు దీని స్వభావములే. ఈ రెంటికి మూలముగా నున్నదేది? ఈ శరీరమే లేనపుడు దాని స్థానము ఏది? దానికి అతీత స్థానమునగాని అది లేకపోదు కదా దేనియందు దీనికి అత్యంత మూలాభావమో దానియందే దీనికి అత్యంత రహితము. అని శ్రీ శివరామ దీక్షితుల వారి భావము కనుక మీరు చెప్పేది పూర్ణభావమే కాదు.

"యతోవా యిమాని భూతని జాయంతి, ఏనజాతాని జీవంతి, యత్ప్రయంత్యభి సంవిశంతి, తద్విజిజ్ఞాసస్య తద్బ్రహ్మేతి" అనగా సర్వభూతములయుత్పత్తి స్థితి నాశనములు జరుగు చోటే బ్రహ్మము అని అర్థము. కారణమున్నంత వరకు కార్యములు పునరావృత్త మగుచునే యుండును గదా! ఆ కారణము బ్రహ్మము కించిత్తైన నెందు లేదో అదే పరిపూర్ణ పరబ్రహ్మమని దీక్షితీయ భావము. కనుక నేను పుట్టిన స్థానము మాత్రము తెలిసిన చాలదు.

ప్రశ్న: సచ్చిదానంద వెంకటేశ్వరావధూత గారు, తమ మహాద్వైత కందార్థములలో (103) (119)
తానే అచలమన్నారు. 63వ కందార్థములో తానే పరిపూర్ణుండై తాననకను నుండవలయుననీ, పరిపూర్ణమౌదువనీ అన్నారు. 71వ కందార్థములో నీ నిజరూపమే యచలం, నీ నిజరూపంబె బయలు అన్నారు. కనుక అవధూత గారు అధిష్టాన పరబ్రహ్మ స్వరూపుడనగు నేనే పరిపూర్ణమని వ్రాసినట్లు స్పష్టమవుతోంది. సమన్వయార్థము తెలుపకోర్తాను.

జవాబు : అవధూత గారి కందార్థములలో వాడిన యీ క్రింది శబ్ద శబ్దార్థములను ముందు చక్కగా విచారించి తెలిసికొనవలసివున్నాం. (1) తాను (2) నిజరూపం (3) పిమ్మట "తానే పరిపూర్ణుండై పరిపూర్ణమౌదువు" (4) నీ నిజరూపమే యచలం.... (1) తాను, నేను మేను అను మాటల మూటిని అవధూతగారు తొలుదొల్తనే 20 కందార్థములో వాడినారు. నేను, మేనులు, యెరుక మరుపులనుట స్పష్టమే యీ రెండు కాని పరిపూర్ణమే తాను "ఈ వృత్త పరిపూర్ణమే తాను తానే యీ వృత్త పరిపూర్ణం" అని దీక్షితుల వారు అన్నారు. కృష్ణదేశికేంద్రులు కూడా తాను అనగా నేను కానటువంటి పరబయలునే వుద్ధేశించినారనుట స్పష్టమే "తానేననకను నీడీన దానికి పేరేమి అన్నపుడు తాను, నేను అను రెండు శబ్దార్థములు నేను కే వర్తించుటకే వుద్ధేశించితే రెండు శబ్దము లెందుకు వాడాలి? ఆ నిండిన వస్తువునకు తాననే గుర్తుగాని, నేననే అహంగాని ఏమీలేదని భావము (2) నిజరూపం = అనగా అసత్యమైన రూపంగాదనుటకు వాడబడినది. రూపమే, అసత్యం కనుక రూపమే లేనిదేదో అది సత్యవస్తువు ఆ సత్యవస్తువు సర్వలక్షణ విలక్షణమైనది. ఐనను ఏదో పేరుతో వాడాలి కదా వ్యవహారార్థము అచలం బయలు పరిపూర్ణం అనే పేర్లు కూడా వ్యవహారార్థం పెట్టిన పేర్లేనని శ్రీకృష్ణదేశికేంద్రుల వారు స్పష్టంగా చెప్పనే చెప్పినారు. "బట్టబయలనుచు దీనికి మొట్టమొదట పేరు లేదు. ఎరుకే పుట్టి పేరు పెట్టినదన్నారు. "పరమ పదమనిన, బయలన, గురుగోప్యమనంతమనిన అంటూ ఇచ్చిన పరిపూర్ణ నామావళికి అదనంగా అవధూత గారు మరొక పేరు తగిలించినారు.

అంతే "నిజరూపం" అనేదే, ఆ పేరు. నిజంగా వున్నదదొక్కటే. కనుక అదే నిజవస్తువు. అసలు రూపమే లేకపోవుట నిజరూపం. సర్వలక్షణ విలక్షణత్వమే దాని స్వరూప లక్షణం అదే నిజరూపం (5) మహాద్వైత కందార్థాలలో 63వ కందార్థములో "తానే పరిపూర్ణుండై" అనీ, తానేనకను నుండవలయు" ననీ, పరిపూర్ణమౌదువు" అనీ ఎందుకన్నారో విచారించవలెను. మహాద్వైత కందార్థములలో 63-కం॥ తానే పరిపూర్ణుండై, లేనిది యీ యెరుక మరపు లేకను యెపుడున్, స్వానుభావాతీతుండై నేననకను నుండవలయు తలపులు లేకా! నిలకడయయ్యి చలనము గాకా ఫలము నిట్లెరిగితే పరిపూర్ణమౌదవు. తెలిసి విడిచితే చాలు తెలివి లేకుండును తలపులు లేకా నిలకడయయ్యి చలనము గాకా!

"లేనిది యీ యెరుక మరపులేకను యెపుడున్" అనేమాటలు యీ కందార్థములో మొదటిలోనే వాడినారు. ఎరుక మరపు స్వరూపమైన నీవు లేకపోతే ఏమివుండును? పరిపూర్ణమే వుండును గాని, అది వున్నదని చెప్పుటకు నీవు లేవు. ఎరుక మరుపులు విడచిన, నిన్నపుడే పేరుతో పిలువవలెను? ఎరుక మరుపులు లేని దొక్క పరిపూర్ణమే గనుక పరిపూర్ణమేనని పిలిచినారు. కాని అట్లా యెరుక మరపులను విడచిన మహనీయులు తాను (-పరిపూర్ణము) అని అంటారా? నేను (ఎరుక) అని అంటారా ఎరుక మరపులను విడిచిన వారికి యిక ఏ తలపులుంటాయి? తెలివేమి యుంటుంది? ఎట్టి చలనమైనాయుంటుందా? అట్లా ఎరుక మరపులను పూర్తిగా విడిచియున్న మహాత్ములను అచల పరిపూర్ణులు అనవచ్చును. కనుకనే గౌరవవాచకంగా ప్రతిపరిపూర్ణభావజ్ఞులనీ అచల పరిపూర్ణులని సంభోధిస్తున్నారు. కనుక పరిపూర్ణ మౌదువు అన్నారు. అవధూతగారు, అంతేగాని నీవు అధిష్ఠాన చేతన బ్రహ్మమే. ఆ నీవే పరిపూర్ణము, రెంటికీ భేదమే లేదనే భావంలో కాదు. పరిపూర్ణము ఎరుక మరపులు ఏమీ లేనిది. అధిష్టాన పరబ్రహ్మము యొక్క స్వరూపమే యెరుక మరపులు. అది యిది కాదు. యిది అదికాదు.

ఈ విషయమునే అవధూత గారు కూడా తమ 71 కందార్థంలో చక్కగా చెప్పినారు. 71 కం॥ నీ నిజరూపమె యచలము. నీ నిజరూపంబె బయలు నిజముగ నెపుడున్, నీ నిజరూపమే పూర్ణము. నీ నిజరూపంబె బ్రహ్మ నీ వెరుగవయ్యా, నీ నిజరూపం నీవు గాదయ్యా (కావయ్యా) - నీవే విశ్వరూపం. నీవే భ్రమరూపం. నీవే మాయరూపం. నీవెరుకరూపమని, నీ వెరుగవయ్యా, నీ నిజరూపం నీవు గాదయ్యా. ఎట్లనగా మొదట నీ నిజరూపమే అచలం. బయలు, పరిపూర్ణము అన్నారు. తర్వాత నీ నిజరూపం నీవు గాదయ్యా, (నీ నిజరూపం నీవుకావు అయ్యా) ఆ తర్వాత, ఆ నీవు అనగా ఏదో చెప్పేరు - నీవె విశ్వరూపం॥భ్రమరూపం, మాయారూపం, యెరుకరూపం, అన్నారు. కనుక నీవు నీ నిజరూపం (ఎరుక మరపులు లేని రూపం) గాదయ్యా (కావయ్యా) అంటే అయిపోవయ్యా అని అర్థంకాదు. కనుక ఎరుక పరిపూర్ణములు రెండు ఏక వస్తువు అని అవధూతగారి అభిప్రాయం యెన్నడు కాదు.

ప్రశ్న: శ్రీమతి సీతామహాలక్ష్మిసమేత శ్రీ సదానంద శ్రీరామచంద్ర సద్గురు పరబ్రహ్మణేనమః ' అంటూ ప్రతినిత్యమూ చెప్పుకొనుటకు అలవాటుపడియున్నాను. అట్లే చెప్పవచ్చునా? ౧౨౦

జవాబు : అట్టే చెప్పుకొనవలెను. భార్యను అర్ధాంగి అన్నారు కదా! పరమశివుడు అర్థనారీశ్వరుడు కదా! తాత్వికముగ చూస్తే పురుషుని శక్తి పురుషునికంటే భిన్నము కాదుకదా! పురుషుడు పురుషశక్తి రూపము ప్రకృతి. తీపి తీపి యొక్క ఆవరణమగు బెల్లముగడ్డవలె అవినాభావ సంబంధముగా విడరానివై యున్నవి గదా! కనుక యథాప్రకారం చెప్పుకొన వచ్చును.

ప్రశ్న : "ఏకమేవ్వాద్వితీయం బ్రహ్మ" అనేశ్రుతిని పరిపూర్ణబోధ సిద్ధాంత రీత్యా దయచేసి విమర్శింపుడు. ౧౨౧

జవాబు : ఈ వాక్యమునకర్థము బ్రహ్మమొక్కటియే ఉన్నది కాని రెండవది లేనే లేదని అద్వైతుల నిర్ణయం. బ్రహ్మపదార్థము వంటి వస్తువు మరొకటి లేదని విశిష్టాద్వైతులందురు. యీ రెండర్థములున్ను సృష్టికారణమైన బ్రహ్మమును అనువదించుచున్నవేగాని పరిపూర్ణ బ్రహ్మమును సూచించుటలేదు. ఏలననగా, పరిపూర్ణ పరబ్రహ్మము ఏకానేకములు కానిది కనుక అవి సంఖ్యానీకములోనికి రాజాలదు. సృష్టికి పూర్వము అంత్యంత సూక్ష్మమైయుండి ఒకటిగా నున్న బ్రహ్మము క్రమముగా స్థూలాతిస్థూలమై క్రమముగా అనేకనామ రూపాత్మకమగుట క్రమసృష్టి, ఇంద్రజాలమునందలి వస్తు సంపదవలె ఒకేసారి సమస్తము ప్రకటమగుట యుగ ప్రసృష్టి. అద్వైతవాదులు వివర్తవాదము ప్రతిపాదించి బ్రహ్మమునందెట్టి మార్పునూ జరుగకుండనే మాయా పరిణామము వలన అన్యప్రతీతి కల్గెనని లేని మాయయే పరిణమించినదని చెప్పెదరు. ఉన్న బ్రహ్మము ఎప్పటివలెనే ఏ మార్పు చెందకుండానే యున్నది. కనుక అది ఏకమాత్రమని మాయాకార్యములు వున్నట్లు తోచినా అవి మిథ్యయే కనుక. ఆ బ్రహ్మమొక్కటియే తప్ప అన్యము లేదని యీ శృతి కర్థమును గ్రహించిరి. జీవజగత్తులు శరీరముగా గల్గి సగుణంలో ఈశ్వరుడును పేరుతో ఆ బ్రహ్మము సకలమునందు అంతర్యామిగా నున్నదనియు అట్టి బ్రహ్మము అద్వితీయము అనగా అటువంటి వస్తువు మరొకటి లేదనియు విశిష్టాద్వైతులు వ్యాఖ్యానింతురు. అద్వైత వాదములో మాయజడమని పరబ్రహ్మముయొక్క సన్నిధానములో చేతనము గల్గి ఈశ్వరజీవ జగత్తులుగా పరిణమించ గల్గినదని చెప్పబడుటచే ఆ బ్రహ్మమునకు సాన్నిధ్యమంత్రకర్తృత్వమైననూ సంభవించుచున్నది. కనుక కర్తృత్వకార యిత్రత్వ లక్షణము లేమియు లేని పరిపూర్ణ పరబ్రహ్మమును అద్వైతులూ అనువదించుటలేదు జీవజగత్తులు శరీరంగా గల్గిన ఈశ్వరుడే నిర్గుణరూపంలో బ్రహ్మమని విశిష్టాద్వైతులు ప్రతిపాదించుచున్నారు. కనుక 'అశరీరం సర్వదా అస్తి శరీర రహితం సదా" అని చెప్పబడిన పరిపూర్ణ పరబ్రహ్మమును వీరున్ను నిర్ణయించుటలేదు. కనుక యీ శ్రుతిని వాచ్యార్థ లక్ష్యార్థములచే పరిపూర్ణపరబ్రహ్మపరంగా అర్థము చెప్పుటకు వీలులేదు. ఐనను లక్ష్యాలక్ష్యార్థముగా అనగా లక్ష్యార్థమైన పరమాత్మను కూడా వదిలి ఈ శ్రుత్యర్థమును విచారిస్తే పరిపూర్ణ పరబ్రహ్మనిశ్చయమగును.

122 ప్రశ్న : ఎరుకయొక్క స్థానస్వరూప స్వభావములు తెలియుటవలన ప్రయెజనమేమి?

జవాబు: "పరిపూర్ణమెరిగి, ఎరుక నెరిగి, యెరుకను విడువుము" అనిగదా పరిపూర్ణబోధ, ఎరుక స్థాన స్వరూపస్వభావములు తెలిసినచో "ఎరుక" నెరిగిన వారగుదురు. అపుడుగాని ఎరుకలేని పరిపూర్ణము జాడయే తెలియదు. ఎరుకే తెలియనివారు ఆకాశమే పరిపూర్ణమని అపోహ జెందుదురు. ఎరుక ఏదో తెలియనిచో యెరుకను విడచుట ఎట్లు? కనుక పరిపూర్ణమును యెరుగుటకు యెరుకను విడచుటకు కూడా ముఖ్యముగా యెరుక ఏదో స్పష్టముగా తెలియవలెను. తనయందు తెలివి పోయినంత మాత్రమున యెరుక పోయినదని అనుకొనరాదు గదా! నిట్లుపోవుట మరుపు, సుషుప్తి, మూర్ఛ, మరణము, సమాధి, అనే స్థితులలో జరుగుచూనేయున్నది. కనుక కూకుడ వేరుగాయున్న యెరుక యొక్క స్థానస్వరూపములు చక్కగా తెలిసికొనవలసివున్నది.

123 ప్రశ్న : ఎరుక కూకడ వేరు నెరిగి త్రవ్విన మహాత్ములు కూడా కారణజన్ములుగా వస్తారా?

జవాబు: రారు. కారణజన్ములుగా తిరిగిపుట్టే వారికి అన్ని భ్రాంతులు పోయినా, తాను తిరిగి పుట్టి లోకోద్ధరణ చేయవలెను అను భ్రాంతి మాత్రము తగులుటచే అట్టివారు మాత్రమే కారణజన్ములై పుట్టెదరు. గురువులట్టి వారిని చెప్పుటకు కారణమేమనగా తాను తన గురువుయొక్క కృపకు పాత్రుడై సర్వభ్రాంతి రహితము కావించుకొన్నప్పటికి, గురుఋణము తీర్చుకొనుటకు గురువాజ్ఞానుసారము తాను గురువై లోకములో యోగ్యులైనవారికి పరిపూర్ణబోధను ప్రసాదించి తరింపచేయు బాధ్యతను నెత్తిమీద పెట్టుకొని ఆ భ్రాంతికి లోనగుటయే కారణజన్మము.

లోకములో అందరూ మోక్షము చెందినగాని తనకు మోక్షమే అక్కరలేదని వివేకానందుడన్నాడు. యిట్టి కోరికవున్నవాడు తిరిగి అందులకై పుట్టవలసిన అగత్యముందునా! లేదు? కాని ఎరుక కూకడ వేరు పూర్తిగా యెరిగి త్రవ్వి వేసిన వానికి ఏ భ్రాంతియునంటదు. అందుచే వారు తిరిగి పుట్టనేపుట్టరు.

124 ప్రశ్న : మరణించినవారు మరల పుట్టగలరని యెవరైనా చూచినారా? చూడగలరా?

జవాబు : సామాన్య మానవులెవరున్నూ చూచియుండరు. చూడలేరు. కాని మహత్తులు సాధించిన సిద్ధపురుషులు చూడగలరని చెప్పబడినది. కనుక పునర్జన్మ యితరులు కేవలం అనుమాన ప్రమాణంచేతను, శబ్ద ప్రమాణం (అనగా శాస్త్రప్రమాణం చేతను, నమ్మవలసినదే)

125 ప్రశ్న : మరణించినవారు తిరిగి పుట్టగలరంటే, కర్మవలనా, లేక భ్రాంతి చేతనా? దానికి తరుణోపాయమేమిటి?

జవాబు : కర్మ వలననే, అనగా కర్మఫలమనుభవించుటకే తిరిగి పుట్టెదరు "కర్మము బుట్టు జంతువు" అన్నారు. ఐతే ఆ కర్మ చేయుటకు యేది ప్రేరేపించి కారణమైయున్నది?

అంటే,తాను తనమూలకారణమైన అఖండ యెరుకయు పరమసత్యనిత్యవస్తువులని భ్రాంతి చెందుటయే మూలకారణము. యీ భ్రాంతి పరిపూర్ణబోధవలనగాని తొలగదు. అపుడుగాని జన్మరహితం కాదు.

ప్రశ్న : గీతలో దక్షిణాయన, ఉత్తరాయణములని వున్నది. ముక్త పురుషులు, గూడా ఆయా కాలములలో గతించిన వారు అట్టి గతియే పొందవలసి వచ్చునా?

జవాబు : ముక్తపురుషులు దేవయాన, పితృయాన, కర్మయానములు చేయరు. యానమనగా ప్రమాణము. దేశకాలములబట్టి ముక్తపురుషుల గతులు మారవు. వారు కాశీలో చనిపోయినా, ఒకటే, లేక ఏకాదశినాడు చనిపోయినా అమావాస్యనాడు చనిపోయినా, పగలు చనిపోయినా, రాత్రి చనిపోయినా, ఉత్తరాయణంలో చనిపోయినా, దక్షిణాయంలో చనిపోయినా ఒకటే వేయించిన విత్తనము ఏ దేశంలో ఏ కాలంలో నాటినా తిరిగి మొలవదు గదా!

ప్రశ్న : బ్రహ్మము సాక్షి రూపములో కర్తృత్వరహితమై ఉన్నట్లు చెప్పబడుచున్నది. "నీకు ఏ గుణములు లేవు నిర్మలుడవు" అని భద్రాద్రిరామ శతకములో చెప్పబడినది. కాని బ్రహ్మమే ఎరుకని సర్వసృష్టియు, గుణములున్ను ఆతనివలెనే కలిగినవని చెప్పబడుచున్నది. సమన్వయమెట్లు?

జవాబు : సృష్టికి పూర్వమున్న బ్రహ్మము గూడా కేవలము నిర్గుణము కాదు, ఆ బ్రహ్మమునందు సృష్టి కారణమగు సత్వర జస్తమో గుణములు మూడున్ను బీజరూపంగా ఉన్నవి. కనుక బ్రహ్మమే సృష్టికి అత్యంత మూలకారణము "నీకు ఏ గుణములు లేవు నిర్మలుడవు. అనగా ఆ త్రిగుణములు కార్యరూపం వహించని స్థితిలో పైకి కానవచ్చుటలేదు. ఇంతేగాని అసలే లేవని అర్థము కాదు. సృష్టికి ఆ బ్రహ్మమే తన యందు బీజరూపంగా నున్న త్రిగుణ విజృంభణచే నామరూపాత్మకమగు జీవేశ్వర జగద్రూపము వహించిసదని తెలియవలెను.

ప్రశ్న : కంద పద్యములో "చంద్రుని చీమ ముద్దాడినట్లు" అని దృష్టాంతమిచ్చినారు. వివరింపకోరెదను?

జవాబు : బ్రహ్మాండభాండ అనంతములలోని నీవునికి అణుస్వరూపము కనుక నిన్ను చీమతోను, బ్రహ్మాండభాండ అనంతరములకు కారణ స్వరూపమగు ఎరుకకు కూడా అతీతమై ఒప్పు పరిపూర్ణపరబ్రహ్మమును చంద్రునితోను పోల్చి చెప్పబడినది. చీమ చంద్రుని ముద్దాడుట ఎంతకష్టసాధ్యమో పరిపూర్ణబోధయందు ఆరూఢత పొందుటకూడా గురుకృప లేని వానికి అసాధ్యమే! నీవు లక్షణయుతుడడైన ముఖ్యాధికారివి కనుక నీవు అట్టిబోధ పొందగలిగితివి అని భావము.

ప్రశ్న : గురుగీతకు మూలం ఏది? కాగితంపై కలముతో గీచిన గీతయా?

జవాబు: భగవద్గీత, ఉత్తరగీత, శివగీత, శృతిగీత, రామగీత మొ॥ గీతలెన్నియో ఉన్నవి. గీత

అనగా గానము చేయబడిన చందోబద్ధమగు శ్లోకము లేక పద్యము అని అర్థము. "గురుగీత" అను పదమునకు గొప్పగీత అనియు, గురు ప్రభావమును వర్ణించు శ్లోక గ్రంథమనియు అర్థము గురు స్వరూపముకన్న గొప్పది లేదు కదా! అట్టి గొప్ప వస్తువును గూర్చిగానము చేయునదియే గురుగీత. దీనికి మూలము స్కాంధపురాణములోని ఉత్తరఖంఢము. శివుడు పార్వతికి ఉపదేశించినట్లును గురుగీత గ్రంథమును బట్టియే వెల్లడి అగుచున్నది.

120 ప్రశ్న : ద్వయదోష రహితమే, గురుపూజ అన్నారు దీక్షితులవారు అట్టి ద్వయదోష రహితులకు గురుపూజ యెందుకండి?

జవాబు : ద్వయదోష రహితము చేయుటకే గురుపూజ, ద్వయదోషరహితము నిజంగా అయితే ఆ పిదప గురుపూజ అక్కరలేదు

121 ప్రశ్న : స్మరణ చేస్తూ వున్నపుడు గుర్తు పనిచేస్తుంది కదా! జనన మరణ భ్రాంతి రహితులు స్మరణచేస్తూ భౌతిక దేహము విడువవచ్చునా?

జవాబు : భ్రాంతి రహితము చేసుకొన్న వారికి ఏ నిర్ణయమూ లేదు. స్మరణ చేసిన చేయకున్న ఏమిాబాధలేదు. పోయిన యెరుక మళ్ళీ తిరిగివచ్చి పట్టుకొంటుందా? "మేము భ్రాంతి రహితులమై పోయితిమి" అని ఆత్మవంచన చేసుకొని మోసపోయి మాకే స్మరణము అక్కరలేదని నిర్ణయం చేసుకుని యుండుట మాత్రము తప్పు.

122 ప్రశ్న : దినకరుడు ఉదయాస్తమానములు చెందుచున్నట్లు, యీ తెలివి జాగ్రద,సుషుప్తులు జరుపుటకు కారణమేమి?

జవాబు : నిజముగా సూర్యుడుదయాస్తమానములు చెందుటలేదు. పగలు, రాత్రి కలుగుటకు భూమి తన చుట్టూ తాను తిరుగుటయే కారణము. అట్లు మనస్సు భ్రూమధ్యము, హృదయము అను రెండు స్థానముల మధ్య తిరుగుటలో జాగ్రత్త సుషుప్తులు కలుగుచున్నది. భ్రూమధ్య స్థానమున వచ్చు సర్కి మనస్సు ప్రాణముతో పూర్తిగా కలయుటచే గుర్తుకల్గి జాగృతావస్త చెందుచున్నది,, ఆ మనస్సు హృదయ స్థానమునకు దిగినపుడు ప్రాణ సంయోగము గల్గి సుషుప్తావస్త వచ్చుచున్నది.

123 ప్రశ్న : మానవులకు ఆయువు తరుగుచున్నదని పెరుగుచున్నదని అంటున్నారు. హంసలు తరిగేది యెట్లు పెరిగేది యెట్లు?

జవాబు : మానవుని ఆయుః ప్రమాణము యెన్నో కొన్ని హంసలు అని నిర్ణయము. అనగా వేర్వేరు మానవులకు యీ హంసల సంఖ్య వేరువేరుగా వారి వారి ఆయుః ప్రమాణమును బట్టి నిర్ణయమై వుండును. దినమునకు ఆరోగ్యవంతుడైన మానవుని యందు 21,600 శ్వాసలు (హంసలు) జరుగును.(ప్రాణాయామాది క్రియలచే ఒక మానవుడు 10,800 శ్వాసలు మాత్రమే ఒక రోజున జరిపితే వానికి 12 గంటలు కాలము ఆయుర్దాయము

పెంచుకొన్నట్లుఅగును. ఒకడు ఆయాసపడి వగర్చుకొంటూ ఒక దినములో 10,800 శ్వాసలు ఎక్కువ పీల్చినాడనుకొందాము, అపుడు తన ఆయుర్థాయములో 12 గంటలు క్షీణింపచేసుకొన్నాడన్నమాట. యీ విధంంగా మానవుని ఆయుర్థాయము పెంచుకొనవచ్చును లేదా తగ్గిపోవచ్చును.

ప్రశ్న : "ఆత్మయందుననేక మాకాశ ముదయించె అన్న సీసపద్యం వివరింపుడు? (124)

జవాబు: ఆత్మకు ఆకాశము, ఆకాశమునకు వాయువు, వాయువునకగ్ని, అగ్నికి జలము జలమునకు పృధ్వి, పృధ్వికి ఓషదులు, ఓషదులకన్నము, అన్నమందు 84 లక్షల జీవోపాధులు, యీ విధంగా పరమాత్మ మాయవలన, రెండు జగములు కల్గెనని తాత్పర్యము. ఐతే తల్లికి వేరై బిడ్డపుట్టినట్లుగా పంచభూతములు ఒకదాని నుంచి ఒకటి వేరుగా పుట్టినవా? లేక ఆత్మయే ఆకాశమై, వాయువై, అగ్నియై, బ్రహ్మాండ, పిండాండములనునవి కల్గినవా అని యోచించవలెను. సృష్టికి పూర్వం తనయందు బీజ వత్తుగా గర్భీకృతమైయున్న శబ్ద స్పర్శ రూప రస గ్రంధములు విజృంభించుటచే ఆత్మయే పంచభూతములుగానూ బ్రాహ్మాండ పిండాండములగానూ మార్పు చెందిననియే తెలియవలెను. తన యందున్న శబ్దము విజృంభించినపుడు ఆత్మయే స్థూలమై శబ్దగుణ కాకశముయ్యెను. స్పర్శగుణము కూడా విజృంభిస్తే యింకనూ స్థులరూపకమై శబ్దస్పర్శలను రెండు గుణములు గల వాయువయ్యెను. యిట్లే మిగతా భూతములున్ను, బ్రహ్మాండ పిండాండములుగా ఆత్మయే మారి సమస్త నామరూపాలు చెందెనని భావము. (125)

ప్రశ్న : భర్త చనిపోయిన తర్వాత స్త్రీలెట్లు భర్తసేవ చేయగలరు? వారేవిధంగా వుండవలెను?

జవాబు: భర్త యొక్క రూపము మాత్రము కనబడుటలేదుగాని యీ బ్రహ్మాండమందు మరో రూపంలో యెక్కడో యేదో క్రొత్త పేరుతో నున్నాడని ఆయన జీవించి యున్న కాలములో ఆయనను దైవముగానే యెట్లు తలంచెనో యిపుడును ఆ దైవ స్వరూపుడే అయివున్నాడని భావించి తన యిష్టదైవమును ఆరాధిస్తూ ప్రవర్తనయందు త్రికరణశుద్ధిగా, పరోపకారమైన జీవితమును సాగిస్తూ కాయక, వాచక, మానసిక తపస్సులు చేసుకొంటూ, శేష జీవితము గడపవలెను, గురుభక్తురాలై వుంటే సర్వమూ గురుస్వరూపము భావిస్తూ గురూపాసన చేసికొంటూ లేక సేవాపరాయణమగు దివ్య జీవనము గడుపవలెను. (126)

ప్రశ్న : మానవునికే విద్య ఆవశ్యకమా? అది ప్రాపంచిక విద్యయా పారమార్థిక విద్యయా?

జవాబు : మానవునికి కావసిసినవి 1. భుక్తి 2. ముక్తి, గృహస్తాశ్రమమే శ్రేష్ఠమైనది. భుక్తి కొరకు ఏదో విద్య నేర్చి స్వకాష్టార్జితముపై జీవించుట తప్పనిసరి. ఇక ముక్తి కొరకు బ్రహ్మవిద్య రెండున్నూ అవసరమే. అందు భుక్తిక్రియకై ఆశయందు చిక్కక అవసరమగు ద్రవ్యమార్జించుటకు పొట్టకూటి విద్యయందు నేర్చుటయే ముఖ్యం.

137 ప్రశ్న : మరణ సమయములో గురువు బోధించిన బోధ జ్ఞాప్తికి వచ్చునా? కనుక గత్యంతరమేమి?

జవాబు : గురువు చెప్పిన మంత్రముగాని చూపిన వస్తువుగాని జ్ఞాప్తికి రాకున్ననూ బ్రతికుండగనే ఆరూఢత చెందినవాడు ఏస్థితిలో పోయినా మరల పుట్టడు. ఏలననగా బ్రతికుండగనే గురుబోధ చేతనూ తన కర్తృత్వరహిత కర్మాచరణము వల్లనూ కర్మత్రయ నాశనము కావించుకొనును. కనుక శక్తి యున్నపుడే గొప్ప కృషి చేసి ఆరూఢత గాంచుటే కర్తవ్యము.

138 ప్రశ్న : మనస్సుతో మాత్రమే మంత్రము జపించాలి అన్నారు. నిరంతరం చలించే మనస్సును నిలిపి జపించుట యెట్లు?

జవాబు : 1. మనస్సుతో మంత్రాక్షరములను జపిస్తూ యితరత్రా మనస్సు సంచరించినపుడు దానిని మంత్రము మీదకు మళ్ళిస్తూ అభ్యాసం చేస్తూనే వుండవలెను. యీ ప్రయత్నంలో విసుగు వుండరాదు. పట్టుదల ప్రధానం. 2. మంత్రమును తొందరగా జపించుచూ విక్షేపమునకు అవకాశమీయరాదు. 3. మానసిక తపస్సు - అనగా శత్రువుల యెడకూడా దుష్ట సంకల్పములు లేకుండట,, దురాలోచన విడచుట, ఆశలను కోరికలను విడచి సర్వదా మనస్సు పరిశుద్ధముగావించుకొనుట, అలవర్చుకొనుచూ వీలైనపుడల్లా గురుధ్యానము వైపు మనస్సును మళ్ళిస్తూ వుండవలెను. వాచిక కాయక తపస్సులు, సాత్వికాహారము, శౌచము, ఏకాంతము, పవిత్ర వాతావరణము, సత్సంగము యివన్నియు మానసిక ఏకాగ్రతకు సహాయకారులు అని గుర్తించవలెను.

139 ప్రశ్న : గురుపుత్రుడు లౌకిక వ్యవహారములలో ఎట్లు ప్రవర్తించవలెను?

జవాబు : 1. నిజాయితితో వ్యవహరించవలెను. Honesty is the best policy 2. ఆశకు లోను కాకూడదు.. 3. తన సర్వస్వము గురుమూర్తికి అర్పణ అయినందున స్వార్థము విడచి తన తను మన ధనములకు తానొక ధర్మకర్త మాత్రముగా నున్నానని యెంచుచూ వానిని పరమాత్మ నిర్మిత ధర్మపద్ధతిగా మాత్రమే ప్రవర్తింపచేయవలెను. స్వార్థము విడచుట యనగా కర్తృత్వ త్యాగము. పరిపూర్ణ బోధ యందే యీ కర్తృత్వ త్యాగము సాధ్యమని గ్రహించవలెను.

140 ప్రశ్న : "మమైవాంశో జీవలోకే జీవలోకస్యనాతనః" అని చెప్పబడింది. పరమాత్మ అంశ చేతనే జీవోపాధులైతే, వుపాధి పోతే జన్మరాహిత్యమెట్లు కాగలదు?

జవాబు : జీవోపాధులకు మూలకారణమైన ఆ పరమాత్మ పరిపూర్ణ, పరబ్రహ్మమునందు, గురువాక్యము ద్వారా లేనే లేదని దృఢము చేసుకొంటే అప్పుడు జీవోపాధి యిక మరలకలుగజాలదు. మరణముతో నాశనమగుటలేదు. కనుకనే పరిపూర్ణ బోధ అవసరమైనది.

ప్రశ్న : ఉపాధికి రాకుండుట కేది మార్గము? 141

జవాబు : పరిపూర్ణ రాజయోగమే మార్గము అనుభవించుట వల్ల ప్రారబ్ధ కర్మమున్ను ఎరుక నెరిగినచో సంచిత కర్మమున్ను నశించిపోవుచున్నవి. అన్నిటికి మూల కారణమగు యెరుకయే సకలమునకు కర్తయై యున్నది. ఆ కర్త పరిపూర్ణ పరబ్రహ్మమందు లేనేలేదని దాన్ని విడచుటయే కర్తృత్వ త్యాగమగును. యిట్టి కర్తృత్వ త్యాగ పూర్వకమగు కర్మాచరణ విధానముచే ఆగామి కర్మమున్ను నశించును యీ విధముగ కర్మత్రయము లేకపోవుటచేత, కర్మవలననే జన్మ కనుక, జన్మలేకుండా పోవును.

ప్రశ్న : "ఎంతపాటు పడిననేమి జేసిన 142

అంటనున్న దెంతో నంటునంతే

బొగ్గు పాలకడుగ పోవునా మలినంబు

విశ్వదాభిరామ వినురవేమా"

దీని నిజాభిప్రాయమేమి?

జవాబు : ఈ జన్మలో ఎన్ని పుణ్యకార్యములు చేసిననూ అవి ఈ జన్మలోనే ఫలప్రాప్తికి రావు. తెచ్చుకొన్న ప్రారబ్ధ కర్మఫలితములు మాత్రమే యీ జీవితములో అనుభవమునకు వచ్చును. బొగ్గు ఎంత పరిశుద్ధమగు పాలతో కడిగినా దాని నలుపు ఎట్లు పోజాలదో యీ జన్మలో అనుభవించుటకు తెచ్చుకొన పాపఫలము (దుఃఖము) అనుభవించక తప్పదు. ఈ జన్మలో ఎంత పుణ్యమార్జించినా అది ప్రారబ్ధ రూప దుఃఖానుభవమును తీసివేయ జాలదని భావము. మరిన్ని పుణ్యమెక్కువ చేసి పాపము తక్కువ చేస్తే పుణ్యములో పాపము తగ్గింపబడదు. పుణ్యమునకు ఫలము అగు సుఖమును, పాపమునకు ఫలమగు దుఃఖమును దేనికదే వేర్వేరుగా అనుభవించియే తీరవలెను. అందుచే మిశ్రమ ఫలములు అనగా సుఖదుఃఖములు రెండున్ను గల జన్మలే అన్నియున్ను పూర్తిగా సుఖము గల లేదా పూర్తిగా దుఃఖము గల మానవజన్మయండజాలదు. 143

ప్రశ్న : అనడానికి, వినడానికి కనడానికి గూడ శక్యము గాని దానిని వస్తువన చెల్లునా?

జవాబు : ఆవరణ వున్న యెరుకనే వస్తువన చెల్లును. ద్రవ్య గుణ, కర్మ, సామాన్య, విశేష సమవాయ అభావములనేవి వస్తు లక్షణములు యిట్టి లక్షణములున్ను, పంచభూతములు, దిక్కులు, కాలము, మనస్సు, అనేవి నవద్రవ్యములు మాత్రమే వస్తువులని పేర్కొన నగును. పరిపూర్ణ పరబ్రహ్మయొక్కటియే యీ నవద్రవ్యములలో చేరనిది అదియే అనడానికి, వినడానికి, కనడానికి వీలుకానిది దానిని వస్తువనరాదు. అది వస్తు మద్రహితం ఐనను భాషలో దాన్ని వాడడానికి వేరే శబ్దమేది లేకపోవుటచే దానిని కూడా వస్తువనే మాటతో వ్యవహారార్థము వాడవలసి వచ్చింది.

144 ప్రశ్న : పెక్కుమంది అచల భావజ్ఞులు పరబ్రహ్మమునే పరిపూర్ణమని నుడువుచున్నారు. మీ అభిప్రాయము విపులీకరిస్తారా?

జవాబు : అజ్ఞానులైనవారు ఏమైనా అంటారా. అట్లా అనేవారు అజ్ఞానులే కాని అచల భావజ్ఞులు కారు. ఇతరులనే పరబ్రహ్మము ఎరుకనే కదా మనమంతా అనేది. ఎరుక, పరిపూర్ణములు రెండూ ఒకటి ఎట్లా అవుతాయి? ఇది అదికాదు. అదియిది కాదు అనికదా శివరామ దీక్షిత సిద్ధాంతం పీఠమునుంచి వెలువడిన కందార్థ ప్రతి( ప్రభోధ చూడామణి) అను గ్రంధంలో "బయలెరుకల అత్యంత విభిన్నత్వము" అనే శీర్షిక క్రింది వున్న కందార్థముల విమర్శ చేయవలెను. శ్రుతి ప్రమాణములు కావలసియుంటే "పరిపూర్ణ దర్శనము" గ్రంధము చూడవలెను. అద్వైత్యతులనే పరబ్రహ్మమే. పరిపూర్ణమైతే యిక పరిపూర్ణబోధ అంటూ వుండవలసిన పనేలేదు.

145 ప్రశ్న : కర్మ కర్తృత్వ రహిత విధానమును విపులీకరించగలరు?

జవాబు : ప్రాణుల కన్నిటికి కర్మశరీరము అనగా దేహమున్నంత వరకు కర్మ చేయుట తప్పదు కర్మ చేసిన వారికి ఎప్పుడో యొకప్పుడు దాని ఫలమనుభవించుటయు తప్పదు. కనుక జన్మరహితము పొందవలెనంటే కర్మఫలము నంటకుండా కర్మచేయునుపాయము నన్వేషించుట అత్యంతవసరమైనది.

కర్మ చేయక నూరకుండుట సాధ్యముకాదు. ఏలననగా కర్మేంద్రియముల (అనగా వాక్కు, పాణి, పాద, గుహ్య, గుదముల) పనుల నెట్లు ఏ బలత్కార పద్ధతులతోను ఆపుచేయవచ్చును. అట్లే జ్ఞానేంద్రియముల (శ్రోత, త్వక్కు, చక్షు, జిహ్వ, ఘ్రాణము) వ్యాపారమును కూడా అరికట్టవచ్చును. కాని అంతరేంద్రియములనగా మనోబుద్ధి చిత్తాహంకారముల యొక్క ఆంతరంగిక వృత్తుల నణచుట సులభసాధ్యము కాదు. అంతరేంద్రియ వ్యాపారమును అరికట్టక జ్ఞాన కర్మేంద్రియ, వ్యాపారమును మాత్రమరికట్టినవాడు మిథ్యాచారి అని చెప్పబడుచున్నాడు. అంతరేంద్రియ వ్యాపారము వల్ల సంస్కారములు యేర్పడుచున్నవి. యివియే జన్మకారణములు. జన్మ రాహిత్యమునకు కర్మ సన్యాసము అసాధ్యమేగాక నిరుపయోగమునూ అయివున్నది. నిష్కామకర్మ అనగా ఫలమునాసించకనే కర్మ చేయుట లేక ఈశ్వరార్పరణముగా కర్మలు చేయుట అనగా (కర్మఫలములను శ్రీకృష్ణార్పణమస్తు, లేక తత్సత్బహ్మార్పణమస్తు అని కర్మాంతమందు కర్మ ఫలము ధారపోయుట). కూడా జన్మ కర్మలనుండి విముక్తినీయజాలదు. ఏలయనగా

1. ఏ ఫలము కోరకుండా ఏ పనియైననూ ఎవరైన ఎప్పుడును చేయరుగదా! 2. స్థూల పదార్థమును తేలికగా మరొకరి చేతిలో పెట్టగల్గినట్లు, సూక్ష్మమగు అదృష్టఫలమును మార్పిడి చేయగలరా? 3. అస్తు అంటే అగుగాక అని అర్థము. తత్సత్బహ్మార్పణమస్తు అంటే, కర్మఫలము పరబ్రహ్మమునే చెందుగాక! అంటే చెందిపోవునా? అట్లు చెందింపగల శక్తి

శాపానుగ్రహసమర్థుడైన యే మహర్షికైనా నుండునేమో కాని సాధారణ సాధకునికి సాధ్యమగునా? 4. పుణ్య ఫలమును వదలుకొనుట త్యాగమని పించుకొనునేమోగాని పాపము చేసి ఆ ఫలమును ఇతరులపైకి నెట్టివేయుటకు యేమనవలెను? తాను విషము మ్రింగి ఇతరులు చావవలెనంటే చత్తురా? కర్మఫలము తేలికగా వదలిపోదు. మరియెట్లు? అంటే,కర్తృత్వ త్యాగము, మార్గముగా నిర్ణయింపబడినది.

యీ కర్తృత్వ త్యాగ లక్షణమును చక్కగా వివరించి తెలుసుకోనగును. కర్తృత్వము అనగా ఒక పనిని చేసినందుకు భాద్యత. పంచకారణములు లేనిదే పని జరుగదు. "అధిష్టానం, తథాకర్తా' కరణంచ పృదగ్విధా వివిధాచప్రధక్చేష్టాదెవం చైవాత్ర పంచమం" (భ॥గీ॥) అనగా (1వ అధిష్ఠానము శరీరము (సూక్ష్మ శరీరము లేక అంతఃకరణము) 2. కర్త అంతఃకరణతో గూడినచైతన్యం (చిదాభానుడు = జీవుడు) 3. యింద్రియములు 4. వివిధములగు ప్రాణచలన రూపములగు క్రియలు 5. అధిష్ఠాన దేవతలు. యీ ఐదు కారణములతో పిండాండ వ్యవహారము జరుగుచున్నది. యిందు కర్మ కర్తృత్వమెవరిది? అంతఃకరణతో గూడిన చైతన్యము ప్రధానకర్త అని చెప్పవలెను. ఏలననగా జీవుడే గుర్తెరుగుచు నాకర్మలను యుద్దేశపూర్వకముగా చేయుచున్నాడు. మరి బ్రహ్మాండమందె వరిది కర్తృత్వము? అంటే ఈశ్వరుడని నిర్ణయించవలయును. ఇకపోతే సృష్టి కర్మకు ఆదిలో కర్తృత్వమెవరిది? అంటే సృష్టి సంకల్పము చేసిన బ్రహ్మముదే అయితే జీవేశ్వరులు బ్రహ్మము కంటె భిన్నులు కారు. ఆ బ్రహ్మచైతన్యమే వుపాధిగతమై జీవేశ్వరులనే పేరుతో పిండాండ బ్రహ్మాండములయందు కర్తృత్వము వహించుచున్నది."తేన వినాతృణాగ్రమపి న చలతి" (అనగా దాని సత్తా లేనిచో గడ్డిపరకకూడా కదలదు. ఆ బ్రహ్మచైతన్యమే లేనిచో జీవేశ్వరుల వ్యాపారమే లేదు. ఏది లేకుంటే అసలు కర్మ అనేదే జరుగజాలదో దానినే కర్త అని అనాలి అందుచేతనే కృష్ణదేశికేంద్రులు తమ కందార్థములలో ఆటాడి ఆడకుండును." అనే కందార్థములో "చేటు పాటులచే వచ్చు ఫలము ముమ్మాటికి అనుభవించి మరణ జననములొందు నతడేరకర్తా" అంటూ పరిపూర్ణబోధ రీత్యా సిద్ధాంతము చేసియున్నారు. యీ కందార్థమును, కేవల పిండాండ పరముగా మాత్రమేగాక బ్రహ్మాండ అధిష్ఠాన స్థానముల యందు సమన్వయము గావించుకొనవలెను.

యింతకూ చెప్పదలచినది సర్వకారణమైన బ్రహ్మమే (అఖండ యెరుకయె) కారణకర్తృత్వములు గలదియైయున్నది. దీని రహిత విధానము పరిపూర్ణ బొధరీత్యా ఆరూఢపరచుకొన్న వారికే కర్మకౌశల రూపమైన కర్తృత్వరహిత విధానము తెలిసి నైష్కర్మ్యసిద్ధిరీత్యా జన్మకర్మలు తొలగగలవు.

(146)

ప్రశ్న :మరణ భయము జ్ఞానము వలన కలుగునా? లేక అజ్ఞానము వలన కలుగునా?

జవాబు: మరణమునగా ఎందుకు భయపడెదరో విచారిస్తే యీ ప్రశ్నకు సులువుగా జవాబు

దొరకును సుషుప్తి వలెనే మరణం కూడా ఒక అవస్థవంటిది అని తెలుసుకొంటే నిజంగా మరణమంటే భయపడవలసిన పనిలేదు. 1. మరణసమయమున శరీరముకుండే భాధలను గుర్తించు తెలివి క్షీణించుచుండును. కనుక మరణబాధను సహించలేక పోతామేమోనని భయపడుచుందురు, అనుట సరిగాదు మరిని, మరణబాధ యెట్టిదో యీ జీవితంలో తనకనుభవం లేదు. పూర్వజన్మలలో ననుభవించెను గదా అంటే పూర్వజన్మ జ్ఞానము తనకు లేదు. అంతే కాకుండా, దేశ రక్షణకోసం, ధర్మప్రతిష్ఠాపనార్థము తన ప్రాణములర్పించు త్యాగధనులకు మరణ భయముండునా, లేక ప్రాపంచిక దుఃఖములు భరించలేక ఆత్మహత్య చేసుకోనువారికి ప్రాణభయముండునా!

యిక మరణభయముండును.

1. తన ధన కనక వస్తు వాహనాదులు, గృహారామ క్షేత్రాదులు, కళత్ర పుత్ర పౌత్రాది బంధు వర్గమునందు అభిమాన దృష్టితో రాగము పెంచుకొని, అవన్నియు వదలిపోవలసి వస్తుందేమోనన్న శుద్ధ ప్రాపంచీకుడు (అజ్ఞాని) రానున్న మరణమునకై భయపడుచుండును.

2. ప్రపంచము అందలి పైన వుదహరించిన వన్నియు తనతో సహా సర్వమూ అశాశ్వతమే సర్వమూ దుఃఖమయమే కనుక నాకిక మోక్షమే కావలెను. అని దృఢంగా కోరుకొనుచు అందుకు తగిన సాధనలు చేయుచూ ఆ సాధన లింకనూ సంపూర్తి కాలేదే యీలోగా చనిపోతే అన్ని వుపాధులలో శ్రేష్ఠతమమైన మానవోపాధి మరల కల్గునో లేదో యేనీచయోని ప్రాప్తికలుగునో మరణమాసన్నమగుచున్నదే తుదిఘడియలలో దైవచింతన వుండునో లేదో యని పరీక్షిన్మహారాజు వంటి వుత్తమాధికారులు భయపడుచుందురు. కనుక అజ్ఞానికి, జ్ఞానికి కూడా మరణభయముండును. కాని గురుకృపకు పాత్రుడై యీ జీవితమందే పరిపూర్ణ బోధనారూఢపరచుకొన్నవాడు అజ్ఞానీ కాడు, జ్ఞానీకాడు అతనికి మరణభయము, పునర్జన్మ భయముగాని ఏమీలేదు.

ప్రశ్న : శ్రీ సదానంద రాజయోగిగారు రచించిన ద్వాదశ కందార్థములలో• "సామము, దానము, బేధము. యీ మూడును వ్యర్థమాయే యిక నీ యెడలన్ యీమారు దండనంబే, భూమాః కన్నీటియేట ముంచెత్తవలనా? పన్నీటి ధాటి సొక్కించవలెనా? నీ మేను దూలింతు నిట్టూర్పుగాడ్పులో సుమగాత్ర! సురటీల సుడిగాలి కెరటాల ముంచెత్తవలెనా? పన్నీటి ధాటి సొక్కించవలెనా!" అన్న కందార్థం పూర్తిగా వివరించకోర్తాను.

జవాబు : గురుభక్తుడు, గురుని యొక్క సగుణ నిర్గుణ రూపములను తన మనస్సులో ధ్యానమునందు ధారణచేయకోరి ఆ స్వరూపమునందు ఏకాగ్ర బుద్ధిని సాధించలేక తన గురుమూర్తిని నిందాస్తుతి రూపంలో ప్రార్థనచేయుచున్నాడు. దేనికైననూ సామ, దాన, బేధ, దండ వుపాయములని నాలుగు మార్గములున్నవి. మొదటి సామ పద్ధతిచే తన మనస్సును దేవాలయంగా చేసుకొని అందు నిలువమని ప్రార్థించినాడు. అటులుండనిచో యీ

శూన్యదేవాలయమగు మనస్సు నాకక్కరలేదు. తీసుకొని నీ యిష్టం చేసుకోమన్నాడు. ఊహు! గురుమూర్తి వినలేదు. యిక రెండవ వుపాయమగు దానముచే లోభపెట్టదలచుకొని నా మనోబుద్ధి చిత్తాహంకారములు నా శరీరాత్మలు నా ప్రాణములు, నా కీర్తి ప్రతిష్టలు మొదలగు నా సర్వస్వములో ఏది కావాలంటే అది లంచంగా యిస్తాను తీసుకోమన్నాడు. లేదా రమ్మంటే నీ కూడా వచ్చేస్తాను అన్నాడు శిష్యుడు. ఉహు! గురుమూర్తి లోభపడలేదు. పిదప మూడవ ఉపాయమైన బేధోపాయమును ప్రయోగించినాడు. నాపైన నీ కృపా ప్రసాదమనుగ్రహించక తప్పదు. అనుగ్రహించికపోతే నీ గురుమూర్తి ఎదుట నీపైన ఫిర్యాదు చేసి దావా చేస్తాను. నీ గురువు నీపై తనకున్న వాత్సల్యముచేత నా దావా కొట్టివేస్తే వారి తీర్పుపై నీ పరమగురువుగారి ఎదుట అప్పీలు దాఖలు చేసి నెగ్గుతాను. ఎప్పటికైన నీకు తప్పక శిక్ష విధించేటట్లు చేస్తాను. ఆ శిక్ష యేమందువా అజ్ఞానాంధకార పూరితమగు నా హృదయమనే చెరసాలలో నిన్ను ఖైదు చేయిస్తాను. జాగ్రత్త అన్నాడు. ఉహు! గురుమూర్తి ఏమీ లొంగిపోలేదు. అపుడు చరమోపాయమగు దండోపాయమును ఈ కందార్థరీత్యాప్రయోగిస్తున్నాడు. దీని తాత్పర్యము సామదానబేధోపాయములచే నీవు లొంగలేదు కనుక యిక నీకు దండన విధిస్తున్నాను. కాని నీవు పువ్వువంటి మృదువైన శరీరము గలవాడవు పన్నీటిబుడ్డి తెచ్చి విసురుగా నీపైన జల్లుతూ పూపిరాడకుండా ముంచెత్తి వేస్తాను. లేదా నా కన్నీటిధారలచే యేర్పడిన ప్రవవాహంలో నిన్ను ముంచివేస్తాను. నీ శరీరమును నా వేడి నిట్టూర్పు గాడ్పులలో శోషింపచేసి నిలబడలేకుండా చేస్తాను సుడిగాలియేర్పడేటట్టుగా సురటీలు వేగంగా విసరి సుడిగాలి కెరటాలలో మునకలు వేయించేస్తా పువ్వువంటి శరీరంగల నీవెట్లొర్చుకోగలవో చూస్తాను. అని యీ కందార్థభావన.

ప్రశ్న : ఎ) "తనకు దావచ్చి సద్భోదను తెల్పుమటంచు మ్రొక్కుతన శిష్యునకున్ వినజెప్పదొడగె" అన్న కందపద్యములో శిష్యుడు సాధనలు చేసి వచ్చినవాడు కాదని తెలియుచున్నది. బి) సాధనలు చెప్పి శిష్యుల బాధలు పెట్టేటి గురునిబాట వదలి" అను కందపద్యములో సాధనలు గూర్చి శిష్యుడు అడుగగనే ఈ పద్యము చెప్పెను కదా? సి) "అష్టాంగయోగముల అతికష్టించె ప్రజలవలెనె కష్టించక" అనిన్ని గురుడు చెప్పెను కదా? మీరు శిష్యునికి సాధనలు గూర్చి కందపద్యములో ఎందుకు చెప్పలేదు? సాధనల చేతనే ఎరుక సాధించదగినపుడు గ్రంథము మొత్తము అందరకూ ఉపయోగించుట కొరకే గదా! ఎరుక ప్రకరణ మందైననూ సాధనలగూర్చి తెలుపలేదేమి?

జవాబులు : ఎ) "తన శిష్యునకున్" అని ఆ కందపద్యములో అనుటచేత వచ్చినవాడు ఇదివరకే తన శిష్యుడై యున్నాడని రూఢిగా తెలియుచున్నది. ఆ శిష్యునకు ఇదివరకే కొంత బోధజరిగేయుండునని ఊహించుటమూ సమసంజసమే. అవిన్నబోధ వలన భ్రాంతి రహితము కాకున్నందుననే, తిరిగి వచ్చెననియు తన శిష్యుడు సచ్ఛిష్యుడు గనుకనే గురుడు ఏ విధమైన అనుమానమూ లేక వానికి బోధించబూనెననియు ఈ కందపద్యము వలన స్పష్టమగుచున్నది.

కనుక కందార్థములలో వలెనే వచ్చిన శిష్యుడు సాధనలచే పొందదగిన ఫలితార్థరూపమగు సంపత్తి పొందియున్నవాడే అని అనక తప్పదు.

బి) శిష్యుడు గురుని సాధనల గూర్చి అడుగగనే "సాధనలు చెప్పి శిష్యులబాధ పెట్టేటి బాట వదలి" అన్న కందపద్యం "అష్టాంగయోగముల అతి కష్టించే" అన్న కందపద్యమును చెప్పినట్లుగా మీరు అభిప్రాయపడినారు, కాని అది ఎంతమాత్రమూ సరికాదు. సాధనలు గూర్చి శిష్యుడు కందపద్యములలో ఎక్కడను అడుగనే లేదు, అయితే గురుడు ఎందుకీ పద్యము చెప్పినాడు? అని శంకింతురేమో? లోకములో కష్టములతో కూడిన అనేక యోగమార్గములు, జ్ఞాన మార్గములు గానవచ్చుచున్నవి. ఆ మార్గములు అనుసరించు వారివలె నీవు కష్టించవద్దు గురూపదిష్టమగు ఈ పరిపూర్ణ రాజయోగమార్గమందు, కృషిచేయుము చాలు అని గురుడు ఉద్బోధించి యున్నాడు.

పరిపూర్ణ బోధ ముఖ్యాధికారికే చెప్పవలెను కాని, ఆత్మ సాక్షాత్కారరూపమగు సంపత్తి లేని వానికి చెప్పరాదు. కందార్థ కందపద్యములన్నియూ అట్టి ముఖ్యాధికారి కొరకే చెప్పబడినవి. కాని ఈ దినములలో అట్టి ముఖ్యాధికారి లభించుట చాల దుస్తరము. కనుక ముఖ్యాధికారి కాని వారికి సులభోపాయ పద్ధతులచే ఆత్మవస్తునిశ్చయము గావించి, పిదపనే పరిపూర్ణ బోధ చెప్పవలసియున్నది. ముఖ్యాధికారికి చెప్పబడిన కందార్థకందపద్యములలో ఆత్మవస్తునిశ్చయ పద్ధతులు చెప్పలేదు. అవి అన్నియు శిష్యుని అధికార తారతమ్యమును బట్టి గురుడు విధించెను. అనుష్ఠానము, ఆచరణ, ప్రబోధలతో కూడిన సులభోపాయములే కాని కష్టప్రదమగు యోగసాధనలు కావు.

సి) ఆత్మ జ్ఞానము బోధరూపమున రాదా? అని మీరు ప్రశ్నించినారు. కలుగును కాని అది వాచాజ్ఞానమే. అనుభవ జ్ఞానము కాదు. అనుభవ జ్ఞానము కలవాడు కాని ఎరుకను వీడలేడు, అంగట్లో బెల్లమున్నది. అది గుడిలో దేవుడికి నివేదిస్తున్నాను. అంటే ఎంత ప్రయోజనమో, బోధ మంత్రము చేతనే ఎరుకయొక్క స్థానస్వరూప స్వభావములు విని అర్థము చేసుకొనుటవల్ల ఇంతమాత్రమే ప్రయోజనము. రోగమును కుదుర్చు ఔషదము పేరు, లభించు స్థానము, దాని రంగు ఆ మందు సేవించిన వాడు చేయు పత్యము అన్నియూ తెలుసుకొని ఆ మందు సేవించక ఆ పత్యము చేయకనుండు వానికి ఆ రోగమెన్నడైననూ కుదురునా? అట్లే కేవలం బోధ మాత్రంచేత ఏమీ ప్రయోజనం లేదు. బోధ తనకు అర్థం కావచ్చును, ఇతరులకు చెప్పగలగనూ వచ్చును కాని తను తరించవలెనన్న గురూపదిష్ట మార్గమున పయనించి, అనుభవము చెందినవాడే పరిపూర్ణబోధ వినుటకు అధికారి వాడు మాత్రమే ఎరుక వీడగలడు. ఎరుక లేక సేవింపగలడు.

ప్రశ్న : **సుషుప్తి యందు మనస్సు మగ్నత చెందిన ప్రాణము నిలకడ చెందుట లేదు. దేని సత్తా చేత అది ప్రవర్తిల్లుచున్నది? దాని రహితమెట్లు?**

జవాబు : బ్రహ్మాండమందున్న ప్రాణము వ్యష్టి శరీరముల యందలి ప్రాణమును నిరంతరము ఆకర్షించుచుండును. ఈ ఆకర్షణ శిశువు ఉత్పత్తి అయిన వెంటనే ప్రారంభమగుచున్నది. వుచ్ఛ్వాస నిశ్వాసలలో నిశ్వాసరూపముగా ఈ ఆకర్షణచేతనే ప్రాణము బయటకు నడచుచున్నది. వ్యష్టి శరీరముల యందలి ప్రాణశక్తి అట్లు బయటకు పోయిన ప్రాణమును లోపలకి ఉచ్ఛ్వాసరూపముగ తిరిగి ఆకర్షించు కొనుచున్నది. ఈ విధముగా మరణపర్యంతము జరుగుచునే వుండును ప్రాణము ఆగినచో మరణమే. తిరిగి వచ్చే పద్ధతిగా ఉండేది సమాధి శరీరములో ప్రాణశక్తి వున్నంత వరకు వ్యష్టి ప్రాణశక్తి పనిచేయుచునే వుండును ప్రాణ శక్తి క్షీణించి పోయిన పిదప బయటకు పోయిన ప్రాణమును ఇక లోపలకు లాగుకొనుటకు ప్రాణశక్తి ఏది? ఇదే మరణము. వ్యష్టి ప్రాణము అని ఎప్పుడు అందురు? ఎంతవరకు తన ప్రత్యేక సంస్కారము నిలిచియుండునో అంతవరకు ఆ సంస్కారములతో కూడిన ప్రాణము వ్యష్టి ప్రాణము అనబడును. ఆ సంస్కారములు నశించినచో ఇక వ్యష్టి ప్రాణము లేదు. అపుడు వ్యష్టి సమిష్టులు ఏకమై బ్రహ్మాండైక్యము అనబడుచున్నది. అంతవరకు వ్యష్టి ప్రాణము రహితము కాదు.

ప్రశ్న : **గురువు ఆజ్ఞ ఇవ్వనిదే గురువులయ్యిన వారి స్థితి ఏమి?** (150)

జవాబు : వారికి స్థితి ఎన్నడు లేదు. కలుగదు. గతియే కలుగును. అది సద్గతికాదు. దుర్గతియే "మృత్యోస్యమృత్య మాప్నోతి" అన్న విధముగా మరణమునుంచి మరల మరల మరణము చెందుచూ అనగా జన్మ పరంపరలను పొందుచూ అధోగతి చెందవలసినదే. వీరిని గురించియే శ్రీకృష్ణదేశికేంద్రులవారు "గురువు ఆజ్ఞ ఇవ్వనిదే గురువై శిష్యుల గూర్చు గురువంచకుని యొక్క మార్గము ఛీ ఛీ తలచరాదా మార్గము ఛీ ఛీ "అని పరమ నీచముగా వారిని పేర్కొనినారు. అట్టివారు తాము చెడినదే గాక లోకమునే చెరచుచున్నారు. అట్టివాని మొహము చూచినచో పంచమహాపాతకములు చుట్టుకొనును.

ప్రశ్న : **మంత్రములు గ్రంధములలోనే లభ్యమగుచుండగా, ఆ మంత్రములనే గురువుద్వారా ఎందుకుపదేశం పొందవలెను?** (151)

జవాబు : ఎందుకనగా 1) గురువామంత్రమును చాలా కాలముగా జపించి మంత్రసిద్ధిని పొందియుండును. ఉపదేశకాలమున గురువామంత్రశక్తిని కొంత శిష్యునికి ప్రసాదించగలడు.

2) మంత్రములు మాత్రమే యుండును కాని మంత్రార్థ, మంత్రమూల, మంత్రరహస్యములు, వస్తునిశ్చయ విధానం, యితర గురుగోప్య విషయములు, గ్రంధములయందుండవు గురువే తెలుపవలెను.

3) గురుమంత్రము, మర్మమున్ను, ఆ మంత్రానుష్ఠానము, తదనుగుణ్యమగు ఆచార విచారములు, ధర్మమున్ను అగును, గురువు లేనిచో మర్మము తెలిసికొన్నా ధర్మము తెలియదు.

4) ఇతరులు, ఈశ్వరకృప అను దానినే గురుభక్తులు, గురుకృపయందురు. ఈ గురుకృపా ప్రసాద సిద్ధిచాలా ముఖ్యము. "అపరోక్షమౌనే మనుజులకు పరోక్షంబైన బయలు గురుకృపలేకన్" "అనిన్ని ఎరుకదనకు దావీడిపోదు ఎరుకను విడిపించలేరు యెవ్వరు ధాత్రిన్" అను కందార్థములు చూడనగును. గురుకృప లేనిచో కుక్క ఎంతబలసినా గోనె బస్తాలు మోయజాలనట్లు ఎంత జ్ఞానమున్నా వృధాయే.

(152) ప్రశ్న : **ఎరుకకు మరపు సహజమంటారు అనుభవంలో అట్లులేదు. ఎప్పుడో చాలకాలం క్రితం చూచిన విషయాలు ఇప్పుడు జ్ఞాపకముండుటలేదా?**

జవాబు : ఎరుక మరపులనగా, జ్ఞాపకముంచుకొనుట, మరచిపోవుట అను సంకుచితార్థంలో యిక్కడ గ్రహించరాదు. (అఖండరూపమగు ఎరుక మరపులను వస్తునిశ్చయ రూపంగా గురువుచేగ్రహించిన వారికి ఆ యెరుక కా మరపు ఎట్లు సహజమో తెలియగలదు) గురువుయొక్క ఆవశ్యకత ఇక్కడనే ఋజువగుచున్నది. ఐననూ చాలాకాలంక్రితం చూచిన విషయాలు కూడా జ్ఞాపకముండుటయు, ఉండుకపోవుటయు (అనగా మరచిపోవుటయు) రెండు అనుభవంలోనివేకదా! ఏది జ్ఞాపకముంచుకొన్నదో, అదే మరచుచున్నది. జ్ఞాపకముంచుకునేది ఒకటి, మరచేది ఒకటీ, రెండులేవు గదా! కనుక ఎరుకకు మఱుపు సహజమేనన్నారు.

(153) ప్రశ్న: **సృష్టికి మూలము స్త్రీయా? పురుషుడా?**

జవాబు : సృష్టి కారణ వస్తువునకు లింగబేధము లేదు. పురుషుడనీ ప్రకృతియనీ పెట్టబడ్డపేరు కేవలం ఔపచారికంగా మాత్రమే చెప్పబడ్డాయి. జ్ఞానస్వరూపమగు బ్రహ్మము పురుషుడుగాను త్రిగుణరూపమగు ప్రకృతి స్త్రీగాను అలంకారికంగా వర్ణించారు. ఈ రెండింటి తేడా ఏమనగా పురుషుని యందు త్రిగుణములు బీజరూపంగా నున్నవి. ప్రకృతి యందా ఆ త్రిగుణములే వికాసము చెందియున్నవి. ఒకటి జ్ఞానరూపము, రెండవది అజ్ఞానరూపము, సృష్టి కారణమును పూర్తిగా యెరుంగగోరినచో పరిపూర్ణ దర్శనములోని సృష్టి విజ్ఞాన ప్రకరణము చదువగోరెదను.

(154) ప్రశ్న : **"ఉపాసకానాం హితర్థాయాబ్రహ్మణో రూపకల్పనా" అనగా భక్తుల సౌఖ్యముకొరకు బ్రహ్మమునకు రూపకల్పన జరిగెను. నిర్గుణపరబ్రహ్మము ఎట్లు విచారించి రూపకల్పన జరిపినది?**

జవాబు : రూపకల్పన జరిగించనదెవరు? బ్రహ్మమా 2) తదితరులా! అని రెండు వికల్పములు ఏర్పడుచున్నవి.

మొదటిపక్షంలోనే మీకు శంక గల్గినది. ఒకప్పుడు నిస్సంకల్పస్థితిలో నుండేది, మరొకపుడు సంకల్పరూపము చెందేది ఆ స్వప్రకాశ బ్రహ్మమే. సృష్టికి పూర్వం నిస్సంకల్ప స్థితిలో నున్నదానికి "సోఽకామయత బహుస్స్యాంప్రజాయేయ" అని సృష్టికామన కల్గినది. అది అఖండ

జ్ఞానస్వరూపము, సర్వశక్తివంతము. దానికింద్రియములపసరంలేదు. ఈ అత్యంతాద్భుత రూపమగు సృష్టి రచనగావించిన బ్రహ్మము తన నిర్గుణ రూపమునుండి సగుణ రూపం చెంది నామరూపాలు వహించి ఉపాసకుల కందుబాటులోనికి రాజాలదా? ఈ సందర్భంలో "అన్నియు తానై తనకవి పన్నుగవేరనుచునాకోట బల్కుచు" అను కందార్థము చూడవలెను. ఎందుకావిధంగా అన్నియు తానే అయినది?" ఈ ప్రశ్నకది సమాధానం చెప్పదు. మనమే వూహించాలి "లీలాదేవతు కైవల్యం"- అది యొక లీలావినోదమన్నారు కొందరు భక్తులు మా యందు ప్రేమచేతనే మా హితము కోరి రూపకల్పన గావించుకొన్నదన్నారు మరికొందరు.

రెండవ పక్షంలో ఆ నిర్గుణ బ్రహ్మము బ్రహ్మ విష్ణ్వాది రూపములు దాల్చనేలేదు. నిర్గుణపరబ్రహ్మమునందు మనస్సు నిల్పలేని మంధాధికారుల సౌలభ్యం కొరకు అనగా మనస్సు నిలుపుటకు యోగ్యమైన నామరూపాలు ఆ బ్రహ్మమునకు కల్పించి మహాత్ములు పురాణాలు వ్రాసినారు. ఎవరు కల్పించినా, నామరూపాలు మాత్రం మిథ్యయే.

(155)

**ప్రశ్న : జ్ఞేయశబ్దము పరిపూర్ణమునుసూచించునా? లేక ఎరుకను సూచించునా?**

జవాబు : మీరభిప్రాయపడిన విధముగా జ్ఞేయ శబ్దము ఎరుకనే సూచించును కాని పరిపూర్ణమును సూచించదు. జ్ఞత, జ్ఞాన, జ్ఞేయ రూపమగు త్రిపుటి ఎరుకయేగదా!

**ప్రశ్న : కోటి శరీరముల,చేతనైనా ఎరుకవలన పరిపూర్ణమును సాధించట అసంభవమైనపుడు పరిపూర్ణము ప్రత్యక్షమని అనవచ్చునా?** (156)

జవాబు : కోటి శరీరములచేతనైనా సాధ్యంకాదు. 1) నిజమే ఏలననగా సాధకుడు, సాధన, సాధ్యము (లేక సిద్ధి) యీ మూడును గూడా త్రిపుటయే గనుక యెరుకలోనివే (2) ఇదివరకు లేనిదైతే క్రొత్తగా దానిని సాధించవలయును. పరిపూర్ణము ఎప్పుడున్ను స్వతస్సిద్ధమయ్యేవున్నది. 3) సాధన అనునది కర్మరూపము అనగా పనిచేయు విధానమునకు సంబంధించినది. కర్మఫలములు నాలుగు (1) ఉత్పత్తి (2) ప్రాప్తి (3) వికార్యము (4) సంస్కారము అనునవి, పరిపూర్ణము వుత్పతి, చేయబడునది గాని క్రొత్తగా ప్రాప్తించునది అని ఏ మాత్రము అనుటకు వీలు లేనిది (4) కందార్థము "పుట్టు గిట్టుట లేకను పుట్టే గిట్టేటి యెరుక పోడి మెరుగన్ చట్టువలె కదలకుండను. బట్టబయలు ఇట్టిదెరిగి భావింపదగును. ఎరుకలేక సేవింపదగును' అను కందార్థాన్ని చక్కగా విచారించవలెను. శిష్యునికి బోధ దృఢమయ్యే పర్యంతము ఎరుకచేత భావింపవలెనన్నారు. ఈ భావనవల్ల ఎరుక రూపుడైన తాను పరిపూర్ణ బ్రహ్మ కాజాలడని మాత్రము తెలియుటయే ప్రయోజనము. ఎరుకలేక సేవించవలెనన్నారు. అనగా పరిపూర్ణమందెరుకలేదు కనుక, తానున్నంతవరకు పరిపూర్ణ ప్రసక్తియె యందజాలదు. తానుండి పరిపూర్ణ పరబ్రహ్మముందనికూడా నోట పలుకుటకు వీలులేదు. ఎరుకైన తనయొక్క రహితస్థితియందే పరిపూర్ణ పరబ్రహ్మము నిశ్చయము అని తెలియవలెను. అందుకే

కందార్థములో ఎరుకలేక సేవించవలెనన్నారు. సాధనాంతర నిరపేక్షమని అందుకే దానికి పేరున్నూ వచ్చినది. కనుకనే కోటి శరీరాలచేతనైనా సాధ్యం కాదని దీక్షితులవారన్నారు.

మనోవాక్కుల కతీతమగునది గనుక పరిపూర్ణము ప్రత్యక్షమని గాని, అనుమానమనిగాని, అపరోక్షమనిగాని, పరోక్షమనిగాని, సత్యమని గాని, అసత్యం అనిగాని ఏ శబ్దము చేతను పలుకరాదు. శబ్దములన్నియుసాపేక్షికములే. కేవల నిరపేక్షక శబ్దాలంటూ లేనేలేవు.

పరిపూర్ణము తప్ప మరొకటి ఏమిలేనే లేదు. కనక పరిపూర్ణమును ఏదైనా ఒక శబ్దము చేత వర్ణిస్తే, ఆ శబ్దమునకు ప్రతియోగి శబ్దం చేత నిరూపితమగు మరియొక వస్తువున్నదని అంగీకరించవలసిన అగత్యం ఏర్పడుతుంది. కనుకనే పరిపూర్ణము ఏమనీ యనరానిది. తెలిసిననిగాని, తెలియలేదనిగాని, వాని ప్రతియోగి శబ్దములుగాని ఏమాత్రం పనికిరావు. అయితే యీ శబ్దములన్ని ఎందుకు ప్రయోగించినారు? అంటే కేవలం వ్యవహారార్థము మాత్రమే ఎదోరీతిగ చెప్పుట తప్పనిసరియై చెప్పినారన్నమాట.

**ప్రశ్న : పరిపూర్ణమునకు అస్తిత్వము కలదా? లేదా? భాగవతుల కృష్ణదాసుగారు "గురుడు పరిపూర్ణమును జూపి.......... అను కందార్థములో" పరిపూర్ణమును దర్శించనిది యొరుక్క పోదని వ్రాసినారు ఎట్లు?**

జవాబు : శ్రీ కృష్ణదాసుగారి కందార్థములో వ్రాయబడినది సిద్ధాంతమే. పైప్రశ్నకిచ్చిన జవాబులో తెలియపర్చబడిన రీతిగా అస్తి - నాస్తులు రెండున్నూ సావేక్షిక పదములే, అస్తి శబ్దమునకు ప్రతియోగి నాస్తి శబ్దమేగాని నాస్తికముకాదు. ఏలననగా నాస్తిక మనగా వేదములయందు ప్రమాణబుద్ధి లేకపోవుట. నాస్తి అనగా వునికిలేనిది అస్తిత్వము లేదని అర్థము అట్లన్నచో పరిపూర్ణ బ్రహ్మమున కునికియే లేదనుట యగును. కేవలమగు పరిపూర్ణ పరబ్రహ్మమును ఏ సాపేక్షక శబ్దమును వివరింపజాలదు. నరునినోట యెంగిలి కానిదొక్క పరిపూర్ణ పరబ్రహ్మము. కనుక పరిపూర్ణ పరబ్రహ్మము అస్తి నాస్తులు గానిది యనవలెనేగాని అస్తియని గాని నాస్తియనిగాని అనరాదు.

అస్తిత్వము కలదన్నచో కనబడవలయును. అని మీరన్నారు యిది సరికాదు. వాయువు. ఆకాశము, జీవుడు, ఈశ్వరుడు, ఆత్మ పరమాత్మ యిత్యాదులేమీ కనబడుటలేదు. అంతమాత్రం చేత వానికస్తిత్వం లేదని యనవచ్చునా? ఐతే (ఒక్కదృష్టితో మీరామాట అనియుంటే ) అపుడది సిద్ధాంతమే! ఎట్లనగా పంచేంద్రియాలలో దీనిచే తెలియబడినా లేక మనషష్ఠాంద్రియాణి" అని చెప్పబడ్డ ఆరవ యింద్రియమగు మనస్సుకు తెలియబడినా, ఎరుక చేత యెరుగ బడినా అది కనబడినట్లే. ఈ చెప్పబడ్డవానిలో దేని చేతను పరిపూర్ణ పరబ్రహ్మము గోచరించుటలేదు. కనుక దానిని అస్తిఅని అనుటకు వీలు లేదు. యిక అన్వయ వ్యతిరేకములచే మనస్సుకుగాని, యెరుకుగాని గోచరిస్తోందో అది అస్తి పదార్థము అనవలెను. పరిపూర్ణము నాస్తి అనవచ్చునా? మరిన్ని పైన చెప్పిన పనిముట్లు అన్నిటికి

మూలకారణమగు మూలంలేని యాగుర్తెరిగే శరీరమే యేమిూతేనపుడు. దేనిని అస్తి అంటాము? ఉన్నదొక్క పరిపూర్ణ పరబ్రహ్మము. అన్యంలేనే లేదు. దానిని అస్తి అనిగాని నాస్తి అనిగాని అనే వారెవరు?

ఆత్మాతీతం కేవలాత్మా, దేహో నాస్తి కదాచన
ఆస్తినిస్తీతికో వేద? నిర్ణమినాస్తి సర్వదా
నిర్ణయమే మహాపాపమన్నారు దీక్షితులవారు.

మిూరెత్తుకొన్న కందార్థములో "గురుడు పరిపూర్ణమును జూపి అన్నపుడు, పరిపూర్ణం దృశ్యకోటిలో చేరదా చేరితే నశ్యత్వమే యగును కదా? అను ప్రశ్నలు యద్దృశ్యం తన్నశ్యం' ' అని మిూరు వ్రాయుటలో గర్భీకృతమై యున్నవి కృష్ణదాసుగారే మరొక కందార్థములో "లేదనకు యున్నదవిగో నేతెల్సితి ననకు దాన్ని నీవెరిగేవా? కాదది నీచే తెలియను ఏదిరా తన్మాత్రసమితి యీ బట్టబైటా. దీనికి సాటిదేది యెచ్చోటా: వాదేల లేనెరుకతో దీన్ని కనిపెట్టిపోదొట్టు యెరుక నింకేది బట్టదు చాలు" నన్నారు. ఇందు లేనెరుకతో దానిని కనిపెట్టమన్నారు. ఇట్లనుటలో ఆ వినే శిష్యుడు లేనెరుక స్థాన స్వరూప స్వభావములను గుర్తెరిగి అనగా స్వరూప స్థితిలో నిలచి లేనెరుకతో దానిని గనిపెట్టగల యుత్తమాధికారి యన్నమాట అట్టి స్థితిలో నున్న వానికి గురుడు చూపెననీ, శిష్యుడు చూసెనని భావము అట్లు చూపబడినది. దృశ్యమని యనదగునా? ద్రష్టయే లేని లేనెరుక స్థితిలోని మాట అది. చూచేవాడు లేనపుడు వానికి చూపెక్కడిది. చూడబడేది ఏమి? కనుక అపుడు చూడబడినది అని చెప్పబడేవి దృశ్యకోటిలో చేరదు. ఈ పత్రికా ముఖముగా యింతకంటె విపులంగా చర్చించుట ధర్మపద్ధతిగాదు. యివన్నియు గురుశిష్య న్యాయముగా శిష్యుని కారూఢము కావలసిన విషయములు అని తెలియవలెను.

**ప్రశ్న : బ్రహ్మాండైక్యము చెందుట అనగానేమి? బ్రహ్మాండైక్యము చెందినవారు తిరిగి పుట్టుదురా?** 158

జవాబు : జన్మ కారణమైన వస్తువును జీవించి యుండగనే పరిపూర్ణ బోధయందు ఆరూఢులైనవారు లేకుండా చేసుకొనగల్గుదురు. అట్టివారి శరీర పతన కాలమున జరుగునది ఏమంటే ఉచ్ఛ్వాస నిశ్వాసరూపముగా సంచరించు వాయువు మాత్రము బ్రహ్మాండమందలి అనంతవాయువులలో ఐక్యమై పోవును. ఇదియే బ్రహ్మాండైక్యము. నది జలములు సముద్రములో ఐక్యమైన పిదప తిరిగి వానిని విడదీయరాదు. అట్లే నిర్జీవమైపోయిన వారి వ్యష్టి ప్రాణము తిరిగి ఉపాధికి రాదు. 159

**ఈ క్రింది వానిని వ్యాఖ్యానము చేయకోర్తాము :**

1) **కర్మవల్ల జన్మ** 2) **విత్తుతీరు చెట్టు** 3) **సహవాసేన గుణాభవంతి** 4) **యద్భావం తద్భవతి** 5) **పూర్వజన్మ సుకృతం** 6) **పుట్టుఛాయ లేని (పట్టుఛాయలేదు)**

జవాబులు : 1) కర్మవల్ల జన్మ: కర్మ అనగా పని. ఏ పని చేసినా దానికొక ఫలము వుండి తీరును. ఆ ఫలం స్వల్పమో, అధికమో, దృష్టమో అదృష్టమో చేసిన పనిని బట్టి ఉంటుంది ఉండును గాని, ఎట్టి ఫలితము లేని పనియంటూ ఉండదు. కర్మలు ముఖ్యంగా 3 విధములు 1) శారీరకర్మ 2) వాచికకర్మ 3) మానసిక కర్మ. ఈ మూడు కర్మలు కూడా ఎంత స్వల్పముగానైనను ఫలితము ఉండునుగాని ఫలితము లేని కర్మ ఉండదు. వెంటనే ప్రత్యక్షముగా కానరానపుడు అది అదృష్టఫలమని చెప్పవచ్చును. ఒకడు ఒక దొంగతనము చేసినవాడు. ప్రజలుకుగాని ప్రభుత్వమునకు గాని పట్టుబడక తన నేరమును కప్పిపుచ్చెననుకొందము. పట్టుబడెనేని కారాగారశిక్ష పొందియుండును. అది దృష్టఫలమనబడును. పట్టుబడకపోయినచో అతడు చేసిన పాపకార్యములకు ఎట్టి శిక్షయును అతడు పొందలేదని, ముందెప్పుడు పొందడనీ చెప్పుటకు వీలులేదు. ఈ జన్మలో కాకున్న ఏదో మరియొక జన్మలోనైనా అతడు శిక్ష అనుభవించవలసియుండునే కాని ఎప్పుడో ఒకప్పుడు అనుభవించక తప్పదు. పుణ్యకార్యములు చేసినపుడు అట్లే ఫలితములనుభవించవలసియుండును. తాను చేసిన సత్కర్మల ఫలితముగా అతనికాజన్మలో ఎట్టి సుఖమును కలుగకపోవచ్చు పుణ్య కర్మలకు సుఖమును, పాపకర్మలకు దుఃఖమున్ను ఫలితములు. మానవుడు చేసిన పుణ్యపాప కర్మలు ఎన్నియో అదృష్టఫలములను (ఈ జన్మలో ఫలితమునీయకుండా ఉన్న కర్మలు) సుఖ దుఃఖరూపముగా అతడు ఎప్పుడో ఒకప్పుడు అనుభవించక తప్పదు. అనుభవించిననే కాని అదృష్టఫలములు ఊరక నశించవు. ఈ జన్మలో అనుభవించిని యెడల మరియొక జన్మలోనైనా అనుభవించి తీరవలసినదే. (అవశ్యమను భోక్తవ్యం పూర్వకర్మ శుభాశుభం) అనగా వెనుక చేసిన కర్మఫలం అవశ్యము అనుభవించి తీరవలసినదే! ఈ జన్మలో కాకున్న మరియొక జన్మ ఎత్తియైన తాతాచార్యులుగారి ముద్ర భుజము తప్పినా వీపు తప్పదనుట్లుగా అనుభవించితీరవలసినదే కనుక జన్మకు కారణము కర్మయే అని చెప్పబడ్డది. కర్మమున పుట్టుజంతువు కర్మముననను వృద్ధిపొందును, కర్మమున చెడున్ అని భారతములో చెప్పబడినది. Action reaction are equal and opposite అనగా ప్రతీ క్రియకు ప్రతిక్రియ ఉండితీరును. ఆ ప్రతిక్రియయే కర్మఫలము.

2) **విత్తుతీరు చెట్టు**: ఏ విత్తనము నాటుదుమో ఆ చెట్టే మొలచునుగాని మరియొక చెట్టు పుట్టదు. వేపగింజనాటితే మామిడిచెట్టు పుట్టదు. అట్టే మనిషికి మనిషిపిల్ల కలుగుచున్నది. ఏలననగా విత్తనమునందు చెట్టుయొక్క లక్షణములన్నియు గర్భీకృతమై బీజరూపముగా నుండి మొలకెత్తును. హిరణ్యకశిపునకు ప్రహ్లాదుడు ఎందులకు కలుగవలె? తండ్రివలె ప్రహ్లాదుడు ఎందుకు దుర్మార్గుడు కాలేదు? అని కొందరు శంకింపవచ్చు. అంటే గుణములు సూక్ష్మశరీరమునకు సంబంధించినవి. అవి ఆయా జీవుల పూర్వసంస్కారముల బట్టి ఉండును. పైన చెప్పిన విత్తుతీరు చెట్టు అనుసూక్తి స్థూలశరీరమునకే సంబంధించినదని గుర్తించవలెను.

3) సహవాసేన గుణాభవంతి: అనగా మంచివానితో స్నేహము చేసినవానికి మంచి గుణములు,

చెడ్డవానితో స్నేహము చేసినవానికి చెడ్డగుణములు కలుగట ప్రత్యక్షమే కదా! చందనవృక్షముల మధ్యలో నున్న ఇతర జాతి వృక్షములు కూడా సుగంధమయమగుచున్నవి. ఇంగువ మూటకట్టిన గుడ్డ కూడా ఇంగువ వాసన వేయుచున్నది. నిప్పుయొక్క సమీపములోనున్న వస్తువులు వేడెక్కుచున్నవి. అట్లే మంచివాని సహవాసములో మంచి గుణములు చెడ్డవాని స్నేహముచేత చెడ్డగుణములు కలుగుచున్నవి. ఈ విషయమునే శ్రీ కృష్ణదేశికేంద్రులవారు తమ కందార్థములో ఈ క్రింది విధముగా శెలవిచ్చియున్నారు.

"అందముగా స్వాతివర్షపు బిందువు లెందెందె పడునో పృధ్విని తత్ బిందువులు ఉపాదివశమన" అనగా స్వాతివర్షపు బిందువు పేడలో పడిన పేడనీరగుచున్నది. బురదనీటిలో పడితే బురదనీరగుచున్నది. ముత్యపు చిప్పలో పడితే మంచి ముత్యమగుచున్నది. కనుక మంచి సహవాసము చేయుమని హితోపదేశము చేసి యున్నారు. ఆరు నెలలు సహవాసము చేస్తే వారు వీరగుతారు అను సామెత కూడా పుట్టియున్నది.

4) **యద్భావంతద్భవతి**: అనగా నీకు ఎట్టి భావనాబలముండునో ఆ రీతినే జరుగును. అని అర్థము. మనస్సునకు గల శక్తి అపరిమితము. మనస్సును ఏకాగ్రత చెందించుటయే తపస్సు అట్టి ఏకాగ్రత చెందిన మనస్సుచేత సంకల్పించిన యెడల ఆ సంకల్పము నెరవేరితీరును అట్టి శక్తియే తపొబలము అన్నారు. అట్టి తపోబలము గలవారు శపించినయెడల అట్టి శాపములు తగిలితీరును. మంత్రజపమునందు ఏకాగ్రత కలిగితే మంత్రశక్తి ఉద్భవించుచున్నది కదా. కనుకనే మంత్రము శక్తివంతమగుచున్నది. అయితే అట్టి మంత్రజపము ఏకాగ్రతతో జపించుట అవసరము అట్టి ఏకాగ్రత సాధించినవారికి మనస్సుద్ధి వాక్సుద్ధి కలిగి వారు మహిమాన్వితులగుచున్నరు. శాపానుగ్రహానుదక్షులని పిలవబడుచున్నారు.

5) **పూర్వజన్మ సుకృతత** 6) పుట్టుచాయలేని : పూర్వజన్మ సుకృతమనగా గత జన్మలో మంచి పనులు చేసియుండి ఆ ఫలములింకను అనుభవమునకు రాకయుండు కర్మఫలము. ఆ కారణముగా ఈ జన్మలో మనము ఎట్టి ప్రయత్నము చేయకనే మనకు కలుగు సుఖసంతోషములు పూర్వజన్మ సుకృతము వల్లనే కలుగుచున్నవి అని చెప్పక తప్పదు. కారణము లేని కార్యముండదు కదా అట్లు కలిగిన సుఖసంతోషములకు పూర్వజన్మ సుకృతమే కారణముగా యున్నది. ఉదా: ఒకే తల్లిదండ్రుకు కలిగిన కవలబిడ్డలు ఇర్వురిలో ఒకడు మహాసూక్ష్మ ప్రజ్ఞాదురంధరుడు అయినాడు. రెండవవాడు శుద్ధ మొద్దబ్బాయి అయినాడు. ఇరువురు, ఒకే తల్లిదండ్రుల గర్భవాసమున ఇంచుమించు ఒకే కాలమున పుట్టి సమానముగా పెంచబడినను ఇట్లగుటకు కారణమేమి? అంటే మొదటి వానికి గల పూర్వజన్మ సుకృతము రెండవవానికి లేదన్నమాట.

శూరత్వము, సంగీతము, దానశీలత మున్నగునవి పుట్టుకతో రావలెనేగాని, నేర్చుకుంటే వచ్చేవి కావు. ఈ జన్మలో కొత్తగా తెచ్చి పెట్టుకొందామంటే వచ్చేవి కావు. సమానముగా

ధనుర్విద్య నేర్చుకొన్నను ఒక అర్జునుడే పాండవ కౌరవులందరికంటేను విలువిద్యా నైపుణ్యము కలిగినవాడైనాడు. తానిచ్చిన చిన్న అంగరాజ్యమునకు ప్రభువైన కర్ణునకు దానకర్ణుడని పేరు వచ్చుట చూచి దుర్యోధనుడు సామ్రాజ్యధిపతియైన తానుకూడా అట్టిపేరు కీర్తులు పొందవలెనని ధర్మకార్యములు చేయుట ప్రారంభించినాడు. కాని ఏమిలాభము? వర్షాకాలములో వచ్చిన యజ్ఞము చేయుటకు ఎండుకట్టెలు కావలెనని కోరిన బ్రాహ్మణునకు ఎండుకట్టెలే ఇవ్వలేకపోయినాడు. ఆ బ్రాహ్మణుడే కర్ణుని వద్దకు పోయి ఎండుకట్టెలే కోరినపుడు తనకున్న మహాసౌధమును బడకొట్టించి అందు ఎండియున్న దూలములు వాసములు తీసుకొని పొమ్మని కర్ణుడు ఇచ్చవేయగలిగినాడు. కారణమేమి? పూర్వజన్మ సంస్కారమే. గత జన్మలలో యితరులకు పెట్టియున్నందున ఈ జన్మలో అట్లు పెట్టబుద్ధి కర్ణునికి కలిగినది. అట్లు పెట్టిపుట్టకపోవుట వలన దుర్యోధనునకు కలుగనేలేదు. కనుక దానశీలత పుట్టుకతో కలుగవలనే కాని తెచ్చిపెట్టుకుంటే రాదు.

160 ప్రశ్న : **గురుమూర్తి ప్రత్యక్షముగా యెదుటనేవుండగా ఛాయాపటమును పూజించి వుపదేశము గొనవచ్చునా?**

జవాబు : గురువు నరుడుగాడు. సాక్షాత్పరబ్రహ్మ స్వరూపుడు అని త్రికరణశుద్ధిగా విశ్వసించి, ఆ లక్ష్యముతో ఆయనను అర్చించి పూజించి, ఆయనవలన వుపదేశము పొందినపుడే గురువునందు గురుమంత్రమునందు గురుబోధయందు గురికల్గి ఆ వుపదేశము వల్ల ప్రయోజనముండును. గురువునకు శరణాగతి గావించి, తన్ను సంపూర్ణముగా గురుదేవున కర్పించుకొనటకే గురూపాసన, గురపాదపూజ మొదలగునవి నిర్ణయింపబడియున్నవి. కనుక గురువునకే పాదపూజ చేసుకొనవలెను. గురువు యెదుటనుండగా ఛాయాచిత్రమునకు పూజ చేయనేల? సాక్షాత్తుగా తన పాదపూజ చేయనివానికి గురుమూర్తి వుపదేశము చేయనేరాదు.

161 ప్రశ్న : **విశ్వ తైజస ప్రాజ్ఞ ప్రత్యగాత్మలనగానేమి? వాని వృత్తి నిర్ణయములేమి?**

జవాబు : సర్వప్రాణుల యందు పరమాత్మయొక్క ప్రకాశము లేక జ్ఞానముకలదు. దానికి ప్రత్యగాత్మయని పేరు. అది ఆయాప్రాణులయందలి అంతఃకరణములతో గూడినపుడు దానికే జీవుడని పేరు. ఈ జీవుడు జాగ్రదావస్థ యందు తన స్థూలశరీరమును అభిమానించి శరీర యింద్రియములతో క్రియారూపంగా సర్వవ్యవహారములు జరుపునపుడు అతనికి విశుడనిపేరు. విశ్వము (ప్రపంచము) నందలి శబ్దస్పర్శ రూపరసగంధాదులను అనుభవించుచూ సుఖదుఃఖముల ననుభవించును. గనుక అతనికి విశ్వుడని పేరు పెట్టబడినది. అతడే స్వప్నావస్థలో సూక్ష్మశరీరమును అభిమానించుచూ బాహ్యావస్తువులతోనూ అందలి విషయములతోనూ ఏ మాత్రము సంబంధపడకుండానే కేవల మనోరూపుడై దృష్ట్యా దృక్‌దృశ్యములు అన్నియు తానేయై భావనారూపంగా తాను కల్పించుకొన్న స్వప్న ప్రపంచమునందలి సుఖదు!ఖములను అనుభవించునపుడు ఆ జీవునకే తైజసుడని పేరు.

కేవలం తన తేజస్సు (ప్రభావం లేక శక్తి) మాత్రమే యీ అవస్థయందు పనిచేయను గనుక యీ జీవునికి తైజసుడని పేరు పెట్టబడినది. సుషుప్తి (గాఢనిద్ర) యందు జీవుని మనసు కేవలం తన తొలిరూపమగు అంత!కరణయందు చేరిపోయి వుచ్ఛ్వాస నిశ్వాస రూపమగు ప్రాణవాయువుతో సంయోగము వీడివున్నందున్నందున యీ అవస్థయందు క్రియారూపముగా గాని భావనారూపముగాని యెట్టికర్మలు చేయక అజ్ఞానదశలో శుద్ధజడరూపముగా పండియుండును. జీవుడే ఈ అవస్థయందు గాఢతరాజ్ఞానమందు పడియుండును. యీతనికి ప్రాజ్ఞుడని పేరు ప్ర+అజ్ఞుడు - ప్రాజ్ఞుడు అనగా విశేషమగు అజ్ఞానములో పడియుండును కనుక ప్రాజ్ఞుడని పేరు. జాగ్రదావస్త యందలి బాహ్యాప్రజ్ఞగాని స్వప్నావస్థయందలి అంతఃప్రజ్ఞగాని యీ అవస్థయందు లేక కేవల అజ్ఞానమునందుడి శరీరంపై పాముపాకినా తెలియక శరీరము శవమువలె పడియుండును. ప్రజ్ఞానఘనుడు కనుక అతనికి ప్రాజ్ఞుడని పేరు వచ్చెనేనిన్ని అతడు సుషుప్తి అవస్తలో ఆనందమనుభవించు చుండునని చెప్పబడినది. కాని ప్రకృష్టన అజ్ఞ అనగా గాఢమగు అజ్ఞానమునందున్న వాడు గనుక ప్రాజ్ఞుడని పేరు అనుటయే సమంజసము తెలివి యేపనిచేయని స్థితిలో ఆనందానుభవమెట్లు సాధ్యము?

ఇక ప్రత్యగాత్మ యనగా మహకారణశరీరము నభిమానించు జీవుడు. ప్రాణమనస్సులతో సంయోగము చెందక తానుతానై యీ శరీరమునందున్న ఆత్మ ప్రకాశమే ప్రత్యగాత్మ "అహం బ్రహ్మాస్మి" అను మహావాక్యములోని అహం శబ్దవాచ్యమే ప్రత్యగాత్మ. ప్రత్యగాత్మ పరమాత్మలకు వస్తుతః యెట్టి బేధములేదు. వుపాధియందున్నపుడు ప్రత్యగాత్మయనీ నిరుపాధికముగా నున్నపుడు పరమాత్మయని పిలువబడును. ఇది శరీరవ్యాపారములన్నిటికిసత్తాయిచ్చును.

ప్రశ్న : **గురుమూర్తి ఉపదేశకాలమందు బ్రహ్మవ్రాత తుడిచి వేయుచున్నాడు. ఇక కర్మ పూరితి, చేసేది ఎవరు ఎందులకు?**

జవాబు: ఉపదేశకాలమందు బ్రహ్మవ్రాత గురుమూర్తి తుడిచివేయుచున్నడనుట శుద్ధ అసందర్భము. విజ్ఞాన దృష్టికి విరుద్ధము. అది నిజమైతే ఆ శిష్యునకింక అన్నివ్యాధులుగాని సుఖదుఖఃములేగాని మరణము కాని రాకూడదు. శిష్యుని అంత!కరణమునందు నిలవవున్న కర్మవాసనలను బట్టి సుకృత దుష్కృతములు చేయుచునే ఉండనేల?

ప్రశ్న : **గురుపుత్రులకు నవవిధ భక్తులలో ఆత్మనివేదన భక్తితో పాటు యితర భక్తిపద్ధతులు అవసరమంటారా?**

జవాబు : ఆత్మనివేదన భక్తి అంటే అన్నిటికన్న తనకు ప్రేమాస్పదమగు తన ఆత్మనే గురుమూర్తికి ధారపోయిట అపుడిక తానేలేడుగనుక తన శరీరంద్రియవాక్కు మనఃప్రాణములన్నియు గురుమూర్తివి కాని తనవికావు అప్పుడు శబ్దాది విషయతృప్తి కొరకు ఏ కార్యము చేయును? గురుమూర్తి ఆజ్ఞానుసారము తప్ప తానేమియూ చేయలేని స్థితిలోనుండును గురుమూర్తి ఆజ్ఞాపించిన కార్యములలోనే కాలమంతయు వ్యతీతము

చేయును. గురు సంకల్పమే కాని అతనికి స్వతంత్రము లేదు. అట్టి వానికి ఇతరవిధములగు భక్తిపద్ధతులలో ఏమియు అవసరము లేదు.

164 ప్రశ్న : **నిత్యానుష్టానము గూర్చి తెలుపవలయును?**

జవాబు : గురుపుత్రుడైనవాడు వేకువనే అనగా బ్రహ్మముహూర్తముననే 4.30 ని॥లకు లేచి గురుపరంపరా ధ్యానము చేసుకుని తనకు గురువుపదేశించిన గురుమంత్రము కనీసము 108 సార్లు సాధ్యమైనంత ఏకాగ్రతతో జపించి, కాలకృత్యములు తీర్చుకొని స్నానం చేసి శుచియై గురుపీఠము వద్దకు పోయి పీఠము శుభ్రపరచుకొని, దీపము వెలిగించి అగరువత్తులు లేక సాంబ్రాణి వెలిగించి నూతనముగా వికసించిన పుష్పములు పాదుకలకుగాని గురుమూర్తి ఫోటోకు గాని సమర్పించి గురుగీత ప్రథమ అధ్యాయము అంగన్యాసకరన్యాసములతో పూర్తిచేసి మానసిక పూజచే పంచభూతాత్మకమగు తన స్థూలసూక్ష్మ కారణ శరీరములను గురుమూర్తికి అర్పించి పిదప సర్వతన్మాత్ర స్వరూపమగు తన మహాకారణ శరీరమును కూడ గురుమూర్తికే అర్పించి తన పిండాండ దృష్టి సర్వస్వమును వదలి గురుపరమాత్మతో ఏకభావము చెందుచు తన అవకాశానుసారము శక్త్యానుసారము గురుమంత్రమును జపించుకొనవలెను. అటు పిమ్మట గురుమూర్తి తనకు చూపిన ఆత్మస్వరూపము నందు లక్ష్యముంచి ఏ మంత్రమును జపించక, కనీసము 5 నిమిషములపాటు ధ్యానమునందు ఉండవలెను. ఇది నిత్యనుష్టానము.

165 ప్రశ్న : **నిత్యపారాయణ అనగానేమి?**

జవాబు : గురుభక్తునికి, గురుగీత, గురుస్వరూప నిర్ణయము గావించి, గురు ప్రభావము వర్ణించి గురు స్వరూపమునకు అతీతముగానున్నది. ఒక్క పరిపూర్ణ బ్రహ్మమే అని ఉద్ఘాటించుచున్నది. అంతేగాక గురుశిష్యధర్మములు, సచ్ఛిష్యుని సదాచారపద్ధతి మొ॥వన్నియు క్రోడీకరించియున్నది. కనుక గురుగీత గురుపుత్రుల కెంతయో ప్రమాణము, అవశ్యపఠనీయమై యున్న గ్రంధమైయున్నది. ఈ గ్రంధమంతయూగాని, కొంతగాని అవకాశమును బట్టి ప్రతినిత్యము గురుపుత్రుడు పారాయణ చేస్తూవున్న యెడల విశేషమైన ప్రయోజనము లుండుననుటలో సందేహము లేదు.

166 ప్రశ్న : **ఆత్మ సూక్ష్మాతి సూక్ష్మముగా ప్రకాశిస్తూ ఉండగా, వస్తునిశ్చయముగా ఎట్లు తెలియబడగలదు? సాదృశ్యముగా కనబడగలదా?**

జవాబు : ఆత్మ సూక్ష్మాతి సుక్ష్మముగా ఉన్నమాట నిశ్చయమే! అట్టిదానిని స్థూలమగు శబ్దాది విషయపంచకమును గుర్తించు జ్ఞానేంద్రియముల చేతను, అజ్ఞానేంద్రియముల ద్వారా వ్యవహరించు మనస్సుచేతను గుర్తించలేము అనుటయు యదార్థమే! అయితే "ఆత్మావారేద్రష్టవ్య! శ్రోతవ్యా, మంతవ్యా, నిధిధ్యాసితవ్యః" అన్ని "మనసైవాను ద్రష్టవ్యం,

మనసై వాను శ్రోతవ్యం" అనిన్ని శ్రుతులుద్భోదించుచున్నవి అనగా ఆత్మ చూడతగినది, వినదగినది, మనస్సుచే మననము చేయతగినది. అని మొదటి శృతికి అర్థమైతే, రెండవశృతికి ఆత్మ మనస్సుచేతననే చూడతగినది, మనస్సుచేతనే వినతగినది అని నొక్కి చెప్పుచున్నది. అయితే మానవునకు రెండు మనస్సులున్నవా ఏమి? లేవు. కాని ఇంద్రియముల ద్వారా పనిచేయునపుడు మనస్సుకూడా ఒక ఇంద్రియరూపమే అగుచున్నది. అట్లుగాక ఇంద్రియముల ద్వారా విషయపంచకమును గుర్తించక ఆత్మానుసంధానమున కుపక్రమించునేని అది నిరేంద్రియ మనస్సు లేక అతింద్రియ మనస్సులేక స్వోవశీయ మనస్సు అని పిలువబడును. ఆ మనస్సునకు ఆత్మ గోచరించును కాని అపుడు చూచు మనస్సు చూడబడే ఆత్మ అనే ద్విపుటి, త్రిపుటులు ఏమియు వుండవు మనస్సే ఆత్మయైనిల్చును. ఇదియే ఆత్మసాక్షాత్కారము.

**ప్రశ్న : పరిపూర్ణమునకు ఎరుకకు ఏలాటి సంబంధమూ లేదంటున్నారే! అట్టి పరిపూర్ణమును ఎరుక యెట్లు తెలుసుకొనుట? ఎరుకను విడచి తెలుసుకోమంటారు. అపుడు తెలుసుకొనేవారెవరు? వివరించండి?** (167)

జవాబు: వున్నవి రెండు పరిపూర్ణమొకటి లేనెరుకానెదొకటి. పరిపూర్ణయెరుకల నెర్గి యెరుకను మానుమని పూర్ణసిద్ధాంతము. యెరుకను వస్తునిశ్చయముగా నెరిగినచో, అది కానిది అది లేనిది ఏదో అది పరిపూర్ణము. కనుక యెరుక నెరిగి దానిని గురువాక్యము ద్వారా లేదని అభ్యాసము చేస్తే యెరుక లేకుండానే పోవును. అపుడు శేషించియున్నదే పరిపూర్ణము. పరిపూర్ణము యీ విధంగానే. స్వతసిద్ధముగావలెను. ఇంకోవిధము లేదు. పరిపూర్ణమును ఉండ చూచుకోనగును. లేదా పుట్టుట గిట్టు లేకను, పుట్టే గిట్టేటి యెరుక పొడిమెరుగకున్ చుట్టువలె కదలకుండునును బట్టబయలు అని భావింపదగును. అంతేగాని దాన్ని సాక్షాత్తుగా చూచిన వారు చూడగల్గిన వారు లేరు అది కంటితోను మనస్సుతోను చూడరానిది, నోటితో పలుకరానిది అది వున్నదని గురుబోధచే నారూఢంగా నమ్మి యెరుక లేకుండా చేసికొనుటయే కర్తవ్యము. (168)

**ప్రశ్న : బ్రహ్మవిద్యలు వున్నాయంటారు, అవేవో తెల్పగలరా?**

జవాబు : అవును, వున్నవి అవి దశోపనిషత్తులయందు గలవు. ఈశావాస్య విద్య, నాచికేతవిద్య, అంగుష్ఠ ప్రమిత విద్య, సత్యకామ విద్య, అక్షరపరవిద్య, ఆనందమయ విద్య, పురుషవిద్య, సద్విద్య, అంతరాదిత్య విద్య, ఆకాశ విద్య, ప్రాణవిద్య, పరంజ్యోతిర్వి ద్య, శాండిల్య విద్య, ఉపకోసల విద్య, భూమవిద్య, దహరవిద్య, మధువిద్య, సంవర్గవిధ్య, పంచాగ్నివిద్య, గార్గ్యక్షర విద్య, వైశ్వానర విద్య, జ్యోతిషాం, జ్యోతిర్విద్య ఉద్దాలకాంతర్యామి విద్య, మైత్రేయీ విద్య, ఆదిత్య మండలస్థ, సత్యబ్రహ్మవిద్య, అక్షిస్తసత్యబ్రహ్మ విద్య, ఉషసికహళ విద్య, ప్రతర్ధన విద్య, బాలాకినివిద్య, అజావిద్య, రుద్రవిద్య, చతుర్ముఖ విద్య అనునవి.

**ప్రశ్న : పరిపూర్ణము, ఎరుక ఒకటేనా లేక రెండా?** (169)

జవాబు : రెండు ఒకటికాదు అత్యంత భిన్నములు. అది ఇది కాదు, ఇది అదికాదు. అనగా పరిపూర్ణ మెరకకాదు, ఎరుక పరిపూర్ణము కాదు అని శివరామదీక్షితుల సిద్ధాంతము. కందార్థముల గ్రంథంలో అచల లక్షణము (అచల పరిపూర్ణ దర్శనము) అను శీర్షికతో వున్న కందార్థములలో ఎరుక లక్షణములు వుదహరించుచూ అవి ఏమీ పరిపూర్ణమునకు లేవని నిషేదముఖంగా (negative) పరిపూర్ణ మెరిగించబడినది. మరిన్ని బయలెరుకల అత్యంత విభిన్నత్వము అనే శీర్షికతో పీఠంవారు ప్రచురించిన కందార్థముల గ్రంథంలో రెంటి తేడా చక్కగా చూపించబడినది. ఇంతకూ గురుముఖతః క్రమపద్ధతిగా వస్తునిశ్చయముగా విచారించిన వారికి గాని ఎరుకయే తెలియదు. పరిపూర్ణ పరబ్రహ్మము (Absolute Brahmam) ఎట్లు తెలియబడును? రెండు తెలియనినాడు వాని భేదమెట్లు తెలియబడును. వూహాపోహలచే మాత్రం యెన్నడూ తెలియబడదు.

**ప్రశ్న : ఎల్లప్పుడూ, సృష్టికి పూర్వపరములయందు వున్నదాత్మయేకదా! అదే శాశ్వతమని గీతా అభిప్రాయము ఎరుకకు తెలియబడని పరిపూర్ణముండి ఏమి ప్రయోజనము?**

జవాబు : కార్యరూపమైన విశ్వమునకు పూర్వాపరములయందు (భూత, భవిష్యత్తుల యందు) కారణ వస్తువు వుండకతప్పదు "కాలోస్మిన్" అనగా నేను కాల స్వరూపుడునని గీతా ప్రబోధము, కార్యకారణ రహితమైనది, దేశ కాలాతీతమైనది పరిపూర్ణ పరబ్రహ్మము. శాశ్వతమను శబ్దము, అశాశ్వతమను శబ్దము రెండూ సాపేక్షికము ఏ శబ్దము చేతనూ పలుకరానిది పరిపూర్ణ పరబ్రహ్మము ఏ శబ్దము చేతనైననూ పిలువబడేది యెరుక. త్రికాలములయందూ వున్నట్లు తోస్తూ వుంది. కనుక ఎరుకనుసత్ అన్నారు పరిపూర్ణము పర్‌సత్ రహితము అశాశ్వతమని చెప్పినా తప్పుకాదు. ఏదో రూపంలో వుంటోంది. కనుక శాశ్వతమని చెప్పినా తప్పుకాదు. మార్పుదాని సహజలక్షణము మార్పు చెందే దానిని అశాశ్వతమన్నారు. శాశ్వతమూ, అశాశ్వతమూ రెండూకూడా ఎరుకకే పరిపూర్ణమున కెప్పుడూ ఏ మార్పులేనే లేదు. కనుక దానిని ఏ సాపేక్షిక శబ్దము చేతను పలుకరాదు.

ఎరుకకు తెలియరాని పరిపూర్ణము వలన ప్రయోజనమేమి? చీకటి సూర్యుని యెరుగదు. కనుక సూర్యుని వలనప్రయోజనమేమి? అని అడిగినట్లే. చీకటి లేకుండా పోవుటయే ప్రయోజనము అట్లే తాను గురుముఖత, తన స్వరూపనిశ్చయజ్ఞానము పొంది ఆ పిమ్మట పరిపూర్ణమును తెలియ ప్రయత్నిస్తే తానే లేకుండా పోవును. అట్లు పోతే జన్మరాహిత్యము తానే లేనని ధృడనిశ్చయం పొందిన వానికి యికయే భ్రాంతియు నుండజాలదు. సర్వభ్రాంతి రహితమే పరిపూర్ణ బోధవలన ప్రయోజనము. ఈ భావమునే కందార్థములలో "పరిపూర్ణమనిన నెట్టిదో ఎరిగెదనని యెరుక బయటికేగిన యెరుకే యెరుకకు శూన్యంబాయెను. యెరుకకు జన్మించి నట్టి యీ విశ్వమంతా; యెరుకవలెనే ఏమీ లేదంతా యెరుక ఉండంగానే యెరుక విశ్వములు లేవు. యెరికకే ఇది చూడ ఎంతో వింతై తోచె, యీ విశ్వమంతా, ఎరుకవలెనె ఏమీ లేదంతా" అన్నారు.

**ప్రశ్న : శ్రుతులను పేర్కొనకుండా కేవలం అనుభవపూర్వకంగా పరిపూర్ణమును గూర్చి వివరించండి. అద్వైతులు చెప్పేదానినే మీరు పరిపూర్ణమని పేరెట్టినారేమో?**

జవాబు : శ్రుతులు మహర్షుల యొక్క అనుభవ వాక్యాలే అని తెలియవలెను. ఇంతకూ అనుభవంచేది ఏది? మనస్సేకదా! ఎరుకను విడచి చూస్తే అంతా పరిపూర్ణ పరబ్రహ్మమే అని పరిపూర్ణ భావజ్ఞుల సిద్ధాంతం కనుక ఎరుకను విడచిన తర్వాత అనుభవించే మనసు యెక్కడనుంటుంది? అనుభవం యెంతవరకు? ఆత్మను తెలుసుకొన్నంతవరకే ఆత్మాతీతము అనుభవగమ్యం కాదు. అది మనోవాక్కుల కందనిది. కాని యెరుక లేని స్థితి మనకు సుషుప్తి, మూర్ఛ, సమాధి, మరణములను విమర్శించినపుడు గ్రాహ్యమగుచున్నదేగాని దానిని ఆ కాలమునందు అనుభవించుచున్నాము అని అనవచ్చునా? అనుభవమంతా జాగ్రత స్వప్నములో మాత్రము కలుగును. నిద్రాసమాధుల యందలి సుఖమే పూర్తిగా మన మనుభవించుట లేదే? అనగా తత్కాలమందే దానిని గుర్తించక జాగ్రతకు వచ్చిన పిమ్మటనే దానిని గురించి చెప్పుచున్నామే! యిక పరిపూర్ణానుభవమును తానుండి అనుభవించునా? అందుచే బొందితో కైలాసము వెళ్ళకోరుట యెంత హాస్యాస్పదమో అట్లే తానుండి పరిపూర్ణ పరబ్రహ్మమును సాక్షాత్తుగా అనుభవించగోరుటయు అట్టి అనుభవమును యితరులకు వాచా చెప్పబోవుటయు గూడ హాస్యాస్పదములే. మాటి మాటికి సమాధిలోకి పోవు శ్రీ రమామకృష్ణపరమహంసను, సమాధి అనుభవమును వివరించుడని శిష్యులు గోరిరట మనస్సు వాక్కులున్నంతవరకు చెప్పగల్గి ఆ పైన చెప్పజాలక మౌనమునపించెను కాని గురుమూర్తి అధికారి లక్షణం సంపాదించిన శిష్యునికి ఆ పరిపూర్ణ పరబ్రహ్మమును వుండజూపగలడు. అధికారి లక్షణము సాధించువరకు శిష్యుడు తొందరపడరాదు.

**ప్రశ్న : చదివి చదివి చదివి చావంగనేట్కి**

**చావులేని చదువు చదువవలయు**

**చదువులేక జనులు చచ్చిపోయిరి గదా**

**అను వేమన పద్యమునకు వ్యాఖ్యానము తెలుపండి?**

జవాబు : పొట్ట కూటికొఱకే లౌకిక విద్యలు అన్నియు ఏర్పడినవి. అట్టి విద్యలచే ధనమార్జించి పొట్టపోసుకొంటూ చివరకు మానవుడు మరణించుచున్నాడు. మరల జన్మకు తీసుకొనివచ్చు కర్మవాసనలను తీసుకొని ప్రాణము యీ శరీరమునుండి బయల్వెడలుట చావులేక మరణమని చెప్పబడుచున్నవి. అట్లు చనిపోయిన వాడు తిరిగి పుట్టక తప్పదు. తిరిగి పుట్టి పాతకర్మలకు ప్రారబ్దరూపంగా జీవితములో అనుభవించుచూ క్రొత్త కర్మలను చేసి మరల చచ్చి మరల పుట్టుచున్నాడు. కర్మవలన జన్మ జన్మ కలిగి కర్మచేయుచూ మానవుడు అనంతకోటి జన్మలెత్తుచున్నాడేగాని చావుపుట్టుకలు లేకుండా పోవుటలేదు. చావులేని చదువు అనగా

నొక్క పరిపూర్ణ బోధచే మాత్రమే మానవుడు జన్మరాహిత్యమును పొందగల్గును. యిట్టి పరిపూర్ణ బోధ వలన జన్మరాహిత్యము పొందకుండా మానవుడు లౌకిక విద్యలను మాత్రమే నేర్చి పొట్టపోసుకొంటూ చనిపోయిన అందరు జన్మపరంపరలతో చిక్కిపోవుట యెంత దురదృష్టకరము అని వేమన చింతించుచున్నాడు. దుర్లభమైన యీ వుత్కృష్టమైన మానవోపాధి కల్గినందుకు మరల పుట్టుక లేకుండా చేసుకొను పరిపూర్ణబోధ నెరుగుటయే సార్థకము. సర్వమానవుల తక్షణ కర్తవ్యం.

(122) ప్రశ్న : శ్లో॥ **శుద్ధే సుషుప్తి : దృష్టాంతం తస్మిన్నాహం కదాచన**
**తద్వత్సదాపి యస్తాస్తి ప్రపంచం నాస్థి తస్యవై॥**

**యీ శ్లోక భావమును తెలుపుచూ శ్రీ కృష్ణదాసుగారి కందార్థములలో ఆ భావమునకనుగుణ్యమైన కందార్థమేదైనా వుంటే అదియును విపులంగా తెలుపప్రార్థన.**

జవాబు : శుద్ధ బ్రహ్మమునకు సుషుప్తియే దృష్టాంతము గాఢసుషుప్తియందు "నేను" అను అహం వృత్తి ఎప్పుడూ ఏ విధంగా లేదో, అట్లే శుద్ధ బ్రహ్మమునందు (అనగా పరిపూర్ణ పరబ్రహ్మమునందు) ప్రపంచం లేదు. ప్రపంచమనగా పంచీకృత పంచ మహాభూతములచే నేర్పడిన బ్రహ్మాండ పిండాండములు మాత్రమే గాదు యేలననగా పంచీకృత పంచభూతములకు పంచతన్మాత్రలే కారణము. పంచతన్మాత్రలు బ్రహ్మము యొక్క మారు రూపమే. ప్రపంచమన్నపుడు కార్యరూప ప్రపంచమే గాక దానికి అత్యంత మూలకారణమగు బ్రహ్మము కూడాగైకొనవలసియున్నది. "తద్వత్సదాపియన్యాస్తి" అనగా ఎల్లపుడూ కూడా ఏది శాశ్వతంగా యున్నదో అని అర్థము. ఆ పరిపూర్ణ పరబ్రహ్మమునందు కార్యరూపంగా తోచబడిన ప్రపంచమున్నూ దానికి కారణరూపమగు బ్రహ్మమున్నూ ఏమీలేదు అని తాత్పర్యం.

అద్వైతులు "బ్రహ్మసత్యం జగన్మిథ్య" అను సిద్ధాంతమునే యీ శ్లోకమనువదించుచున్నది యని అనవచ్చును, కాని బ్రహ్మయే జగత్కారణమని సర్వోపనిషత్తుల తాత్పర్యం కారణమందు బీజరూపంలో కార్యలక్షణములుండి తీరవలెను అపుడు సుషుప్తియందు బీజరూపంగా సర్వము అణగిమణగియుండి, జాగ్రత్తయందు ప్రకాశించినట్లే సృష్టికి పూర్వము బ్రహ్మము సుషుప్తి అవస్థవలెనున్నది అని అనుట సమంజసముగా నుండును దృష్టాంతము అక్షరాలా కారణబ్రహ్మమునకు సరిపోవును.

పరిపూర్ణ పరబ్రహ్మమునకు ఏ దృష్టాంతమూ నిజంగా పనికిరాదు. కనుకనే దీనికి "సాటిదేదియోచ్చోట" అని కృష్ణవేశికేంద్రుల వారు కందార్థములలో చెప్పుట జరిగినది. ఐనను తొలుత శిష్యుని సుబోధార్థము దృష్టాంతములిస్తూవున్నారు. శ్రీ శివరామదీక్షితులు ఎరుకకు కలను దృష్టాంతమనగా నిచ్చినపుడుకూడా పరిపూర్ణమును సుషుప్తితో పోల్చి సుషుప్తిలో కలతోచినట్లే, పరిపూర్ణమున యెరుకతోచినదని భావార్థ సూచన చేసినారు కృష్ణదేశికులు స్పష్టముగా "మరపు సుషుప్తి మరణముల్ పరిపూర్ణంబునకు సాటిపరచి యెరుకకున్

మరియాది మేల్క పుట్టువు నిరుదెరగుల'' ''అన్ని'' మేలుక సుషుప్తి లోపల యేలీలన్ తనకు తానే తెంచునో, గుర్తాలీల బయలు లోపల వాలాయము తనకు తానెవచ్చునోయన్నా'' అన్ని కందార్థములలో శెలవిచ్చారు.

**ప్రశ్న : "పరిపూర్ణ గురువులు, ఉపదేశకాలమందే పరిపూర్ణ దేవుని ప్రత్యక్షంగా చూపిస్తున్నారా? లేక దృష్టాంతరూపంగా చూపిస్తున్నారా? నేను చూచితినని కొందరు పల్కుచున్నారే?**

జవాబు: ప్రత్యక్షమనగా యింద్రియగోచరము, ''మనస్సుష్ఠానింద్రియాణి'' అని మనస్స జ్ఞానేంద్రియ పంచకము దృష్ట్యా ఆరవదిగానూ జ్ఞాన, కర్మ యింద్రియములు మొత్తం పదింటి దృష్ట్యా ఏకాదశేంద్రియము గానూ చెప్పబడుతోంది. యిందే ఇంద్రియమునకు గోచరించినా దానిని ప్రత్యక్షమని చెప్పవచ్చును. పరిపూర్ణ పరబ్రహ్మము ఆ విధంగా గోచరించేది కాదు. కనుక దానిని ప్రత్యక్షంగా చూపించెదమని ఎవరేనా చెపితే అది బూటకమే. మీరు పరిపూర్ణదేవుడని వాడారు ''దివ్వే'' అనే ధాతువునుండి దేవుడు అనే మాటకూడా వచ్చింది. కనుక దేవుడనగా ప్రకాశస్వరూపడు లేక జ్ఞానమే స్వరూపంగా కల్గినవాడు. పరిపూర్ణ పరబ్రహ్మము ప్రకాశ అప్రకాశములనేవి రెండూ లేనిది. కనుకే దానిని దేవుడని పిలువరాదు. పరిపూర్ణ దేవుడనగా అధిష్ఠాన చేతన బ్రహ్మమునకు వర్తించగలదు. అట్టి పరమాత్మ స్వరూపం మాత్రం, ''ఆత్మావారే ద్రష్టవ్య శ్రోతవ్య మాతవ్యో నిధి ధ్యాసితవ్యః'' అని, ''మానసైనాను ద్రష్టవ్యం'' అనీ చెప్పబడుతోంది. కనుక దానిని గురువు శిష్యునకు మానసిక ప్రత్యక్షం గావించగలడు. ఉపదేశకాలమందు శిష్యునికి ఏమి చూపిస్తున్నారు? అనేది సాంప్రదాయ పద్ధతి ననుసరించిన్ని శిష్యుని అధికారమును బట్టిన్ని యుండును. యోగ్యుడైన శిష్యునికి గురువు ఆత్మస్వరూప నిరూపణ గావించవచ్చును. ఉపదేశ కాలమందు మేము పరిపూర్ణమును ప్రత్యక్షంగా చూపిస్తామని గురువులు గాని, వారు చూపించేరు మేము చూచేము అనే శిష్యులు గాని అంటే వారి మాటలు బూటకములే అని గ్రహించవలెను. మీ ప్రశ్నలోనే పరిపూర్ణమును చూపించుట అసంభవమనే విషయం. స్ఫురిస్తూనే యున్నది. భాగవతులు శ్రీ కృష్ణ దేశికేంద్రులవారు రచించిన ''చూపులలో గల వస్తువు, చూపులగను వస్తువులను, చూపులు గూడన్ తేపకు యెరుకని తెలియుము చూపులు లేనట్టి బయలు చూచేదింకేమీ యెరుకేలేదు తోచేదింకేమీ! దీపాములో కనుపాపలోగల వస్తువె పరమాత్ముని చూపితే యెరుకాయె చూచేదింకేమీ '' అనే కందార్థం విచారించవలెను.

**ప్రశ్న : హృదయాకాశమనుటకు కారణమేమి?**

జవాబు : చిత్తవృత్తి లేక అంతకరణవృత్తికి చిదాకాశమని లేక హృదయాకాశమనీ పేర్లు. అవకాశమిచ్చునది ఆకాశము అంతఃకరణకు స్థానము హృదయము కనుక దానికి హృదయాకాశమని పేరు వచ్చినది. మరియొక విధంగా చెప్పాలంటే ఆకాశము యొక్క సమష్ట్యంశము అంతఃకరణమని సాంఖ్య నిర్ణయం అది హృదయమునందున్నది. కనుక

హృదయాకాశమని పేరు "వన్నియలై దొక చోటను పన్నుగ గలసినది హృదయ పద్మంబనుచున్ యెన్నదురు జనులు" అన్నారు కృష్ణదేశికేంద్రులు అట్టి హృదయమేదియో గురుముఖతః వస్తునిశ్చయముగా విచారించి తెలుసుకొనవలెను.

56 **ప్రశ్న : సాష్టాంగ దండ ప్రణామములాచరించవలెనన్నారు. దీనికి బాహ్యాంతరార్థములను తెలియపర్చకోరుచున్నాను.**

జవాబు : సాష్టాంగమనగా అష్టాంగములతో చేయు నమస్కారము. అష్టాంగములేవనగా

శ్లో ॥ దోర్భ్యాం, పద్భ్యాంచ, జానుభ్యాం, ఉరసా, శిరసా, దృశా, మనసా వచసా చేతి ప్రణామోష్టాంగ వుచ్యతే॥ (గురుగీత) అనగా భుజములు పాదములు, మోకాళ్ళు, వక్షస్థలము, శిరస్సు, కండ్లు, మనస్సు వాక్కు అను యెనిమిదంగములచే చేయు నమస్కారము) సాష్టాంగ నమస్కారము. యిందు మొదటి ఆరు స్థూల శరీరమునకు సంబంధించినవి. కనుక శరీరము మనస్సు వాక్కు అను త్రికరణములచేత నమస్కారము చేయుచున్నాడన్న మాట దీనివల్ల భక్తునికి భగవంతుని యందుండవలసిన వినయ విధేయతలు, అహంకారాభిమాన రాహిత్యము కలుగుచున్నవి. ఆత్మనివేదనను భక్తిసాధనలో పరాకాష్ఠ తనస్థూల సూక్ష్మములు సర్వస్వము అనగా తను మనధనములర్పించుటే సాష్టాంగ నమస్కారములోని అంతర్భావన, ఇక నేను అను అహంకారము గాని, నాది అను మమకారము గాని శిష్యుని అంతఃకరణమున ఏమీ మిగులకుండా రహితమగుచున్నది యిదియే శరణాగతి యొక్క లక్షణము నీవేతప్ప నితఃపరంబెరుగ పాలముంచినా నీటముంచినా నీవేయని మార్జాలకిశోరన్యాయముగా సర్వబాధ్యతలను గురుమూర్తికే వప్పగించుట తన్నే గురుమూర్తికర్పించుకొనట కంటె యిక శిష్యుడు గురునకర్పించగలిగినదేమీ లేదు గదా!

122 **ప్రశ్న : జాగ్రతనుండి స్వప్నమునకు స్వప్నమునుండి సుషుప్తికి మరల సుషుప్తినుండి తిరిగి జాగ్రదావస్థలకు వచ్చుచున్నాము యెట్లు?**

జవాబు : జాగ్రతకు భ్రూమధ్యము, స్వప్నమునకు కంఠము సుషుప్తికి హృదయము స్థానములు. అంతఃకరణకు ప్రాణమునకు రెంటికి హృదయమే స్వస్థానము ప్రాణము వుఛ్ఛ్వాసనిచ్ఛ్వాస రూపముగ హృదయమునుండి బహిర్గతమై కంఠము భ్రూమధ్యముల ద్వారా నాసికనుండి వెలుపలకు పోవుట నిశ్వాస, అదే ద్వారముల ద్వారా లోనికేగుట వుచ్ఛ్వాస. అంత!కిరణ పరిణామరూపమగు మనసు ప్రాణము హృదయస్థానమున మొకదానినొకటి అంటక యెడముగా నుండును. కంఠస్థానమున కలియును. భ్రూమధ్యస్థానమున ఒండొంటితో పెనవేసుకొని పోవును. మనఃప్రాణముల చేరికలోగాని గుర్తుకలగదు. మనఃప్రాణములు పూర్తిగా కలియక స్పర్శమాత్రముగా కలసినపుడు స్వప్నము పూర్తిగా కలిసినపుడు జాగ్రత పూర్తిగా విడిపోయినపుడు గాఢసుషుప్తి కలుగుచున్నవి మన ప్రాణాలు పూర్తిగా కలియుటలేదు. కనుకనే స్వప్నమునందు అసంపూర్తి జ్ఞానము కలుగుచున్నది.

**ప్రశ్న : నామము యొక్క అనుభవము యెచ్చట గల్గును? అట్టి అనుభవమునకై మానవుడు జేయుతగినది ఏమి?**

జవాబు : నామము వినబడిన లేక నోటబల్కినా, కంటితో చూచినా యీ అన్నిటిద్వారా పనిచేయునది ఒక్క మనస్సే కనుక వెంటనే ఆ నామంగల వస్తువు యొక్క రూపం మనస్సునకు ద్యోతకమగును.

కాకియను పేరు విన్న లేక కన్న లేక అన్న మాత్రం చేత మనస్సునకు కాకియొక్క రూపము కానవచ్చెనా దాని నామము స్ఫురించుచున్నది. కనుక నామ రూపములుసాపేక్షికములై వున్నవి. ఈ భావమునే కృష్ణదేశికేంద్రులు "పలుకున గల్గిన అర్థము పల్కును విడనాడి నిల్వబడుచోటింకేది"' అంటూ వ్రాసినారు. కనుక గురు నామోచ్చారణచే గురువుయొక్క సాకార నిరాకారములు మనసునకు ద్యోతకమగుచున్నవి. ఐతే, ఆ గురుని రూపము అంతకు పూర్వము చూచి యుండిననే యిట్టి అనుభవము కలుగగలదు. కనుకనే గురుపరమాత్మ యొక్క రూపమును గురువు ద్వారా వస్తునిశ్చయంగా శిష్యుడు తెలిసివుండవలెను లేనిచో ఆ స్వరూప సాక్షాత్కారము కాదు. నామ జపము లేక మంత్రజపము యిందుకే సాధకులకు నిర్ణయింపబడినది అన్ని అనుభవములు అంతఃకరణయందే కలుగును. అట్లే స్వరూపానుభవముకూడ.

**ప్రశ్న: 64 కామ విద్యలేవి?**

జవాబు : ఆ విద్యలేవంటే అక్షర - అక్షణ - లిఃత - గణిత - గంధర్వ నిరుక్తి వ్యాకరణ - అలంకార - తర్కశాస్త్ర మీమాంస - యితిహాస - పురాణ ఆగమ - జ్యోతిష - అంజన - అదృశ్య - దూరశ్రవణ - దూరగమన - దూరదృష్టి - ఆకర్షణ - వుచ్చాటన యవనస్తంభన - జలస్థంభన - మోహస్తంభన - ఖడ్గసేవాస్తంభన - భృగుమత - భేతాళమత శ్రీలక్షణ- పురుష లక్షణ - గజలక్షణ - కావ్యలక్షణ - కన్యావాద - విషవాద - ధాతుర్వాద - మృషవాద - రసవాద - వర్ణహృదయ - ఆయుధాభ్యాస శిల్పశాస్త్ర - వాస్తుశాస్త్ర - యోగశాస్త్ర - రధారోహణ - గజారోహణ - అశ్వారోహణ - గోకర్ణ - గజకర్ణ - ఘటికాసిద్ధ - శకున - ఖేచరగమన -పశువైద్య - విషవైద్య - గజవైద్య - మిత్రభేద - ఇంద్రజాల - మహేంద్రజాల - పరకాయప్రవేశ - యీ మొదలైనవి విద్యలు.

**ప్రశ్న : "ఆత్మ సాక్షాత్కారము - సాధక ధర్మములు" అను శీర్షికతో మీరు వ్యాసము వ్రాసినారు. శ్రీ కృష్ణదేశికేంద్రులు "గురుమూర్తి చూపకున్నను పరిపూర్ణం బెట్లు తనకు ప్రత్యక్షమగున్" అనియు "చూపించ మాపరానిది" అనే కందార్థమున్నూ వ్రాసినారు. ఆత్మ యొక్క వస్తు నిశ్చయము [illegible]గా గురుమూర్తి కల్గించవలసిందే గదా, ఏ సాధనలు లేకుండా సులభోపాయంగా గురుమూర్తి తెలియపరచుచుండగా మరల ఈ సాధనల విషయం ఏమిటి?**

జవాబు: కందార్థములు, సాధన సంపత్తి గలిగిన పూర్ణాధికారికి చెప్పబడినవి. కనుకనే ఏ సాధన నీకెందుకు అంటూ చెప్పినారు. అందుచేతనే ఆత్మయొక్క స్థాన స్వరూప స్వభావముల గురించి కందార్థములలో అంతయొక్కువగా చెప్పలేదు. అందుచేతనే, శిష్యుడట్టివాడు కనుకనే అతనికి ॥మొదల చలం నెరిగించెదనన్నారు. అట్టి పూర్ణాధికారులకే ఏ సాధనా అవసరం లేదన్నమాట నిశ్చయమే. కాని మిగతా వారు ఆత్మ జ్ఞానమారూఢమగు వరకు, సాధన చేయవలసిందే గదా! అంతకరణశుద్ధి, ఏకాగ్రత లేనిచో గురువు చెప్పిన ఆత్మ స్వరూపమునందు ఆరూఢ జ్ఞానము కలుగదు. "అఖండంబగు యెరుకరూప గనరా మా తండ్రి" అంటుగాంచుటకు సాధన అవసరం లేదన్నచో వానిజ్ఞానము కేవలం వాచాజ్ఞానముగానే వుండిపోవును. వున్నవి రెండే 1) పరిపూర్ణం 2) యెరుక, అఖండ యెరుకను చూచి అది లేనేలేదని దానిని విడచినచో వున్నది పరిపూర్ణ బ్రహ్మమే, బుద్ధి నిశ్చయం, ఆత్మ నిశ్చయం అని జ్ఞానం రెండు విధములు బుద్ధి నిశ్చయం అంటే గురుమూర్తి చెప్పిన వస్తువే ఆత్మ అని తృప్తి మాత్రం చెందుట ఆత్మ నిశ్చయమంటే ఆ బోధ ఆరూఢమై సర్వమునందు అఖండాత్మ దృష్టికలిగియుండుట.

181 **ప్రశ్న : ఆత్మ సాక్షాత్కారమునకై సాధకుడు చేయవలసిన ముఖ్య సాధనయేది?**

జవాబు : 1. యోగసాధన 2. జ్ఞానసాధన అను రెండు ముఖ్య సాధనలు లోకములో గలవు, వీనియందు జయముకలుగవలెనన్న దైవకృపకావలయును. యిష్టదైవోపాసనవలన కృపాసం సిద్ధి కాగలదు అని చెప్పుదురు. అన్ని వుపాసనలలో శ్రీ చక్రోపాసన మిక్కిలి శ్రేష్ఠమందురు. యోగసాధన చాల కష్టము, అచక్రోపాపనలో వామమార్గము, చాల ప్రమాదకరమును నీచపద్ధతిను అయి వున్నవి. అతీత జ్ఞానమార్గమందు గురువుమాత్రమే వుపాస్యదైవము "సర్వశరీరస్తచైతన్య ప్రాపకోగురురుపాస్య!" అని శ్రుతిపల్కుచున్నది. ఈ అతీతజ్ఞానమార్గమగు (పరిపూర్ణ బోధ మార్గమందు) గురువు శిష్యునికి ఆత్మ యొక్క స్థానస్వరూపస్వభావముల నెరిగించి ఆత్మవస్తునిర్దేశముగావించును, గురుడెరిగించిన యా వస్తువునందు ఏకాగ్రమనస్కుడై ధ్యానము చేసినచో మనసు ఆత్మమయమైపోవును అపుడిక మనస్సు నిరేంద్రియమై ఆత్మతో తాదాత్మికస్థితి చెందును. అదియే సాక్షాత్కారము. యిందుకు సాధన గురూపాసన, గురుమంత్రా అనుష్ఠానము. గురూపదిష్ట మార్గమందు నడచుచు ఆచరణ కల్గియుండుట. ఇదియే సులభమున్ను శ్రేష్ఠతరమున్ను అయిన మార్గము.

182 **ప్రశ్న: పరిపూర్ణ భావజ్ఞులలో కూడా రాగద్వేషాలు కానవస్తున్నాయి కారణమేమి?**

జవాబు : రాగమనగా విపరీతమైన కోరిక, ద్వేషమనగా విపరీతమైన అసహ్యాభావముతో గూడిన కోపము యివి అభిమానం యొక్క గుణాలు అభిమానం, అహంకారం యొక్క ఆదిభౌతికం, అహంకారం అంతరేంద్రియ పంచకములో నొకటి, సమిష్టియందు యిది అంతఃకరణయే పరిపూర్ణమందు సమిష్టి వ్యష్టి రూపమగు అంతఃకరణం లేనేలేదని

తెలుసుకొన్నవారు పరిపూర్ణ భావజ్ఞులు. పరిపూర్ణ సిద్ధాంతమును ఎరుగుట మాత్రముతో వూరుకొనువారు కొందరు. యెరిగి అశరీరులై భ్రాంతి రహితులైవున్నవారు కొందరు సిద్ధాంతమును మాత్రం తెలుసుకొన్నవారికి రాగద్వేషములు పోనేపోవు. పరిపూర్ణ భావముచే భ్రాంతిరహితులై వున్నవారు మరల రెండురకములు 1. యుక్తి గలవారు 2. యుక్తిలేనివారు. యుక్తి కలవారు రాగద్వేషములు లేనివారైనా ఒకటి తిట్టితే పదితిడతారు. ఒకటి కొడితే పదికొడతారు వీరు ప్రాపంచికుల వల్ల ఎట్టి భాధలును పొందరు. వీరు గృహస్తులు. యుక్తిలేని వారు పదితిట్టినా ఒకటైనా తిట్టరు. పదికొట్టినా ఒకటైన కొట్టరు. వీరు ప్రాపంచకములో బాధలు పొందుదురు. వీరు సన్యాసులు. స్వాములజాడ స్వాములకు పాములజాడ పాములకు మాత్రమే తెలుసు. కనుకనే కృష్ణదేశికేంద్రులు "గురుగురు బోధల చేతను పరిపూర్ణము నెరిగి యెరుక బాసిన యతనిన్ గురుతింప నొరులశక్యమే? అని ప్రశ్నించినారు. శుద్ధ ప్రాపంచీకులకు నిజమగు పరిపూర్ణులు కూడా తమవంటివారే అనే భావన కలుగుతుంది. (నోటపలుకుట మరయక) పలికే వారికి తొలగదు పాపము అన్నారు.

**ప్రశ్న: కోపతాప శాపాలవల్లనూ మంత్ర తంత్ర యంత్రాది ప్రయోగాదుల వల్లనూ మనుషులను రాళ్ళుగా చేయవచ్చునా?** (18)

జవాబు : చేయవచ్చును, మంత్రములందు మహిమ ఉండుట మనకు ప్రత్యక్షమే, తేలుకుట్టు, పాముకాటులకు చిన్న చిన్న ఇతరవ్యాధుల వల్ల భాధ పడువారికి మంత్రముచే బాధ నివారణ అగుచునే ఉన్నది. మంత్రముతో చేరని యంత్ర తంత్ర ములుండుటకు సావకాశమే లేదు. కనుక వీటి అన్నిటియందు మంత్రమే ప్రధామైయున్నది. మంత్రములయందు ఉన్నవి అక్షరములే కదా. అవి జడములు కదా వాటికి శక్తి ఎట్లుండగలదు అని శంకింప వచ్చును. తొలుత శబ్దమే పుట్టినదని చాలా మతముల వారు అంగీకరించుచున్నారు. ప్రథమమున ధ్వన్యాత్మకమగు ప్రణవము. పిదప వర్ణాత్మకమగు రూపము కలిగిన వనియు ప్రణవమునందు పంచబీజములును అందుండి ఏబది అక్షరములున్ను వుత్పత్తి అయినవని శాస్త్ర నిర్ణయము పంచబీజములనుండియే స్తూలాతి స్తూలముగా పంచభూతాత్మకమీగు ప్రపంచము వుత్పత్తి అయ్యెను. కనుక పృధివీ సంబంధమగు అక్షరములు కొన్ని జలసంబంధము కొన్ని, అగ్నిసంబంధమగు కొన్ని, వాయుసంబంధమగు కొన్ని, ఆకాశ సంబంధమగునవి కొన్నిగా ఈ అక్షరములుకు గల శక్తిననుసరించి విభజించబడినవి శబ్దములకు శక్తి కలదని నేటి విజ్ఞాన శాస్త్రము ఋజువు పరచుచున్నది. పృధ్వి జలము, అగ్ని, వాయువు, ఆకాశములకు క్రమముగా స్థంబన, మోహన, మారణ, ఉచ్చాటన, వశీకరణ శక్తులున్నట్లు ఋజువగుచునే యున్నది. మరియు చిరకాల తపస్సు చేసి ఏకాగ్రత సాధించిన మహాపురుషులకు వాక్శుద్ధి సిద్ధించి నోటమాటవచ్చినంత మాత్రమునే సంకల్పము కలిగినంత మాత్రముననే పనులు జరుగుచుండును. అట్టి మహనీయుల సంకల్పబలనమునకు తోడు మంత్రశక్తి కూడా

జతఅయినచో తప్పక అది ఫలమునీయగలదు.వారి మనస్సునకు ఏమాత్రం నొప్పికలిగినను అది శాపమై దహించగలదు. అదియే శాపమై దహించగలదు. అందుకే వేమన్నగారు

కం॥ వుసురు లేని తిత్తి ఇసుమంత యూదిన
పంచలోహము దెల్ల భస్మమగును
పెద్దలుసురుమంటే పెనుమంట లెగయవా॥విశ్వ॥ అన్నారు.

ప్రశ్న: భూతప్రేత పిశాచాదులు మనుష్యుల వలె సంచరించినట్లు పూర్వ కథలలో కానవస్తూంది. అవి నిజమా? నిజమైతే ఇప్పుడూ అలాగే కనుపించాలికదా? అసలు భూతప్రేత పిశాచాదులకు ఉత్పత్తి స్థితి నాశనములు ఉన్నవా?

జవాబు : భూతప్రేత పిశాచాదులు ఉన్న సంగతి యథార్థమే కాని వానికి స్థూల శరీరము మాత్రము ఉండదు. చనిపోయిన వారి మనఃప్రాణరూపమగు సూక్ష్మ శరీరములు తీరని కామనా వాసనల బలముచే లేక పూర్తిగా అనుభవించని ప్రారబ్ధ బలముచే అవి జీవించి నడయాడిన ప్రదేశములను విడజాలక వాయురూపముగా ఏ చెట్టు చేమలనో ఆశ్రయించి ఉండును. కరచరణాదులతో చేయు కర్మేంద్రియ వ్యాపారము జరుగుటకు సావకాశము లేక కామనా వాంఛలను తీర్చుకొనుటకు స్థూల శరీరము లేక ఏ స్థూల శరీరమునందు ప్రవేశించి కోరికలు తీర్చుకొందుమా అని వేచియుండును. దుర్బలమైన మనస్సుగల స్త్రీ, శిశువులు భయపడినపుడు వారి మనసును అధిరోహించి లోబరుచుకొని తమ కోరికలను తీర్చుకొనుచుండును. వీటినే, భూతములని, పిశాచములని, కామిని యని బ్రహ్మరాక్షసులని ఇత్యాది నామములతో వాని వాని బలమును బట్టి పేర్లు పెట్టి వ్యవహరింతురు. మన కండ్లకగపడు రూపములు వానికి లేనే లేవు. ఏదైనా రూపమును కాన్పించినచో అది భ్రాంతి జన్యమే అగును సూక్ష్మ శరీరములు కండ్లకు కానరావు కదా? వాని కోరికలు తీర్చుకొన్న వెంటనే లేక వాని ప్రారబ్ధానుభవము క్షయించిన వెంటనే అవి తిరిగి జన్మాంతరములను చెందుచుండును. ఈ పిశాచాలను తన మనోబలముచే లేక సాధించిన మంత్రశక్తిచే(వాయు భూత సంబంధమగు బీజాక్షరములచే నిర్మాణమగు మంత్రముల యొక్క శక్తిచే ఉచ్చాటన క్రియ అనగా పిశాచాదులను వెడలగొట్టుట) జరుగును. కాని అంతటితో అవి నాశనము కాక వేరొక శరీరమును చేరుటకు ప్రయత్నము చేయుచుండును.

ప్రశ్న : **పరమార్థమనగా పరిపూర్ణమా లేక యెరుకయా?**

జవాబు : పరమార్థమనగా శ్రేష్టమగు వస్తువు లేక ద్రవ్యము అని శబ్దార్థము. నవవిధ ద్రవ్యములలో శ్రేష్టమైన ద్రవ్యము ఆత్మ. పరిపూర్ణమును కొందరు పరమార్ధ శబ్దముచే వాడియుండవచ్చును కాని అది సరికాదు. యేలయనగా పరిపూర్ణమునకు వస్తు లక్షణములు గాని ద్రవ్య లక్షణములు కాని, ద్రవ్యగుణ, కర్మసామాన్య విశేష, సమవాయ, అభావ

లక్షణములుగాని లేవు. ఎరుకే వస్తువు. పరిపూర్ణము వస్తు ముద్రహితము. కనుక యెరుకయే పరమార్థము, స్వార్థము అను రెండును అయివున్నది. పరిపూర్ణము ఏమియనరానిది దానికి పేరేలేదు. ఏ పేరున్నూ సరిపోదు.

**ప్రశ్న : శ్రీ శివరామ దీక్షితులవారి శిష్య, ప్రశిష్య వర్గము కొందరు శ్రీ మహావిష్ణువు పర్యంతమని కొందరు మహాశివుని పర్యంతమని, పరంపరా సంకీర్తన చేయుచున్నారు. ఓంకా పీఠమని కొందరు అతీత పీఠమని కొందరు అంటున్నారు. వీని వివరములు తెలుపకోరుచున్నాము.**

జవాబు : పరమశివుని అవతారమని శ్రీ దక్షిణామూర్తి అన్ని వేదాంత సాంప్రదాయాల వారిచేతనూ, కీర్తింపబడుచున్నాడు. శ్రీ భాగవతుల కృష్ణ దేశిక స్వామి కూడా తమ కంద పద్యములలో

కం॥ దక్షిణామూర్తి యనదగు
నీక్షితి శివరామ నామ దీక్షితులనుచున్

వీక్షింతురార్యులతని
దండములు బెట్టి ప్రేమనుతింతున్

అంటూ దక్షిణామూర్తి యందు తమ విశేష భక్తిని వెల్లడించినారు. కానీ శ్రీభాగవతులు శ్రీకృష్ణ దేశిక స్వాముల వారిది. శ్రీమహావిష్ణు సాంప్రదాయమని వారి గురు పరంపరా శీర్షికలో గాన వచ్చుచున్నది. అంతే కాదు గురుపరంపరలోని ప్రథమ శ్లోకములో

శ్లో ॥ శ్రీబ్రహ్మవిద్యా గురు విష్ణు సూర్యం
శ్రీయాజ్ఞ వల్క్యం జనకం శుకంచ.....

అని చెప్పబడ్డ శ్లోకంలో శ్రీ దక్షిణామూర్తి వారిని వదలి వేసినట్లుగా తోస్తుంది. కానీ ఇందు విష్ణువునకు ముందు చెప్పబడిన బ్రహ్మ విద్యా గురువు అనువారు ఎవరు? ఆ గురువు దక్షిణా మూర్తియే అయివుండవచ్చును. కనుక పరంపర మహాశివుని పర్యంతం అని చెప్పినా శ్రీ మహావిష్ణువు పర్యంతం అని చెప్పినా ఒక్కటే. అంతేకాక వారి ఇష్టదైవమెవరో వారే ప్రథమ గురువు అని చెప్పుకొనుటకీ శ్లోకం అవకాశమిస్తూ వున్నది. శివకేశవులకు భేదం లేదనుకొన్నచో ఏ బాధాలేదు. ఓంకార పీఠమని ప్రథమ పర్యాయం, శ్రీ సచ్చిదానంద వెంకటేశ్వరావధూతగారు. ప్రయోగించినట్లు తోస్తుంది. గురు స్వరూపము (ఓంకారమును సింహాసనముగా గల్గియున్నట్లు)

శ్లో॥ ఊర్ధ్వాంమ్నాయ గురో, పదం త్రిభువనోంకారాఖ్య సింహాసనం

అంటూ కొనియూడ బడింది, సింహాసనం అన్నా పీఠం అన్నా తెలుగులో పీట యన్న ఒకటే, కనుక ఓంకార పీఠమని వాడింయుండవచ్చును. ఓంకారరహిత సిద్ధాంతం అన్నా అతీత సిద్ధాంత అన్నా ఏ వివరణ అక్కరలేదు. అందుకే సందేహమున్నూ లేదు.

**ప్రశ్న : జీవశివైక్యం మోక్షమన్నారు. అద్వైతులు జీవశివులు లేరు బంధం లేదు, మోక్షం లేదు అన్నారు పరిపూర్ణులు. ఇంక పూర్ణ స్థితిని కుదరని వారు నిరుత్సాహము చెందవలసినదేనా?**

జవాబు : శ్లో ॥ కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః ఇద్దరూ చిదాభాసులే జీవశివైక్యం అనుటలో శివస్వరూపం సర్వకారణరూపమైన బ్రహ్మమే కానీ త్రిమూర్తులలోని శివుడు కాదు. కనుక జీవ శివైక్యం అన్నా జీవ బ్రహ్మైక్యం అన్నా ఒకటే.

మోక్షమనే మాటకు అర్థమేమి? విడుదల అని కదా! దేనినుంచి! భంధమునుంచి. ఏమిటి బంధము? అజ్ఞానము ఇది ఎట్లు బంధించుచున్నది. స్వస్వరూపమును ఆవరించి మరుగు పరచి జగద్రూపంగా కాన్పించేయున్నది అజ్ఞానము. అజ్ఞానము నాశనమైతే బంధనాశనమే లేక మోక్షమే ఈ అజ్ఞానమునకు స్వయం సత్తా (లేక పారమార్థిక సత్తా) లేదు కనుక ఇది మిథ్యా వస్తువు. బ్రహ్మమొక్కటే సత్యము. అజ్ఞానము లేనిదే లేని అజ్ఞానమును లేకుండా చేయుట యేమి? ఇది పరిహృతి పరిహార్యము. కనుక విచారించి చూస్తే అజ్ఞానమూ లేదు. దాని వలన ఏర్పడిన బంధమూ లేదు.బంధమే లేకుంటే మోక్షమే లేదు. కనుక బంధమోక్షములు మిధ్యేనని అద్వైతుల సిద్ధాంతము.

పరిపూర్ణులు యీ విషయం అంగీకరించుటతోపాటు యింకా ముందుకు పోయినారు. విడుదల అనే అర్థం మాత్రమే కాక మోక్ష శబ్దమును ఒక వస్తువుగా నిర్ణయించే పక్షములో అది కారణ వస్తువైన బ్రహ్మపదముగా నున్నది. బంధమనేది దానికావరణ రూపముగా దానిని మరుగు పరచు అజ్ఞానావరణ వస్తువుగా యున్నది. పరిపూర్ణుల భావనలో ఈ రెండు రూపములు కూడా మిథ్యయే. ఎరుకనే దానినే అద్వైతులు బ్రహ్మమన్నారు, దానిని ఆవరించు అజ్ఞానము మరపు రూపమనిన్నీ ఈ ఎరక మరపులు పరిపూర్ణ పరబ్రహ్మమందు లేవనిన్నీ సిద్ధాంతం. కనుక ఈ దృష్టితో బంధమూ లేదు. మోక్షము లేదన్నారు పరిపూర్ణులు. తేలిన సారాంశమేమంటే బంధ మోక్షములు లేనేలేవని అద్వైతులూ, పరిపూర్ణులూ కూడా అన్నారు ఈ మాట అద్వైతులను ఎంత నిరుత్సాహపరచునో పరిపూర్ణులను కూడా అంతే నిరుత్సాహపరచును. గురుబోధ విని అనుష్ఠాన ప్రవర్తనాదులచే గురుకృపకు పాత్రుడైతే శిష్యుడు నిశ్శంశయంగా జన్మరహిత స్థితిని సాధించగలడు.

**ప్రశ్న : "మూర్తి దర్శనము" అని చెప్పబడేది ఎంత నిజం? దాని ప్రయోజనం ఏమిటి? వివరంచకోరుచున్నాను?**

జవాబు : మూర్తి అనగా విగ్రహము అనగా రూపము గల ప్రతిమ లేక శరీరము, సాకారమై నేత్ర గోచరమగునదియే మూర్తి. ఏ విధమగు ఆకారముగాని స్వరూపముగాని లేని దొక్క అచల పరిపూర్ణ పరబ్రహ్మము "నచక్షుర్గచ్ఛతి, నవాగ్గచ్ఛతి, నోమనః" అని శ్రుతి పరిపూర్ణ పరబ్రహ్మము మనో వాక్కులకు గాని, నేత్రమునకు గాని గోచరించదు అని చెప్పుచున్నది.

కారణమేమనగా శబ్ద స్పర్శరూప రస గంధములనే పంచతన్మాత్రలు బీజరూపంగా గాని, విషయరూపంగా గాని దీనియందు కొంచమైననూ లేదు. ఆత్మయందు విషయరూపంగా లేవు కానీ బీజరూపంగా నున్నవి. పంచభూతములు యందుననో, ఆకాశమునందు శబ్దము వాయువు నందు, శబ్ద స్పర్శలు, అగ్నియందు శబ్దస్పర్శ, రూపములు, జలమునందు శబ్ద, స్పర్శ రూప రసములు, పృధివినందు శబ్ద స్పర్శ, రూపరస, గంధములు విషయరూపంగా నున్నవి. అనగా స్థూలముగా ఇంద్రియగోచరమగుచున్నవి. అందు నేత్రగోచరమగునవి పృధ్వీ జలాగ్ని సంబంధముగల వస్తువులే ఆ మూడిటి యందు రూపమను గుణము కలదు. కనుక నేత్ర గోచరములగును. వాయ్వాకాశములందు రూపగుణము లేదు. కనుక నేత్ర గోచరములు కావు. ఆత్మయందే తన్మాత్రయూ విషయరూపంగా లేదు. కనుక ఆత్మయున్ను నేత్ర గోచరము కాదు. అయిననూ నేత్రేంద్రియముతో సహా పంచేంద్రియముల ద్వారాను ఏది గుర్తెరుగుచున్నది? మనస్సుగదా! మనస్సే జ్ఞానేంద్రియములగు శ్రోత్ర, త్వక్చక్షుర్జిహ్వా ఘ్రూణముల ద్వారా శబ్ద స్పర్శ రూప రస గంధములను బాహ్యమందు గుర్తెరుగుచున్నది. అంతేకాదు బాహ్యమందు విషయరూపముగా వస్తువు లేనప్పటికీ భావనా రూపంగా అంతరమందు గుర్తించుచున్నది. స్వప్నావస్థలో అట్లే జరుగుచున్నది కదా! స్వప్నమందు జరిగే పనియేమీ మనస్సు మనస్సు చేతనే, మనస్సునే (నానారూపంగా భావించి) విషయరూపంగా భోగించుచున్నది. అనగా విన్నట్లుగా స్పర్శ చేసినట్టుగాకన్నట్లుగా, రుచిచూచినట్టుగా వాసనచూచినట్టుగా, కాశీకి పోయినట్టుగా, గంగలో మునిగి విశ్వేశ్వరునికి అభిషేకము చేసి తీర్థ ప్రసాదములు ఆరగించినట్టుగా దాన ధర్మాలు చేసినట్టుగా భావనా రూపంగా మనస్సే విషయ గ్రహణ చేయుచున్నది.

మూర్తి దర్శనము కూడా ఇట్లే అగుచున్నది. ఉదాహరణకు : విష్ణుభక్తుడు, విష్ణువు యొక్క నామరూపాలను తదేక నిష్టతో ధ్యానించుట వలన మనసు ఏకాగ్రత చెందును "మనో హిజతువతు" అనగా మనస్సు లక్కవంటిది. కరిగించి ఏ మూసలో పోస్తే తదాకారము పొందును. అట్లే ఏకాగ్రమనస్సు విష్ణువు యొక్క రూపాన్ని తానే పొంది తనను తానే చూచుకొనును. ఇదియే మూర్తి దర్శనము. అందుకే భగవానుడు గీతలో

శ్లో ॥ యే యధామాం ప్రపధ్యంతే తాంస్తథైవ
భజామ్యహం మమ వర్త్మాను వర్తంతే
మనుష్యాః పార్థ! సర్వశః॥

ఎవరు ఏ రూపంలో నన్ను సేవింతురో వారలను ఆ రూపంలో అనుగ్రహింతునన్నాడు. అనగా తనకొక నిర్ధిష్టరూపమంటూ లేనే లేదన్న మాటే కదా! ఏ మూర్తి నీ కిష్టమో, ఆ మూర్తినే ధ్యానించు నీ మనస్సా రూపమే వహిస్తుంది. నేనే నీ మనోరూపుడనై (గుర్తు రూపంగా) నీయందే వున్నానుగా "ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశ అర్జునతిష్ట"తి. కనుక ఏకాగ్రమైన

మనస్సు తన ఇష్టదైవము యొక్క నామరూపాలు వహించి ధ్యానంలో సున్నా తనకట్టెదురుగా సాక్షాత్కరించి నట్లుగా మాట్లాడినట్టుగా, వరములిచ్చినట్టుగా సర్వము గోచరించును. ఇదే మూర్తి దర్శనము ఏకాగ్రత సంసిద్ధి. భగవత్సాక్షాత్కారమైనదనే సంతృప్తి అందువల్ల లభ్యమయ్యే శాంత్యానందములు ఇష్టకామ్యములు సిద్ధించగలవనే విశ్వాసము ఇవేవాని ప్రయోజనములు.

168 **ప్రశ్న : సాధన సంపత్తి లేనిదే ముముక్షత్వము సిద్ధించే విధానమెట్లు?**

జవాబు : సాధన చతుష్టయ సంపత్తి వేరు, సాధన సంపత్తి వేరు. ముముక్షత్వము వేరు. మోక్షము వేరు "సాధన చతుష్టయ సంపత్తి లేనిదే మోక్షము సిద్ధించే విధానమెట్లు? అని మీరడుగతలచి యుండి పొరపాటుగా సాధన సంపత్తిలేనిదే ముముక్షత్వము సిద్ధించే విధానమెట్లని అడిగినట్లుగా భావించి జవాబు చెప్పుచున్నాను. సాధన చతుష్టయ సంపత్తి అనగా నాల్గు అధికారి లక్షణములు కలిగియుండుట. ఆ చతుస్సాధనములేవనగా 1. నిత్యానిత్య వస్తు వివేకము 2. ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము 3. శమాదిషట్క సంపత్తి. 4. ముముక్షత్వము. ఈ నాలుగు సాధనములున్న వాడే మాహావాక్యార్థమును శ్రవణ మనన నిధిధ్యాసములు గావించుట కధికారి అని చెప్పబడును. ఈ చతుస్సాధనల వివరణయే వేదాంత గ్రంథమందైనా మీకు లభ్యం కాగలదు.

వేదాంత విచారణకు ఫలం ఆత్మయొక్క అపరోక్షజ్ఞానం కలుగుటయే కదా! అట్టి అపరోక్షజ్ఞానం కలవారికి మోక్షం, కరతలామలకం అని చెప్పబడుతోంది. ఐతే "జ్ఞానం వినాముక్తి పదం లభ్యతే గురుభక్తితః" అని గురుగీతయున్ను "అతనికి దయవస్తే అరనిమషముననే బోధస్తితి నీకు గుదిరించు సిగ్గువిడచి కొల్వుము నీతివంతా" యని కందార్థమున్ను చెప్పుచున్నది. కనుక అధికారి లక్షణములు తొలుత లేకున్నా గురుకృప సంసిద్ధికై గురు మంత్రమనుష్ఠానము చేయు గురుభక్తునికి ఎందునూ కొరతలేదు. గురుకృపయుంటే "సద్గుణంబులెల్ల సంఘంబులైవచ్చి అసురబాలకుని యందు నలముకొనయె" అన్నారు పోతనామాత్యులు, ఆంధ్రభాగవతములొ అంటే ప్రహ్లాదకుమారునికి గల హరిభక్తి విశేషం చేత. ఆతని పవిత్రాంతఃకరణమే తమకు యోగ్యమగు నివాసమని యెంచి సద్గుణాలన్నీ గుంపులుగా వచ్చి అతని నాశ్రయించినవట. అట్లే గురుభక్తునికి శుద్ధ చిత్తం గల్గి శమాదిషట్క సంపత్తియు, యిహాముత్రార్థ ఫలభోగ విరాగాది సమస్థాధికార లక్షణములు ఈ గురుభక్తి చేతనే ప్రాప్తించును. పిదప అతడు మోక్షాధికారి కాగలడు. వస్తు నిర్ణయపూర్వకంగా నిత్యమేదో అనిత్యము ఏదో నిత్యానిత్యములనే నిర్ణయములెరుగనిది ఏదో గురుడే సచ్ఛిష్యునికి చూపించగలడు. దరిచేర్చగలడు. అందుకే కృష్ణదాసుగారు "..అపరోక్ష మౌను మనుజులకు పరోక్షంబైన బయలు గురుకృపగలుగా; కీలిదెలేని యెరుక తాతొలుగా...." అంటూ సెలవిచ్చినారు. కనుక సద్గురునాశ్రయించి గురుకృపా సంసిద్ధికై గురుభక్తి, గురుసేవ, గురునిష్ట తీవ్రముగా చేయువారు నిశ్చయముగా జయమొందెదరు.

## ప్రశ్న : పునర్జన్మ వుందా? వున్నందుకు నిదర్శనములేవి?

జవాబు : పునర్జన్మ వున్నది అనే హిందూ మతముఖ్య సిద్ధాంతము దీనిని సమర్థించు అనేక శ్రుతి స్మృతులు ప్రమాణములున్నవి. దీని విషయమై గ్రంథములే వ్రాయబడియున్నవి. ఆయా విషయములన్నియూ నిట వ్రాయుట సాధ్యము కాదు. అయిననూ సంస్కారము లేక వాసన అనుదానిని పురస్కరించుకొని చూస్తే 1. ఒకే తల్లిదండ్రుల గర్భవాసమున కొన్ని నిముషముల వ్యవధిలో పుట్టిన కవల పిల్లలకు ఒకేపరిసరములలో ఒకే శిక్షణ ఇచ్చి పెంచిననూ ఒకడు పరమ సాధువు, ఒకడు దుర్మార్గుడు అగుటకు వారి పూర్వజన్మ భిన్న భిన్న సంస్కారములు కారణమనవలెను కదా 2. ఎంతో మహాయోగ్యుడైన వానికి కూడా ఒకప్పుడు దుష్ట సంకల్పము వచ్చుటకు కారణము పూర్వజన్మ సంస్కారమేకదా? అందుకే "బుద్ధిః కర్మానుసారిణీ" అన్నారు.3. ఎన్నడూ ఈ ప్రపంచములో తాను కనీ, వినీ, ఎరుగని స్వప్న దృశ్యములు ఏల వచ్చుచున్నవి? అవి పూర్వజన్మ సంస్కార విశేషములే గదా!

4. ఒక్కొక్కప్పుడు గురుడు ఒక విషయమును అందించిన మాత్రమున శిష్యుడా విషయాన్ని గురించి తానెన్నడూ చదవుకున్నా వినకున్నా వున్నప్పటికి అది ఎక్కడో విన్నదానివలె తోచుటయూ దానిని గూర్చి గురుడు తెల్పని అనేక విషయములు వెంటనే స్ఫురించుచుండుటయు జరుగుట పూర్వజన్మ సంస్కారముగాక వేరు కారణమేమీ కాన్పట్టదు.

## ప్రశ్న : మానవునిలో అహంకార మమకారములు రహితమైన తదుపరి నిలిచియుండునది ఏది?

జవాబు : వేదాంత విషయములో "నేను" అనుట అహంకారము "నాది" అనుట మమకారం అహంకారమనగా గర్వము, మమకారమనగా వెర్రిప్రేమ, అనుట సామాన్యార్థములు 'నేను' అనునది మహాకారణ శరీరమే కాని స్థూల సూక్ష్మ కారణ శరీరములు కాదు. మహాకారణ శరీరము అన్ని జీవులందు ఏకరూపమై ఒకేవస్తువు అగుచున్నది. స్థూల శరీరమే నేను అని భ్రాంతి యందున్న వానికి, స్థూల శరీరసంబంధీకులగు పుత్ర మిత్ర కళత్ర బంధువర్గముల వారంతా నావారు అను అభిమానము కలుగును మిగిలిన వారందరూ ఇతరులగుదురు అట్లే ధన కనక వస్తు వాహనాదులయందు "నావి" అనే అభిమానము కలుగును ఈ అభిమానమే మమకారము కనుక స్థూల శరీరతాదాత్మ్యముతో నున్నపుడే మమకారముద్భవించును అట్లే సూక్ష్మ శరీరతాదాత్మ్యలచేత అందు సంబంధించిన "నేను సుఖం పొందుచున్నాను" అనియో "నేను విద్యాంసుడను" అనియో కర్తృత్వమును అహంకారమును కలుగును. అందుచే భేదభావములుదయించును. ఈ అహంకార మమకారములు ఎప్పుడు పోవును? అందరియందు ఆత్మయేకమేకాని భిన్నము గాదని ఆత్మస్వరూప నిశ్చయము గల జ్ఞానికి మాత్రమే అహంకార మమకారములు రహితమగును. నేను ఆత్మస్వరూపుడను " మమాత్మ సర్వభూతాంతరాత్మ" అనే భావము మాత్రమే మిగిలియుండును.

191 **ప్రశ్న : భ్రాంతి రహితము (పూర్ణబోధ) కోరేవానికే గురుమూర్తి అవసరంగాని యితరులకు గురువవసరం లేదనుచున్నారు ఎందుచేత?**

జవాబు : అద్వైతులు ఆత్మయే బ్రహ్మమని, మహావాక్య విచారణచే సాధించుటకెన్నో గ్రంధములను వ్రాసిపెట్టినారు. అట్టి ఆత్మకంటే వేరే ఏమిలేదని అంటున్నారు పరిపూర్ణ భావజ్ఞులు సృష్టికారణమైన ఈ ఆత్మకంటే అతీతముగా పరిపూర్ణ పరబ్రహ్మము మనోవాగగోచరముగా అయినది. "ఆత్మాతీతం, కేవలాత్మ" అని చెప్పబడేది కలదని సిద్ధాంతం చేసినారు మనస్సుకు వాక్కుకు అందరాని దాని కొరకు గురువు అవసరం కాని అన్ని గ్రంధాలలోనూ విచారింపబడి మాట చేతనూ మనసు చేతనూ గ్రాహ్యము కాదగిన దానికి గురువు యొక్క అవసరమేమి?

192 **ప్రశ్న: అనేక శాస్త్రగ్రంధములున్నవి. వాని వలన భ్రాంతి రహితము కాదా?**

జవాబు : కాదు భ్రాంతి అనగానేమి? భ్రాంతికి మూలకారణమేమి? భ్రాంతికి మూలకారణమే ఏదో దానియందు, అదే బ్రహ్మమని భ్రాంతి కల్గినది. ఈ భ్రాంతి తొలగని వారికి భ్రాంతి రహితము అయినదని చెప్పవచ్చునా? భ్రాంతి యనగా "భ్రం" అను ధాతువునుండి యుత్పత్తి "భ్రం" అనగా చలించుట భ్రమ, భ్రాంతి అనునవి మనస్సు యొక్క చలనములో జనించును అన్ని చలనములకు మూలము అది చలనము. సృష్టి కారణవస్తువునందే వున్నది. సృష్టి సంకల్పమే చలనము అన్ని భ్రాంతులకూ మూలం. మూలం లేని గుర్తెరిగే శరీరమన్నారు దీక్షితుల వారు. భ్రాంతికి మూలకారణమైన (సృష్టికి మూలకారణమైన) వస్తువునే పరబ్రహ్మమని యితరులు నిర్ణయించినారు. శాస్త్రగ్రంధములు కూడా అట్లే వ్రాసిపెట్టినారు. భ్రాంతి కారణమైన వస్తువును చూపించి అదే బ్రహ్మమని చేప్పే శాస్త్ర గ్రంధముల వలన భ్రాంతి రహితమగునా.

192 **ప్రశ్న : సత్యము అసత్యములకు గలతేడా యేమి? సత్యము, అసత్యము ఒకటేనా లేకరెండా?**

జవాబు : వున్నది వున్నట్లు పలుకుట, భావించుట సత్యము. వేరురీతిగా పలుకుట భావించుట సత్యము కాదు, అసత్యమనబడును. ఒకేదాని విషయమున సత్యాసత్యములనే ద్వంద్వ ప్రసక్తి ఏర్పడుచున్నది. యిది సత్యము. యిది అసత్యము అని నిర్ణయించేది ఒకటే వస్తువు సత్యాసత్యములనే నిర్ణయమెరుగనిది వేరే వస్తువు "సత్యమగు బట్టబయలు అసత్యమగు యెరుక" అన్నారు కృష్ణదేశికేంద్రులు. ఎప్పటికీ ఏకరీతిగా తనయందు అన్యమేమి లేనిదానిని సత్యవస్తువు అన్నారు. ఆ పరిపూర్ణ పరబ్రహ్మమందేది లేదో అది అసత్యమన్నారు.

194 **ప్రశ్న : అశరీరం సర్వదా అస్తిశరీరం రహితం సదా అయుయేవ సద్యోముక్తి రన్యదాభ్రమకారణం అను శ్లోకమునకు అర్థ తాత్పర్యములేవి?**

జవాబు : అశరీరం = శరీరం లేనిది

సర్వదా = ఎల్లప్పుడూ

అస్తి = ఉన్నది

శరీరం = గుర్తెరిగే శరీరం (యెరుక)

సదా = ఎల్లప్పుడు

రహితం = లేనిదే

అయయేవ = ఈ విధంగా మాత్రమే

సద్యోముక్తి = తక్షణమే ముక్తి కలుగుచున్నది

అన్యథా = ఇతరవిధములన్నియూ

భ్రమకారణములే = భ్రాంతి కారణములే

తాత్పర్యము : పరిపూర్ణ పరబ్రహ్మమే పరమ శాశ్వతము గుర్తురిగే జ్ఞానము దాని యందు త్రికాలములయందు లేనే లేదు. ఇట్టి బోధ దృఢమైన తక్షణమే సర్వభ్రాంతి రహితము అగుచున్నది లేనిచో భ్రాంతి విస్తరమే యగును గాని తరుగదు. పూర్ణబోధ యంతయూ సూత్రప్రాయంగా యీ శ్లోకమునందిమిడ్చినారు. తెలివియే సకల సంకృములకు సకల సుఖదుఃఖానుభవములకు సర్వభ్రాంతులకు మూలకారణము కేవలం పరిపూర్ణ పరబ్రహ్మయందు యిట్టి భ్రాంతి కారణవస్తువు లేనేలేదు. తెలివిచే తెలియబడినది కూడా తెలివివంటిదే అగును. ఈ విషయము దృఢమైన వానికి జీవితమునందు కలుగు సుఖదుఃఖాది ద్వంద్వములు స్వప్నానుభవముల వంటివే అను నిశ్చయజ్ఞానము కల్గి పరమ శాంతియే మోక్షము అట్లుగాక జ్ఞానము, సత్యము పరమశాంతిలో వుండును. ఇట్టి శాశ్వతము అని బోధించు ఇతర ప్రబోధలయందు అజ్ఞానముతో పాటు ఆ జ్ఞానమునకు కలుగు సంకల్పాది సుఖదుఃఖములు సర్వము సత్యేమేనను బుద్ధి కల్గి భ్రాంతి విస్తారము కాగలదేగాని దుఃఖ ద్వంసరూప మోక్షము యెన్నటికి కలుగజాలదు. శుద్ధజ్ఞానమనీ మలిన జ్ఞానమనీ రెండు లేవు. జ్ఞానాజ్ఞానములు రెండూ ఒకే జ్ఞానానివి అని మరువరాదు.

ప్రశ్న : **మనస్సు చంచలమైనదిగదా! దానిని నిశ్చలములగా నుంచు ఉపాయమేది.**

జవాబు: ముందుగా మనస్సు జడమా? లేక చేతనమా? అని విచారిస్తే మనస్సు మిగతా ఇంద్రియముల వలనే జడమనీ అయిస్కాంతము యొక్క సత్తాచేత ఇనుప సూది చలించినట్లు, ఆత్మ సత్తాచేత మనస్సునకు చలన వ్యాపారము కలుగుచున్నదని తెలుసుకోవలెను. సూది చలించకుండా ఉండుటకేమీ చేయవలెను? అయిస్కాంతమును తొలగించవలెను. అ

సర్వమునకు చేతన సత్తానొసగు ఆత్మకు పరిపూర్ణ బ్రహ్మమందు మూలనుగాని స్థానము గాని లేదు. అందీ యెరుక పుట్టనే లేదు అను నిశ్చయజ్ఞానము గురు కృపవల్ల దృఢమైతే ఆ యెరుక కోరలు పెరిగిన త్రాచువలె నిర్వీర్యమై పోవును. అప్పుడది మనస్సునకు ఎట్టి భ్రాంతులను కల్గింపజాలదు. మనస్సు చెలించిననూ సుఖదుఃఖ హేతువు గాదు. మనస్సుండియూ లేనిదే యగును యిదియే సహజా మనస్క రాజయోగము. యితరములగు యే యోగ పద్ధతులచే అ మనస్కమొనరించవలెననినా అది తాత్కాలికమూ, కృత్రిమమూ మాత్రమే కాగలదు. ఎరుక కూకుడు వేరునే ఛేదించిన విధానము కాజాలదు.

మనస్సునందు చలనాంశము ఏడుపాళ్ళు అచలాంశము ఒక్క పాలే. కనుక దానిని నిశ్చల మొనర్చుట అనేది యేటికెదురీత యని గుర్తించవలెను. బహుకష్టపడి బలాత్కార పద్ధతులచే దానిని అణచి పెట్టినను త్రాచుపాము పడగను త్రొక్కి పెట్టినట్లే కాగలదు. పట్టు వదలితే పట్టి పీకును. కనుక అట్టి పద్ధతులు నిరర్ధకములు అచలబుషుల ప్రభోదించు మార్గమననుసరించి పూర్ణబోధ దృఢపరచుకొన్న వారికి మనసు ఏకాగ్రతలోనున్నా అనేకాగ్రతలోనున్నా, శూన్యాగ్రతలోనున్నా ఏమీ బాధలేదు.

(196) ప్రశ్న: **లింగ శరీరభంగమనగా నేమి?**

జవాబు : దీనిని గురించిన అచలబుషుల భావమును శ్రీకృష్ణదేశికేంద్రులవారు తమ కందపద్యములలో ఇట్లు శెలవిచ్చియున్నారు. 1. కం॥ అంగము, లింగము, గలసుటే, లింగశరీరంబటంచు లెక్కకు వచ్చెన్, లింగం భంగము నెడసిన లింగముళక్కొను. నేనే లింగంచనినన్ 2. కం॥ లింగము విక్షేపంబన అంగంబావరణమనిన నగునీరెండే లింగ శరీరము. దీనికి భంగము తనమూల మరయబడినప్పుడగున్.

అంగమనగా శరీరము, శరీరమనగా సూక్ష్మ శరీరమేకాని స్థూల శరీరము కాదు. లింగమనగా "నేను" అను గుర్తు సకల విక్షేపములకు మూలమిదియే గుర్తుతో అనగా తెలివితో కూడిన సూక్ష్మశరీరమే లింగశరీరమనబడును. మనస్సు తెలివిరూపము ప్రాణము దానికావరణమగు సూక్ష్మ శరీరమని ప్రకారాంతరముగా చెప్పవచ్చును. కనుక మనఃప్రాణముల చేరికయే లింగశరీరము యిదే జన్మాంతరముల పొందునది యీ ప్రాణమనస్సులకెడబాటు కల్గినచో అప్పుడు మాత్రమే లింగశరీర భంగమగును. ఈ భావమునే "అన్నపు సూక్ష్మాంశము మనస్సు యెన్న గనీరంబు ప్రణమిారెండెన్నడూ కలియువో నాడే సున్న సుమీ యెరుక మాట సుగుణ సంపన్న" అన్నారు. అయితే విక్షేపరూపమగు లింగము పరిపూర్ణ పరబ్రహ్మమందు లేనే లేదని ధృఢమైననాడు కాని యీ లింగశరీరము భంగము కాదని పైనచెప్పిన రెండవ కందపద్యము తెలియచేయుచున్నది. అప్పుడుగాని విక్షేపరూపమగు మనస్సు (లింగము) నకు ప్రాణముతో యడబాటు కాదు. యీ విక్షేపరూపమగు మనస్సు సుషుప్తి, మూర్ఛ, మరణము, సమాధి మొదలగు వానియందు తాత్కాలికంగా పనిచేయకున్ననూ

దానికావరణమగు ప్రాణసంబంధము సంపూర్ణముగా ఎడబాటు చెందుటలేదు. కనుక పరిపూర్ణబోధవలన గాక లింగశరీరము భంగము కాజాలదని తెలియవలెను.

ప్రశ్న : **జీవాత్మ పరమాత్మలకు బేధమేమి? వారిలో కర్తయెవరు?** జవాబు : జీవము అనగా ప్రాణము. ప్రాణమునకు చలనమే గుర్తు, కదలికగలవానికి జీవమున్నదనీ అదే చేతనమనీ కదలిక లేనిదానికి ప్రాణము లేదని జడమనీ మనం వాడుచున్నాము. ఆత్మ కదిలే ప్రాణుల యందు ప్రాణముతో కలసి సకల వ్యాపారములు నడిపించునపుడు జీవాత్మ అనబడుచున్నది. ప్రాణముతో కలియకుండా ప్రాణమునకు చలనము కలిగించుటకు సత్తా యిస్తూవున్నపుడు అది సాక్షియనీ ప్రత్యగాత్మయని పేరొందినది ఎన్ని పేర్లతో వ్యవహరించిననూ వాక్కు భేదమ్ములేకాని వస్తువు ఒక్కటే. స్థానక్రియా భేదములను బట్టి పేర్లు వేరే వేరే పెట్టుకొని వ్యవహరిస్తున్నాము. ఎట్లనగా బ్రహ్మము పరమాత్మ, ప్రత్యగాత్మ, జీవాత్మ అను నాల్గింటియందూ వున్న వస్తుతత్వమొక్కటే. బ్రహ్మాండమందు ఈశ్వరుని నాల్గవ శరీరముగా వున్నదానిని పరమాత్మయనిన్ని, పిండాండమందు జీవునికి నాల్గవ శరీరముగా వున్నపుడు ప్రత్యగాత్మయని పేర్లు జీవేశ్వరులుభయములకూ పూర్వమున్న దానికే బ్రహ్మమనే పేరు. ఆత్మయని మాత్రమే వ్యవహరించినపుడు అది జీవాత్మ, ప్రత్యగాత్మ, పరమాత్మల మూడింటికి చెల్లును. ఆ వస్తువే సృష్టికి పూర్వము సర్వవ్యాపకరూపంగా నుండి "ఏకమేవా అద్వితీయం బ్రహ్మ" అని కొనియాడబడింది. ఐతే కర్తయెవరు? పిండాండమందు ప్రత్యగాత్మ ప్రకాశములేనిచో, జడమైన ప్రాణమునకు కదలికే కలుగదు. ప్రాణచలనము లేకుంటే జీవునికి చేతనముగాని యింద్రియముల యొక్క వ్యవహారముగాని లేదు. కనుక జీవవ్యవహారమునకు ప్రత్యగాత్మయే కర్త అట్లే బ్రహ్మాండమందు కాలత్రయములకు నవగ్రహాదుల చలనములకు సృష్టి స్థితి లయములకు సమిష్టి ప్రాణ చలనమే కారణం ఆ చలనమునకు సత్తా ఇచ్చునది పరమాత్మ ప్రకాశము కనుక పిండాండ బ్రహ్మాండ క్రియలకు ప్రత్యగాత్మ పరమాత్మలు కర్తలుగా వున్నారు. ప్రత్యగాత్మ పరమాత్మలు రెండు వస్తుతహ ఒకటే అయినప్పుడు సర్వమునకు అఖండ ఆత్మ లేక స్వయంప్రకాశమగు బ్రహ్మమే కర్త. కనుకనే కృష్ణదేశికేంద్రులవారు తమ కందార్థములలో "ఆటాడి ఆడుకుండును" అని సెలవిచ్చినారు.

ప్రశ్న : **ఎరుకకు మూలం లేదు కొనకు ప్రవేశించేటందుకు స్థానం లేదు అని శివరామ దీక్షిత సిద్ధాంతం కదా! మధ్యవచ్చి మధ్యపోయే దానికి మళ్ళా జన్మ ఏమి?**

జవాబు : ఎరుక యనగా నేమి? వస్తు నిశ్చయరూపంగా గురుముఖతః గుర్తెరిగిన వారికీ ప్రశ్నకు జవాబు తేలికగా అర్థము కాగలదు. ఆ యెరుక పరిపూర్ణమున గదా తోచినది. యెరుకతోచబడక పూర్వమే పరిపూర్ణముండెగదా! కనుక అది మధ్యనే తోచినదన్నారు. పరిపూర్ణమెప్పటికీ వుంటుంది కనుక నున్ను. ఎరుక పోయేది కనుక నున్ను మధ్యనే పోతుందన్నారు. మధ్యవచ్చి మధ్య పొయ్యేవి జీవోపాధులను కొనుట పొరపాటు. మధ్యవచ్చి

పోవు యెరుకకు వేరే మూలం లేదు. కొనకు ప్రవేశించ వేరేస్థానము లేదు అనగా యెరుకకు యెరుకే మూలము యెరుకే స్థానము గాని యెరుక కన్యమైన పరిపూర్ణము, యెరుకకు మూలముగాదు అని అర్థము. అట్లే ఎరుక పుట్టనేలేదు అనే మాటకు పరిపూర్ణమందు పుట్టనే లేదని మాత్రమే అర్థము ఎరుక యందే యెరుకకు జన్మపరంపరలు కలుగుచున్నవనీ పుట్టి చచ్చే యీ వుపాధులకు ఎరుకే మూలమూ స్థానమూ అయివున్నదనీ కానీ ఆ మూలమైన యెరుకకు పరిపూర్ణమందు మూలము గాని స్థానముగాని లేదనిన్నీ తెలుసుకోవలెను. పర్యవసానమేమనగా పరిపూర్ణములో దోచిన యెరుకే కలరూపంగా తోచి ఎరుక యందు జీవులు పుట్టి చస్తున్నారని సిద్ధాంతం.

[199] **ప్రశ్న: చనిపోయిన వ్యక్తి మరల పుట్టుననుటకు అనుభవమేమి?**

జవాబు : పునర్జన్మ సిద్ధాంతమును బలపరచు యుక్తి ప్రయుక్తులు శ్రుతులు యన్నేని గలవు అవి అన్నియు చర్చించుటకు వేరే గ్రంథమే కావలసియుండును. ఐతే సూటిగా అనుభవ విషయమొక్కటి చక్కగా విమర్శించినచో యీ సిద్ధాంతము యొక్క సత్యత్వము ఋజువు కాగలదు. నిన్నటి రోజున జాగ్రదవస్థయందు నేను చేసిన పనుల యొక్క స్మృతి నా మనస్సునందు హత్తుకొని పిదప గాఢ నిద్రలో సర్వము మరచితిని నిద్రలేచి నిన్న చేసిన పనుల యొక్క ఫలమును ఈ రోజున అనుభవించితిని. ఉదాహరణకు నిన్న బజారున మామిడిపండ్లుకొని యింటికి తెచ్చి దాచితిని. యీ రోజున జ్ఞాపకముంచుకొని తింటిని కొన్నింటిని రేపటెల్లుండి తినుటకూ మరల దాచితిని. వర్తమాన శరీరము యీ దినపు జాగ్రదవస్థవంటిది. మరణము యీ దినము నేను పొందే సుషుప్తి వంటిది. పునర్జన్మ రేపటి రోజు వంటిది ఒక్క తేడా మాత్రమున్నది. నిన్న తెచ్చి దాచిపెట్టుకొన్న పండ్లనే యీ రోజున తింటున్నానని నాకు జ్ఞప్తి యున్నది. ఇపుడు తటస్థించు సుఖదుఃఖములు పూర్వజన్మ కర్మఫలములెట్లుయినవో మరచి ఆ ఫలములు యాదృచ్ఛికములనీ లేక కేవలం దైవదత్తములనీ లేక తన ప్రయోజకత్వముననో విధివైపరీత్యము చేతనో సాధింపబడినవనీ మానవుడెంచు చున్నాడు. తేడా యింతియే.

[200] **ప్రశ్న : మాంసభక్షణము హింస అని కొందరూ, పరమాత్మ కర్పించి [illegible] కొందరూ అంటారు. ఏది శ్రేయస్కరము?**

జవాబు : ఈ ప్రశ్నలో ఒక లోపముంది ఎవర్కి శ్రేయస్కరము. ఎవరికీ శ్రేయస్కరం కాదు అని కూడా మీరడగవలసింది. పారమార్థక సాధకులగు వారికి అనగా ఆత్మబలం ఆసించిన వారికి శ్రేయస్కరం కాదు.శాఖాహారమైనా, ఉల్లిపాయలు మినుములు మొదలగువానివలె మాంసము తమోగుణ ఆహారము కనుక సత్వసంపత్తి కోరువారికి వర్జనీయమే. శరీరబలము అవసరమైయున్నవారికి మాంసాహారము వుండవలసిందేగదా! ఏది తిన్నా పరమేశ్వరుని కర్పించి తినుట సదాచారమే. తమకు ప్రీతికరమైనదే భగవంతునికి కూడా ప్రీతికరముగా

భావించి తమ వ్యక్తిత్వము విడువలేక తాముపయోగించే మధుమాంసములే కొందరు నివేదిస్తే, పానకం వడపప్పులనే కొందరు నివేదింతురు. నివేదించినంత మాత్రమున వస్తుగుణమునే సామాన్యులు మార్చివేయగలుగుదురా?

ప్రశ్న : **మానవుడు అనగా నిర్వచనమేమి?** (201)

జవాబు : మనువు సంతతివాడు గనుక మానవుడని చెప్పబడినది. బాగుగా వికసించిన మనస్సుగలవాడు కనుక మానవుడని కూడ చెప్పబడినది. "మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః " అని చెప్పబడుతోంది. ఈ మనస్సే జ్ఞానేంద్రియముల ద్వారా విషయపంచకముచే నాకర్షింపబడి తదనుగుణ్యమగు కర్మచేసి బంధమున తగులుకొనుచున్నది. విషయ పంచకముచే నాకర్షింపబడక నిర్విషయమై బ్రహ్మావలోకనముచే ఈ మనస్సే మోక్ష కారణమున్ను అగుచున్నది" మనసైవానుద్రష్టవ్యం" అనీ "ఆత్మావారేదృష్టవ్య శ్రోతవ్య మంతవ్యోనిధి ధ్యానితవ్యః" అనీ శ్రుతులు చెప్పుచున్నవి. శ్రవణ మనన నిధి ద్యాసలు చేసి, తద్రూపం వహించుటద్వారా ఆత్మ సాక్షాత్కారం పొందిననూ యీ మనస్సే, అట్లే మనస్సు అనే దివ్యమగు పరికరము గలవాడు మానవుడు అని తెలియవలెను.

ప్రశ్న : **పరిపూర్ణ సిద్ధాంతం తెలుసుకొనుటకు ముముక్షువులు చాల ఆసక్తిపడుచున్నారు ఎందుచేత?** (202)

జవాబు : వారికి నిజమగు ముముక్షత్వము (మోక్షాపేక్ష) వుంటే ఆసక్తి యుండుటలో ఆశ్చర్యమేలేదు. ఏలననగా పరిపూర్ణబోధ యొక్కటే నిజంగా జననమరణ భ్రాంతి రహితమునకు మార్గము. మోక్షాపేక్ష లేనివారెవరు? కాని అట్టి ఆపేక్షగలవారందరూ ముముక్షువులు కానేరరు "పరిపూర్ణబోధ అతిసులభమనీ, దాని నెరుగుటకు అధికార లక్షణమూ అవసరం లేదనీ ఏ సాధనలు లేని గొప్ప బోధయనీ, వున్నది పరిపూర్ణము లేనిది యెరుక అని దృఢం చేసుకొంటే పాపపుణ్యాలు కూడా ఏమీ అంటవనీ గురువును గొల్చుకుంటూ వుంటే చాలుననీ స్వార్ధ గురువులు ప్రచారము చేయుట, తాముకూడ తమ గురువులవలె యిది యొక వృత్తిగా స్వీకరించి పొట్టపోషించుకొనవచ్చునని యెంచుట, యిందుకు కారణములు.సద్గురువు లభించుట, వస్తు నిశ్చయముగా బోధనెరుగుట, త్రికరణశుద్ధిగా గురుబోధనాచరణయందుంచుట, ఆరూఢత సిద్ధించుట అనునవి పూర్వపుణ్య విశేషంచే మాత్రమే సిద్ధించును.

ప్రశ్న : **అందరూ పరిపూర్ణ భావోద్ధారకులవ్వాలంటే సద్గురువులు యొక్క క్రమశిక్షణ లేవి?** (203)

జవాబు : అట్టి క్రమశిక్షణ సద్గురువుల పాదాల చెంత అంతే వాసియై క్రమముగా సచ్ఛిష్యుడు నేర్వవలసినదే. అట్లుగాక గురుపాదము పట్టి తగిన కట్నమిచ్చి మరునాడే తానొక గురువై పరిపూర్ణ బోధను తానుద్ధరించుచున్నాని అపోహచెంది "తన్నుతానెరుగడు తానెవ్వనికి చెప్పపాలు

మాలిన అట్టి పశువు కొడుకు" అనే న్యాయంగా తాను చెడినదే గాక లోకమును వంచించు స్వార్థగురువు యిహపరముల రెంటికీ చెడును. మీ వెర్రిగాని అందరూ పరిపూర్ణ భావాద్ధారకులవుతారా? లోకంలో రాళ్ళెన్ని? రత్నాలెన్ని? నిజగురువు పరిపూర్ణ బోధ నుద్ధరిస్తున్నాని యెన్నడనుకోడు. గురురుణం తీర్చుకొనుటకై (యితరవిధంగా తీర్చలేడు గనుక) తాను గురువై నిస్వార్థముగ లోకకళ్యాణార్థం సేవారూపంగా ప్రచారం చేయును.

ప్రశ్న : **ఈశ్వరుడు జీవుల కర్మానుసారం సుఖదుఃఖములను సరిగా తూచియిచ్చు నధికారి మాత్రమేనని మీరు లోగడ వ్రాసినారు. అయితే యీ ఈశ్వరుని ప్రయోజనమేమి?**

జవాబు : జీవితంలో తన సుఖం కొరకు మానవుడెంత ప్రయత్నించినా మహాశక్తియుక్తుడగు ఒక అదృశ్య వ్యక్తియొక్క కృప తనకు లేకున్న తనకపజయం కలిగినదని భావించి, ఆ యీశ్వరుడు కూడా భూషణ దూషణ తిరస్కారాదులకు వశుడై వుంటాడని యెంచి తన స్తోత్ర జపాదులచే నాతని నుబ్బించి తన కార్యసాఫల్యం పొందాలని తొలుత కామ్య సంకల్పములచేతనే మానవుడీశ్వరుని యుపాసించును. క్రమశః స్తోత్రజపతపాదుల గావించి దైవకృపకై తహతహలాడిన కొలదీ అతని మనస్సేకాగ్రమగుట ధైర్య స్థైర్యములు గలుగుట, అంతఃకరణమందు శాంత్యానందములు కలుగుట అనునవి, దైవభక్తికి ఫలితముగా లభించును. దుఃఖమయమగునీ ప్రపంచమున ఈశ్వరాదిక్యత నంగీకరించిన నిజభక్తుడెన్నడు నిరాశ చెందడు. తదితరులైతే నిస్పృహ నిరాశోపహతులై ఆత్మహత్యచేసుకొనుటో, లేక తమ కామ్యసిద్ధి కడ్డునిలిచిన వారిని నాశనమొనర్చ ప్రయత్నించుటో జరిగింతురు. ఈశ్వరాస్తిక్యత అంగీకరించుటయే మానవులకు శ్రేయోదాయకము కనుక ముముక్షువు ఆ యీశ్వరుని తన యిష్టదైవ రూపములోనో సగుణ నిర్గుణ స్వరూపుడగు గురుని రూపంలోనో వుపాసించి కృత కృత్యుడు కాగలడు.

ప్రశ్న : **ఎట్టి స్వప్నమూ రాకుండ నుండుటకై ఎట్టి ఆచరణ యుండవలెను?**

జవాబు : జాగ్రత, స్వప్న, సుషుప్తులనే మూడవస్థలును అంతఃకరణ ధర్మములై యున్నవి. ఏలననగా వ్యక్తి యొక్క అంతఃకరణమునందే ప్రారబ్ధరూపంగా యీ జన్మలో తాననుభవించవలసిన సుఖ దుఃఖములకు కారణములైన సంస్కారములను (ఆగామి) ఈ జన్మలో చేసిన కర్మయొక్క సంస్కారములున్ను అణగి మణగి సూక్ష్మరూపంగా యిమిడివుండును. జాగ్రత్స్వప్నములలోని సుఖ దుఃఖరూప కర్మానుభవము యీ సంస్కారముల పై ఆధారపడియుండును. సంస్కారముల కాశ్రయము, నాధారమూ అయిన అంతఃకరణమున్నంత వరకు స్వప్నము వచ్చుచునే యుండును. అంతఃకరణము ఏవిధంగా పోవును? పరిపూర్ణ పరబ్రహ్మమందు లేకనే, వున్నట్లు గానవచ్చే యెరుకయే వ్యష్టి సమిష్టి రూపమగు అంతఃకరణముగా నున్నది. కనుక గురుకృపకు పాత్రుడై గురువు చెప్పిన ఆచరణ గలిగి పూర్ణ బోధయందు ఆరూఢత గావించిన వానికి స్వప్నము పడదు.

ప్రశ్న : **జాగ్రదావస్థలోయున్న ధనకనక వస్తువాహనాదులు, స్వప్నావస్థలోనే పనికి రాకుండా వుంటే చచ్చినవారికై చేయు దానధర్మాల పుణ్యఫలము చనిపోయినవాని శ్రేయస్సుకై యెట్లు ఉపయోగపడును?** 206

జవాబు : దేశకాల పాత్రల తారతమ్యము గుర్తెరిగి, చేయు దానధర్మముల వలన దాతకు పుణ్యము లభించుననుటలో భిన్నాభిప్రాయముండజాలదు; దాతకు లభించే పుణ్యఫలమును యితరులకు అందునూ చనిపోయిన వానికి సంక్రమింపచేయగలడా? ఏవేవో సాధనలు చేసి సిద్ధిని సాధించిన వారు, తమ యోగశక్తిని గాని మంత్రశక్తిని గాని ప్రయోగించి యితరుల రోగనివారణాది కార్యములను సాధించుట ప్రత్యక్షమే. యిది యెట్లు సాధ్యము? ఏకాగ్రమగు మనస్సుకట్టి శక్తులు కలుగు ననుటకు యెట్టి అభ్యంతరమూ వుండజాలదు. ఇక చనిపోయిన వ్యక్తికి ఆ పుణ్యఫలము చెందవలెనని ఏకాగ్ర మనస్సుతో అట్టి మంత్రవేత్త లేక యోగి సంకల్పించిన పక్షంలో అది నెరవేరుటకు అభ్యంతరముండరాదు. విశ్వామిత్రుడు తన తపోఫలమును ధారబోసి త్రిశంకు మహారాజుకు వేరే స్వర్గమే సృష్టించేడని పురాణగాధయున్నూ కలదు. ఈ కాలంలో శ్రాద్ధాదుల యందు చేసే దానధర్మాల పుణ్యఫలము పితరులకు చెందుతుందా? కర్తకు త్రికరణశుద్ధి, సంకల్పసిద్ధి వుంటే మాత్రము అది సాధ్యమేనని చెప్పవచ్చును. లేనిచో ఆ ఫలము తనకేనా వుండగలదు కనుక సమర్థులు ఏ వంకచేనైనా దాన ధర్మాలు చేయుటయే మంచిది.

ప్రశ్న : **భగవద్గీతను పారాయణచేసి మహాత్మ్యం చదువకపోతే ఫలితం లేదన్నారెందుచేత?** 207

జవాబు : ఏ ఫలితమాసించి పారాయణ ప్రారంభించాడో ఆ ఫలితం ఆ పారాయణము వల్ల నెరవేరేది లేనిదీ మహాత్మ్యం చదివితే తెలుస్తుంది. ఆ మహాత్మ్యంలో ఆ కామ్య సంసిద్ధికూడా చెప్పబడి వుంటే తన పారాయణ ఫలిస్తుందని విశ్వాసం దృఢమౌతూ వుంటుంది. యింకా ఎక్కువగా పారాయణ చేయాలని ప్రేరణయున్ను కలుగుతూ వుంటుంది. యింతకూ నిష్కామ కర్మ చేయాలని గీత ప్రభోదిస్తూ వుంటే, మహాత్మ్యం చదువుకొంటేగాని నీకు ఫలప్రాప్తి కలుగదంటూ చేప్పె మాట కెంత విలువ యివ్వాలో యోచించండి. ఐతే యిక్కడ రెండు ప్రశ్నలు ఎదురౌతాయి. 1) ఏ కోరికా లేనివాళ్ళు మహాత్మ్యం చదవక్కర్లేదా? అవును. ఏ ఫలితం ఆసించని వాళ్లకు మహాత్మ్యం తెలుసుకొనే అక్కర్లేదు. పారాయణతో పాటు మహాత్మ్యం కూడా చదువుతూనూ వుండక్కరలేదు. 2) కోరికలు లేని వాళ్లకు పారాయణ చేయుట వల్ల అసలు ఏమైనా ప్రయోజనముంటుదా? ఆహా! వుంటుంది. గీతా ప్రభోధం దృఢమవుతూ వుండడము. ఆ ప్రకారం ఆచరిద్దామని హెచ్చరిక పదే పదే కలుగుతూ వుండడం " చెప్పగా చెప్పగా బ్రహ్మకేనా పుట్టు రిమ్మ తెగులు" అన్నట్లుగా కర్మకౌశలమెరిగి, కర్తృత్వ రహిత కర్మాచరణ చేసే కర్మయోగియై స్థిత ప్రజ్ఞుడు కావడం ప్రయోజనం. యీ

ప్రయోజనాలు మాత్రం కోరికలు కావా? కావు ఐహికాముష్మిక సుఖములాసించుటయే కోరిక మోక్షం కోరిక కాదు.

**ప్రశ్న : బ్రహ్మ విద్య కేవల జన్మ శూన్యము కొరకేనా? లేక యింకేమైనా ఫలితముందా?**

జవాబు : జన్మరాహిత్యం సిద్ధిస్తుందో లేదో అని ఎవరికైనా అనుమానముంటే వుండవచ్చును గాని బ్రహ్మ విద్య వలన అంతకంటె ప్రత్యక్ష ఫలం కూడా వున్నది. మానవ జీవితం జన్మ మృత్యుజరావ్యాధులతో గూడిన స్థూల శరీరమందు కామక్రోధ లోభ మోహ భయదుఃఖాదులతో గూడిన అంతఃకరణము కల్గి అశాంతి సాగరమై వున్నది. ఎంతటి బలధన విద్యా, కీర్తి ప్రతిష్ట మహత్తులు కలవాడైనా అష్టఐశ్వర్యములు భోగభాగ్యములు అణిమాద్యష్ట సిద్ధులు కలవాడైననూ ప్రయోజనం లేదు. దుఃఖ సమ్మిశ్రితం గాని, దుఃఖలేశం గాని లేని మానవజన్మ లేనేలేదు. మానవ జన్మయందు దుఃఖము 90 పాళ్ళు సుఖం 10 పాళ్ళు అని చెప్పబడింది. బ్రహ్మవేత్తకున్ను సుఖదుఃఖములు తటస్థించుచునే వుండును.

ఐతే బ్రహ్మవేత్తకు అంతఃకరణ దర్మములైన కామక్రోధాదులు నశించును. నిష్కామ, నిర్మోహ, నిర్భయత్వములు కల్గును. అంతము ఆత్మస్వరూపమైయుండగా, ఏది కోరును. దేనిని ద్వేషించును. దేని విషయమై భయపడును? పరిపూర్ణ బోధ నెరిగిన అశరీరులకు పరిపూర్ణ బ్రహ్మమందెరుకే లేదని ఆరూఢత గల్గినందు వలన వారు సహజా మనస్కరాజయోగ రీవితో అశాంతి సాగరమగు సంసారము నందుండియే ప్రశాంత చిత్తులై యుండగలరు. ఇదియే బ్రహ్మవిద్యకు ముఖ్యఫలము జనన మరణ భ్రాంతి గూడా జీవించి యుండగానే రహితం కాగలదు. ఎందుకంటే ఎరుకే లేకుంటే జనన మరణాలిక దేనికి?

**ప్రశ్న : గుర్తువుంటే గురుద్రోహమన్నారు గ్రంథాలలో ఆ వివరం ఏమిటో తెలియపరచండి?**

జవాబు : గుర్తేలేకుండా నల్లరాయివలె పడియుండే గురువులు గాని శిష్యులు గాని కలరా లేకుంటే గురుశిష్యులుగా వుండే వారంతా గురుద్రోహులేనా? పరిపూర్ణ పరబ్రహ్మమును దాని యందు లేనేలేని యెరుకను గురుముఖంగా గుర్తెరిగి, గురుబోధచే అట్టి గుర్తుకు పరిపూర్ణ పరబ్రహ్మమందు మూలంగాని స్థానం గాని లేవని తృప్తిపడి, ఆ పిమ్మట తిరిగి ఆ యెరుకయే బ్రహ్మమని గాని, పరిపూర్ణము యెరుకకంటే భిన్నంగా లేదని గాని చాటే శిష్యుడు గురుద్రోహి "గుర్తువుంటే" అని వుండదు. "గుర్తు వున్నదంటె" (గుర్తు సత్యత్వనిత్యత్వములు గలదంటె) అని వుండి యుండవచ్చును. ఒకవేళ యేగ్రంథములోనైనా "గుర్తువుంటే" అని వున్నచో దాని యర్థమునీరీతిగా గ్రహించవలెను. ఎందుచేతనంటే సత్యము ఒక్కటే. అసత్యము లనేకముండవచ్చును. అట్లే సత్యత్వ నిత్యములు గల వస్తువు ఒక్కటే "ఏకమేవా అద్వితీయం బ్రహ్మ" అను శ్రుతి యొక్క తాత్పర్యమిదే. పరిపూర్ణము, యెరుక అను రెండు సత్యములుండరాదు. పరిపూర్ణము, సత్యము అంటే, యెరుక అసత్యమనాలి. ఏరుకే

సత్యమంటే పరిపూర్ణమసత్యమనాలి. కనుక శ్రీకృష్ణదేశికేంద్రులు సెలవిచ్చినట్లు "సత్యమగు బట్టబయలు నసత్యమగు యెరుక నెరిగి సద్గురు కృపచే, సత్యముగాదని, యెరుకను సత్యముగా నమ్మివుంటే చాలు చాలన్నా వానితోటి సాటెవ్వరన్నా" అన్నారు అంతే కాకుండా "కనరాని దాన్ని శూన్యంబని యనదగుగాని బయలు ననదగదుసుమీ; కనవచ్చుచున్న దిందులో కనుగొనుటకు ఎరుకలేదు గనుగొనరాదా, ఎరుకనే శూన్యమని యనరాదా! అన్నారు పరిపూర్ణ పరబ్రహ్మమందూ ఎరుక లేదు. అంతే కాకుండా "నిరతాము గురుసేవ పరతంత్రులగుచు తత్కరుణకు పాత్రులై యెరుక మాలిన వారికెరుక వున్నదా? వున్నదంటే నరకామేగాదా?" అన్నారు. అట్లా అనేవాడు గురుద్రోహియే.

ప్రశ్న : **ఆత్మముందు జనించినదా లేక పంచభూతములు ముందు జనించినవా?** (210)

జబాబు : విత్తుముందా? లేక చెట్టుముందా? వంటిదే యీ ప్రశ్నయున్నూ. దీనికొక విధంగా వెనుక జవాబు వ్రాయడమైనది యీ ప్రశ్ననే మరియొక విధంగా అడగాలంటే సూక్ష్మము ముందా లేకస్థూలము ముందా అని అడిగినట్లే ఆత్మ సూక్ష్మము, పంచభూతములు స్థూలము. భావవాదులు సూక్ష్మమగు ఆత్మనుండియే స్థూలరూపజగత్తంతయు పుట్టినది అందురు. ఇందుకు "తస్మాద్వా ఏతస్మాదాత్మనః ఆకాశస్సంభూతః ఆకాశాద్వాయుః...." అనిన్ని "సదేవసొమ్యే దమగ్ర ఆసీత్" అనిన్ని శ్రుతి ప్రమాణము లీయగలరు. భౌతిక వాదులుస్థూలమే ముందు కల్గినది దానినుండియే సూక్ష్మము కల్గినదని వాదింతురు. బిడ్డ కలిగిన తర్వాత తెలివి విజృంభించినది అని దృష్టాంతమిత్తురు "అసదేవ సొమ్యేదమగ్రమాసీత్ తతోవై సదజాయత" అని శ్రుతి కూడ ఒక విధంగా యిందుకు ప్రమాణ మీయవచ్చును దీనికి పరిపూర్ణ భావజ్ఞుల పరిష్కారమేమి? స్థూల సూక్ష్మములు ఒకదాని నొకటి విడచి యుండవు. విత్తనములో చెట్టు. చెట్టులో విత్తనము ఒక దాని యందొకటి సూక్ష్మరూపంగా నున్నవి. రెండూ కలసియే పుట్టుచున్నవి. కలసియే పోవుచున్నవి. "ఆకాశాదిక, భూతనికాత్మకమగుచు యెరుక యీ జగమయ్యేన్" అనిన్ని "జగము వలన సంకల్పము జగమా సంకల్పమువలన జనియించును. అనిన్ని కందార్థములలో స్పష్టపరచినారు. కనుక ఆ రెంటిలో ఏది ముందు పుట్టును? అంటే రెండూ కలసియే పుట్టుచున్నవి. కనుక ఆత్మ తనయందు పంచభూత బీజములను ధరించేయే ఆవిర్భవించును "శిశువునందు మొదట తెలివి లేదు, తర్వాత తెలివి కల్గినదని" యనరాదు బీజరూపమున నున్న తెలివి క్రమశః వికాసము చెందినదని చెప్పవలెను.

ప్రశ్న : **తాననే తెరదీస్తే అంతా బట్టబయలే అంటున్నారు. తాననే తెరదీసే వరకూ అయినా సాధన కావలెనా? వద్దా?** (211)

జవాబు : తప్పకుండా కావలెను! తాననే తెరతొలగించుకోవాలనుకొన్న వాడు ముందుగా పూర్ణ గురువుని ఆశ్రయించి గురుసేవ, గురు నిష్ఠలయందేమరక. గురూపదిష్ట మార్గమున నడచి

గురుకృపకు పాత్రుడు కావలెను. అది అంతయూ సాధన కాదా? "ఎరుక (తానుఅనే తెర) తనకు దావీడిపోదు, ఎరుకను విడిపించలేరు యెవ్వరు దాత్రిన్ గురుదొకడదప్ప; గురునకు పరిచర్యయొనర్చి" అవిన్నీ "అపరోక్షమౌనే మనుజులకు పరోక్షంబైన బయలు గరుకృపలేకన్..." అంటూ గురుకృపా ప్రసాదసిద్ధికై గురునకు పరిచర్యగావింపుమన్నారు అనుష్ఠానము ఆచరణ మొదలగునవే గురునికి చేయు పరిచర్యలని తెలియవలెను. ఏ సాధన నీకెందుకు, వీసానికి పనికిరాదు అన్నారు గదా, అనుకొని ఎప్పుడూ, ఎవరికీ, ఏ సాధనా అక్కరలేదని అర్థం చెప్పుకొంటే అది చాలా పొరపాటు, సాధన సంపత్తి గల నరుడు వచ్చినాడు. గనుక వానితో "ఏ సాధన నీకెందు" కన్నారు. ఆత్మ నిశ్చయమగు వరకు సర్వసాధనలు ముఖ్యంగా కావలసినవే. అంతే కాదు యావజ్జీవమూ, శిష్యుడు, గురుసేవాదికమునందు జాగరూకుడై యుండవలెను. అందుకే "పరిపూర్ణ బోధ తెలిపే పర్యంతము సేవజేసి బహునమ్మికగా, తరువాతను గురుమూర్తిని మరి కన్నులగనని వాని మార్గము ఛీ ఛీ అన్నారు". కందార్థాలలో పరిపూర్ణబోధ ఏసాధన లేని బోధఅని ఎందుకన్నారు? అంటే సాధకుడు, సాధన సిద్ధి అను త్రిపుటి లేనిదే పరిపూర్ణ పరబ్రహ్మము ఎల్లపుడూ స్వతస్సిద్ధమైయున్న దానికి సిద్ధిలేదు. సాధన లేదు సాధకుడు లేడు. కనుక సాధన లేని బోధయని ఆ పరిపూర్ణము సాధనాంతర నిపేక్షకమనీ అన్నారు.

**ప్రశ్న : శక్తి పదార్థముగాను, పదార్థము శక్తిగాను పరిణామం చెందుచున్నట్లు పదార్థ విజ్ఞాన శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఇది యెంత వరకు నిజం? ఎట్లు?**

జవాబు : పూర్తిగా నిజం, శక్తి సూక్ష్మంగా ప్రతిపదార్థమునందు ఉన్నది. పదార్థము స్థూలము. దాని సూక్ష్మం దానియందే గుణరూపంగానో శక్తిరూపంగానో తెలివి రూపంగానో వున్నది. శక్తి చలనమున్నపుడే బహిర్గతమగుచున్నది. లేనపుడు బీజరూపంగా యుంటున్నది. ఆత్మ యొక్క చేతన సత్తాయే శక్తి. అదే ప్రకృతి ఆత్మయందు తొలుత జ్ఞానరూపంగా నున్న తెలివి చలనాత్మకమై (చలించి) ప్రాణరూపము చెందును. యీ ప్రాణము యింకనూ చలించినపుడు శక్తి యుత్పన్నమై సృష్టి కార్యము నందు సమర్థవంతమగుచున్నది. దీనినే ప్రాణశక్తియని కొందరూ మాయాశక్తి యని కొందరూ పల్కుచున్నారు. యీ శక్తి యంతయు తొలుత ఆత్మయందే గర్భీకృతమైయున్నది కనుకనే "తేనవినాతృణాగ్రమపినచలతి" అనగా దానిశక్తిలేనిచో గడ్డిపోచ అయిననూ కదలజాలదని అర్థము. సర్వశక్తిమంతము అన్నారు. సృష్టికి పూర్వమున్న ఆశక్తియే అందుకే అది స్థూల రూపమగు సృష్టిగా పరిణమించినది అని వేదాంతులు చెప్పనది యదార్థమేని నేటి వైజ్ఞానిక శాస్త్రము ఋజువు చేయుచున్నది. పదార్థరూపమగు పరమాణువును కూడా విశ్లేషంగావించి అందుండి అణుశక్తిని గ్రహించి నేడు విజ్ఞాన శాస్త్రజ్ఞులు యాటంబాంబులను తయారు చేస్తున్నపుడు పదార్థము శక్తిగా మారుచున్నదనుట స్పష్టమే గదా. నీరు ఆవిరియై శక్తిగా మారుటలేదా? జలములో సూక్ష్మరూపంలో నున్న విద్యుచ్ఛక్తిని

పదార్థములోనికి ఆకర్షించుట లేదా? కనుక పదార్థము శక్తిగా, శక్తి పదార్థముగా మారుట వైజ్ఞానికముగ పరమ సత్యము.

ప్రశ్న : **బృహద్వాశిష్ఠ సిద్ధాంతమనగా నేమి?**

జవాబు : వాశిష్ఠమనగా, వశిష్ఠుల వారు (మహర్షి) రచించిన గ్రంథమని యొక అర్థము శ్రేష్ఠమగునది అని మరియొక అర్థము యోగవాశిష్ఠము ముప్పది రెండువేల శ్లోకములతో గూడినది. వశిష్ఠులవారు రచించినారు అందుండు జ్ఞానపరమైన ఆరువేల శ్లోకములు గ్రహించి దానికి జ్ఞానవాశిష్ఠమని పేరిడినారు. లఘు వాశిష్ఠమని మరియొక గ్రంథము గూడనున్నది. వీని యన్నిటికంటే వేరైనది బృహద్వాశిష్ఠ గ్రంథము "ఆత్మాతీతం కేవలాత్మ" అన్నట్లుగా అతీతమగు కేవలాత్మ (పరిపూర్ణపరబ్రహ్మము) విషయకమై యున్నది. కనుక యీ గ్రంథమునకు బృహద్వాశిష్ఠమన్నారు. బృహత్ అనగా పెద్దది. లేక గొప్పది యని అర్థము. ఆత్మ కంటే కేవలాత్మ అతీతమైనది, గొప్పది, కనుక దీనికి బృహద్వాశిష్ఠమని పేరు పెట్టబడినది. దీనిని రచించిన వారు పరిపూర్ణ బోధ ప్రవక్తయగు శ్రీ మద్రామడగు శివరామదీక్షితుల వారు. కనుక దీనికి శివరామదీక్షితీయమని కూడ పేరు.

ప్రశ్న : **దైవము అనుకూలించనిచో మానవప్రయత్నం మక్కరకు రాదా?**

జవాబు : కం॥ కర్మమున బుట్టు జంతువు, కర్మమునకు వృద్ధిపొందు, కర్మమున జెడున్, కర్మయే జనులకు దైవము, కర్మము సుఖదుఃఖములకు కారణమదిపా॥ కనుక యీ సందర్భములో కర్మమన్నా, దైవమన్నా, విధియన్నా, యోగమన్నా, అదృష్టమన్నా సమానార్థకములుగా గుర్తించనగును. దైవమనుకూలించనిచో అనే మాటలకు అట్టియోగము లేకున్నచో, అదృష్టము లేకున్నచో, పెట్టిపుట్టనిచో, అట్టి ప్రారబ్ధము లేకున్నచో అని అర్థము గ్రహించవలెను. ఈశ్వరుడు (లేక దైవము) జీవుల కర్మానుసారము ఫలములనిచ్చువాడు మాత్రమే. జీవుడు కర్మచేసి ఆ ఫలితము పొందుటకు యోగ్యుడు అయినపుడే ఈశ్వరుడు ఆ ఫలమిచ్చును. కాని అనర్హులకు ఆ ఫలమిచ్చుటకు ఈశ్వరునికి కూడా శక్తిలేదు. పోస్టుమ్యాన్ నీకు ఎంత మనియార్డరు వస్తే అంతే నీకిచ్చును. నీకు మనియార్డరే రాకపోతే ఏమీ యివ్వనే యివ్వడు.

ప్రశ్న : **పురుషాకారముచే ఏమైన సాధించగలమా?**

జవాబు : తప్పకుండా సాధించగలము. కాని ఆ సిద్ధి ఎప్పడు కల్గునో మాత్రం చెప్పలేము. చేసిన కృషి యెన్నడూ వృధాపోదు. కృషికి తగ్గ ఫలితము తప్పక వచ్చును. ఫలితములు రెండు రకములు 1) దృష్ట ఫలము 2) అదృష్టఫలము. దృష్టఫలము వెంటనే కల్గును. ఇక్కడ కార్యకారణ సంబంధము ప్రత్యక్షముగా గోచరించుచుండును. అదృష్టఫలము అనగా కారణము గానరాని ఫలము. లాటరీలో బహుమతి యిట్టిదే ఇక్కడ కార్యకారణ సంబంధము

కుదరగా లాటరీ టికెట్టు కారణము కాదా? అని ప్రశ్నించవచ్చుగాని లాటరీ టిక్కెట్లు కొన్నా వారందరికీ బహుమతులు వచ్చేయా? నీకే రానేల? నీపూర్వజన్మలలో చేసిన యే పుణ్యకర్మఫలమో ఫలప్రాప్తికి వచ్చియుండవలెను. ఆ కర్మమేదియో నీకు కానవచ్చుట లేదు. కనుక యీ ఫలితమును అదృష్టఫలము అని అన్నారు. అట్లే యీ జన్మలో నీవు పురుషప్రయత్నముచే సాధించదలచిన ఫలము యీ జన్మలో నీకు లభించినంత మాత్రాన అది నిరర్థకమైపోయినదని నీవు భావించరాదు. ఆ కర్మ ఒక అదృష్టమును సృష్టించును. అది నీయొక్క రాగల జన్మలలో ఫలప్రాప్తికి రావచ్చును. ముఖ్యముగా నీవు చేయు సుకృత దుష్కృతములు, పుణ్య పాపములను కల్గించి అదృష్టఫలములుగా వచ్చే జన్మలయందు నీకు అనుభవమునకు రాగలవు. అట్లే నీ పారమార్థిక కృషికూడా యీ జన్మలో ఫలప్రాప్తికి రాకపోయినను చింతింప పనిలేదు. దాని ఫలము వచ్చే జన్మలోనైనా అదృష్టఫలమై నీకునిర్హేతుకంగా ప్రాప్తించగలదు.

216 ప్రశ్న : **పరబ్రహ్మము లేక పరమాత్మ అఖండమని మహర్షులు వాక్రుచ్చినారు అట్టి అఖండమైన వస్తువునుండి లక్షాంతర జీవాత్మలు ఎట్లు వచ్చినవి?**

జవాబు : ఒక్క పరిపూర్ణ పరబ్రహ్మమే ఖండాఖండములు గానిది. సృష్టికారణమగు బ్రహ్మము కేవల అఖండ వస్తువు కాదు. ఖండా ఖండములుగా ద్వంద్వ స్వరూపము చెందుట దాని సహజ స్వభావము ఖండాఖండరూపమగునట్టి బ్రహ్మము నుండి దానికి వేరై జీవాత్మలు రాలేదు. ఆ పరబ్రహ్మమే అనేక జీవరూపములుగా తోచబడినది లేక మార్పు చెందినది.

"సయథోర్ణనాభిస్తున్తునోచ్చరేద్యథాగ్నేః క్షుద్రావిస్ఫులింగావ్యుచ్చరన్తేన మేవాస్మాదాత్మనః సర్వేప్రాణా సర్వేలోకా స్సర్వే దేవాః సర్వాణి భూతాని వ్యుచ్చరన్తిః (బృహదారణ్యకం)

తా॥ ఏ విధముగా సాలెపురుగు దారమును పైకి తీయునో, అగ్నినుండి మిణుగురులే విధంగా బయల్వెడలునో, అదే విధంగా ఆత్మనుండి సర్వప్రాణులు సర్వలోకములు సర్వదేవతలు సమస్త భూతములు బయలు వెడలును ఎట్లువచ్చినవి? అని మీ ప్రశ్న. వేసవిలో ఆవిరై పైకిపోయి ఆకాశావరణములో సూక్ష్మరూపములో ఎంతమాత్రం కానరాక అణగి మణగియున్న సముద్రజలములు తొలకరించగనే యెట్లు తొలుత కారుమేఘములై పిదప యెట్లు వర్షించుచున్నవో, తిరిగి వేసవిలో ఆవిరియై పైకి పోవుచున్నవో, అట్లే సంచర ప్రతిసంచరపద్ధతిగా అవిర్భావతిరోభావములు చెందుట. సృష్టికి పూర్వం అఖండంగా నున్న ఆ పరమాత్మకు సహజమైనున్నది.

217 ప్రశ్న : **నేను పుట్టకముందు, పుట్టిన తర్వాత, పోయిన తర్వాత ఆత్మయొక్క స్థానములేవి?**

జవాబు : నేను పుట్టకముందు అంటే నేను అనగా ఆత్మ అర్థం చెప్పరాదు. ఏలనంటే ఆత్మ పుట్టకముందు ఆత్మకు స్థానమేమి? అని అడిగినట్లు అవుతుంది. దానికి మూలము లేదు.

పరిపూర్ణమందు స్థానమూ లేదు అని సిద్ధాంతం కనుక యిక్కడ నేను అనే మాటకు నా స్థూలము పుట్టకముందు అనే అర్థం మాత్రమే గ్రహించాలి గదా, నా యొక్క శరీరము పుట్టకమందు నా యాత్మ, నీ యాత్మ అని అనేకాత్మలు చెప్పరాదు, ఆత్మయొక్కటే నా యందు కూడా యిపుడు గానవచ్చే ఆత్మ నా శరీరం రాకముందు అఖండాత్మగానే వున్నది. ఇల్లు కట్టకపూర్వం ఆస్థలంలో వుండే ఆకాశము మహాకాశముగానే వుండి యిల్లు కట్టి న తర్వాత యింటిలో ఆకాశము యింటిబైట ఆకాశమని పేర్లు వచ్చినట్లే నాయాత్మయని, నీ ఆత్మ అనీ పేర్లు మాత్రమే గాని అందరి యందలి ఆత్మ ఒక్కటే శరీరం రాకముందు, వచ్చిన తర్వాత, పోయిన తర్వాత, యీ మూడు కాలముల యందు ఆత్మ అఖండ రూపముగానే యేకస్థానమునందే వున్నది. అందు శరీరములు మాత్రము వచ్చి పోవుచున్నవి. కనుక ఆత్మ స్థానములు మారుటలేదు.

ప్రశ్న : **కందార్థములలో"తనువుతో వచ్చిన యెరుకే, తనువును తనవనుచు, తనను తానని యెరుగున్, తనువును బాసిన మీదట తన, నా దేహమును రెంటిని, తానెరుగదెపుడూ అది గనుక తాలేనేలేదెపుడూ అన్నారు గదా! అందరి తనువులు ఒకటా? వేర్వేరా? ఒకటంటే, ఆతనువుతో అందరికి యెరుకపోవలదా?** (218)

జవాబు : వ్యష్టి యందు ఎవరి తనువు (అనగా దేహము) వారిదే గాని అందరి తనువులు ఒకటిగాదు ఒకటే అయితే ఒక శరీరానికి గలుగు సుఖదుఃఖాలు అన్ని శరీరాలకు ఏకకాలమందే రావాలి అంతేగాదు. అన్ని శరీరాలు ఒకేసారి పుట్టాలి, ఒకేసారి చావాలి. సమిష్టియందు అన్ని శరీరములు కూడా విరాట్ పురుషుని శరీరములోనివే అనగా జగత్తులోనివే కనుక ఆ దృష్ట్యా అందరి తనువులు ఒకటే అపుడు ఎరుక, జగత్తు అని రెండే, ఆ జగత్తే యెరుకకు తనువు, ఆతనువు పోతే యెరుక పోకుండా నిల్వదు. ఆ రెండూ ఒకేసారి వచ్చినవి ఒకేసారి పోతవి. కనుక జగత్తు మాత్రం పోయింది. ఎరుక శాశ్వతంగా వుంటుంది అని చెప్పరాదు. అట్లే వ్యష్టియందు తెలివి, దేహము అనురెండూ కలసియే వస్తున్నవి. కలసియే పోతున్నవి. దేహము లేకుంటే తెలివి ఏ ప్రకారం పనిచేయగలదు. యిట్లా వ్యష్టి సమిష్టుల రెంటి యందూ తనువులతో లేకుండా పోయే యెరుక కూడా అశాశ్వతమే అనాలి గాని శాశ్వతమనరాదని భావము.

(219)

ప్రశ్న : **శ్రీమహావిష్ణువు ఒక పూర్ణగురువనిపరంపరలో చెప్పుకొనుచున్నాము గదా, ఆయనకు జన్మరాహిత్యము కలుగవలసివుండగా నానా అవతారములు యెత్తి జన్మించవలసి వచ్చిన దెందుచేత?**

జవాబు : వైకుంఠమను లోకమును పాలించుచూ జీవులను పోషించు వ్యక్తి విష్ణువని యెంచేయెడల, పోషించవలసిన జీవులున్నంతవరకు వారి పోషణ కార్యమును వహించు

విష్ణువున్నూ వుండవలసినదే. భ్రాంత రహితుడై నపూర్ణపురుషుడు ప్రారబ్ధ శరీరము పడిపోవు వరకు యెట్లు నిలచి యుండక తప్పదో అట్లే విష్ణు ప్రళయంబగువరకు విష్ణువెంత భ్రాంతి రహితం సాధించినా నిలచి యుండక తప్పదు. అంతవరకు దుష్టశిక్షణ, శిష్టరక్షణ తన విధాయక ధర్మములే గనుక అందు కవసరమగు అవతారములు యెత్తుచుండవలసినదే. ఐనను అతడు పూర్ణ పురుషుడు కనుక అంతఃకరణ వికారములు సంతోషా సంతోషములు లేక తన విధాయక కార్యములు అన్నియు నిర్వర్తించుచుండును.

220 **ప్రశ్న : కందార్థములు మానవులకే ఎందుకు సంబోధించాలి?**

జవాబు : విచక్షణా రూపమైనటువంటిన్ని వివేక యుక్తమైనటువంటివి బుద్ధి 84 లక్షల జీవరాశులలో ఒక్క మానవునకే గలదు. వ్యవహార రూపమైన వైఖరీ వాక్కును కలదు. దేవలతకైతేనో కర్మ శరీరమే లేదు, మనస్సు, వాక్కు, శరీరము అను త్రికరణములు ఒక్క మానవునిలోనే సంపూర్ణ వికాసము చెందినవి. జ్ఞాన కర్మ మార్గముల రెండికి యోగ్యమైన పరికరములొక్క మానవుల యందేకలవు. కనుక మానవులను మాత్రమే సంబోధించుట జరిగినది.



Pages : 59-125-107
40-19-16